




ముఖచిత్రం : మాఘపూర్ణిమ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# యువ చందా వివరాలు

యువ సాలు చందా రు 37-00 దీపావళి సంచికతో రు. 44-00. దీపావళి సంచిక రిజిష్టర్ పోస్టులో పంపగోరువారు రు. 2-25 పైసలు అదనంగా పంపాలి.

పబ్లిషరు
యువ




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 39 ఫిబ్రవరి 1979 సంచిక 2

తిరుమల తిరుపతి దేవస్థానము నిధులలో రెండుకోట్ల రూపాయల వ్యయంతో, భక్తిప్రధానమైన గ్రంథాలను ప్రకటించడం జరుగుతుందని, రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి డిసెంబరు 14 తేదీన తిరుపతిలో చెప్పారు. ఇది ముదావహమైన విషయం.

భక్తిప్రధానమైన గ్రంథాలు, తెలుగు సంస్కృతి భాషలలో విరివిగా వున్నాయి. వానిలో చిన్న చిన్నవి చాలా అచ్చు అయి, కావలసినవారికి దొరుకుతూనే వున్నాయి. పెద్ద గ్రంథాలు కొన్ని అచ్చు అయివున్నా, వాటి ధర చాలా హెచ్చుగా వున్నందున కావలసినవారందరూ కొనుక్కోలేక పోతున్నారు.

భక్తిప్రధానమైన గ్రంథాలు అంటే, భగవద్గీత, భాగవతములను మాత్రమే పరిగణించడానికి వీలులేదు. మన పురాణాలన్నీ భక్తిప్రధానమైనవే. పద్దెనిమిది పురాణాలలో ఏ అయిదారో తప్ప, తక్కినవి తెలుగు లిపిలోగాని, తెలుగు అనువాదంలోగాని లభించడంలేదు. తెలుగు అనువాదంలో వున్నవి కూడా ముక్తసరి అనువాదాలే గాని, ప్రతి శ్లోకానువాదాలు కావు. మన పూర్వ సాహిత్యం ఎక్కువగా సంస్కృత భాషలోనే వుండిపోయింది. మన పూర్వ సంస్కృతిని గురించి తెలుసుకోవాలంటే, పురాణాలే ఆధారము. కాని, ఆ పురాణాలు పూర్తి అనువాదాలుగా తెలుగుభాషలో లేవు.

జర్మను, రష్యను, పోర్చుగీసు, ఇంగ్లీషు మొదలైన పాశ్చాత్య భాషలలోకే గాక, బెంగాలీ, మరాఠీ, హిందీ మొదలైన కొన్ని భారతీయ భాషలలోకి కూడా పూర్తిగా అనువదించబడిన, పురాణాలు తెలుగు లిపిలోగాని, తెలుగు అనువాదాలలోగాని ఇంతవరకు ప్రచురింపబడలేదంటే, చాలా శోచనీయమైన విషయం.

పురాణాలన్నిటినీ, ఎడమ ప్రక్క పుటలో సంస్కృతమూలము, కుడిప్రక్క పుటలో తెలుగు అనువాదం వుండేటట్టుగా ప్రచురించవలసిన అవసరం ఎంతో వుంది. పురాణాలలోని కథలు ఎన్నో విడివిగా ప్రకటితమయాయిగాని, పురాణాల మూలగ్రంథం సంపూర్ణంగా ప్రకటితం కాలేదు. పురాణాలలోని విషయాలను నమ్మేవారుగాని, నమ్మనివారుగాని తమ అభిప్రాయాలను స్థిరపరచుకోవాలంటే, మూలగ్రంథాన్ని చదవాలి. అందరికీ సంస్కృతభాష రాదు. అంచేత సంస్కృత మూలంతో తెలుగు అనువాదం వున్న గ్రంథం కావాలి. అలాటి గ్రంథాలను అచ్చువేయించడం చాలా వ్యయ, ప్రయాసలతో కూడిన పని. ప్రయాస భరించడానికి ఎందరైనా ఉద్యుక్తులు కావచ్చునుగాని, వ్యయాన్ని భరించే స్తోమత వ్యక్తులకుగాక సంస్థలకే వుంటుంది. తెలుగు ప్రచురణ సంస్థలు యీ పనికి యిన్నాళ్లూ పూనుకోలేదంటే, వ్యయ ప్రయాసలు భరించలేకనే. అంచేత యీ పనిని ప్రభుత్వంగాని, యూనివర్సిటీలుగాని, తిరుపతి దేవస్థానంలాంటి సంస్థగాని చెయ్యాలి. ఇతరులవల్ల అవదు.

పద్దెనిమిది పురాణాలనూ, వీలైతే నాలుగు వేదాలనూ, తెలుగులో అనువదింపజేసి, వాటిని ప్రకటించాలంటే పదేళ్లకన్న తక్కువ పట్టదు. అంతకాలం పట్టే పనిని, వాణిజ్య ప్రచురణ సంస్థలు చెయ్యలేవు, ఇలాటి సందర్భంలో, తిరుపతిదేవస్థానంవారివల్ల ఇలాటి ఉత్కృష్టమైన కార్యం సాధింపబడుతుందంటే, సంస్కృతి ప్రియులు, భాషా ప్రియులు మాత్రమేకాక ఆస్తికులందరూ కూడా సంతోషిస్తారు. తిరుపతి దేవస్థానానికి వచ్చే డబ్బు అంతా ఆస్తిక ప్రజానీకం సమర్పించేదే. ఆ డబ్బులో ఒక స్వల్ప భాగం ఆస్తిక జనప్రీతికరమైన గ్రంథాల ప్రచురణకు ఉపయోగింపబడటం అన్ని విధాలా సంతోషింపదగిన విషయమే.

తెలుగుదేశంలో, సంస్కృత భాషా వైదుష్యం క్రమేపీ తగ్గిపోతున్నది. అగ్రగణ్యులైన పండితులు జీవించివుండగానే, వారిచేత పురాణాలను అనువదింపజేస్తే బాగుంటుంది. అంచేత, యీ గ్రంథాల ప్రకటనకు సంబంధించిన కృషి వెంటనే ఆరంభమయేటట్లు చూడవలసిందని, ముఖ్యమంత్రినీ, తిరుపతి

దేవస్థానంవారినీ కోరుతున్నాము. ఒకప్రక్క అనువాదం జరుగుతూవుంటే, మరొక ప్రక్క ముద్రణ కార్యకలాపం గూడా సాగిందంటే, యీ గ్రంథాలను ఎక్కువ ఆలస్యంలేకుండా పాఠకులకు అందించవచ్చును.

తిరుపతి దేవస్థానం ధర్మదాయసంస్థ కనుకనూ, పురాణాల ప్రకటన సర్వ పాఠక ప్రజలకూ ఉపయోగకరమైన కార్యం గనుకనూ, యీ గ్రంథాల ప్రచురణలో లాభంకోసం చూడక, వాటి ధరను కేవలం ప్రచురణ ఖర్చులకు పరిమితంచేసి, వీలైనంత తక్కువ ధరలో పాఠకులకు లభించేటట్లు చూడవలసి వుంటుంది.




మళ్ళీ నవ్వింది ఆ అమ్మాయి కాశీనాథ్ కళ్ళలోకి చూస్తూ.

కాశీనాథ్ బదులుగా నవ్వలేదు. ఆలోచనగా చూసాడు ఆ అమ్మాయి వంక. దాదాపు పది నిముషాలుగా బస్సు కోసం నిలబడివున్నాడు కాశీనాథ్. అయిదు నిమిషాల క్రితం వచ్చింది ఆ అమ్మాయి.

రాత్రి పదిన్నరవుతోంది కాబట్టి చార్‌మినార్ చౌరస్తాలోని ఆ బస్‌స్టాప్ నిర్మానుష్యంగా వుంది. ఆ అమ్మాయి వచ్చిన అయిదు నిమిషాల్లో అరడజను సార్లయినా నవ్వింది కాశీనాథ్ వంక చూసి.

కాశీనాథ్‌కి ఆ అమ్మాయిని ఎక్కడా ఇదివరకు చూసిన గుర్తులేదు.

దగ్గరకు వచ్చి అడిగింది ఆ అమ్మాయి.

"టైమెంతయింది?"

"వాచీలేదు నా దగ్గర. పదిన్నర అవుతుండొచ్చు." చెప్పాడు కాశీనాథ్.

"మీరు ఎటు వెళ్ళేది?" అడిగింది.

"రాంనగర్ గుండు."

"నేనూ అక్కడికే."

కాశీనాథ్ మౌనంగా ఉండిపోయాడు.

"బస్సు వస్తుందో, రాదో" తనలో తను అనుకున్నట్లుగా మెల్లిగా **అన్నది** ఆ అమ్మాయి.

కాశీనాథ్ బస్సుకోసం ఎదురుచూడసాగాడు.

"రిక్షాలో వెళదామా?"

కొన్ని క్షణాల మౌనాన్ని భగ్నం

చేస్తూ హఠాత్తుగా అడిగింది ఆ అమ్మాయి సుతారంగా.

కాశీనాథ్ ఈసారి తేరిపార చూసాడు ఆమె మొహంలోకి.

"మీ దగ్గర ఓ యాభై రూపాయ లున్నాయా?" రహస్యంగా అడుగుతున్నట్లుగా అడిగింది మెల్లిగా.

"దేనికి."

"మీకు తెలీదా?"

గలగలా నవ్వింది.

కాశీనాథ్ మాట్లాడలేదు.

"సెకండ్ షో సినిమా విడిచిపెట్టే టైందాకా వుంటాను. మీరు బ్రహ్మచారేనా?"

"అవును."

"రామ్‌నగర్‌లో గది తీసుకుని వుంటున్నారా?"

"అవును."

"నేనుండేది విద్యానగర్. రమ్మంటే వస్తాను లేకపోతే రిక్షాఎక్కి విద్యానగర్ వెళ్ళిపోతాను."

"వెళ్ళండి."

"మీ దగ్గర అంత లేదా, పోనీ నలభై..."

"వద్దు. వెళ్ళండి."

నిరాశ తళుక్కుమంది ఆమె మొహంలో

రిక్షాలు ఆగివున్న చోటికి నడవ సాగింది ఆమె మెల్లిగా. మధ్యలో రెండుసార్లు వెనక్కి తిరిగి చూసింది కాశీనాథ్ వంక.

కాశీనాథ్ నరాల్లో, రక్తనాళాల్లో కదలిక ప్రారంభం అయింది. ఈ చలిరాత్రి తన ప్రక్కలో ఆమె వెచ్చటి వళ్ళు....

తటపటాయించి గబగబా ఆమెవైపు అడుగులు వేసాడు.

"మాటు." పిల్చాడు నడుస్తూ.

ఆమె మీటనొక్కిన బొమ్మలా వెనక్కి తిరిగి మళ్ళీ నవ్వింది అందంగా.

"ఏమిటి?" అడిగింది.

"ముప్పై వున్నాయి."

"ఇంకో అయిదున్నాయేమో చూడండి."

"లేవు."

"అయితే పాతికివ్వండి. ఓ గంట వుండి వెళ్ళిపోతాను."

"ఇందాక చాలా సేపు వుంటా నన్నారు?"

మళ్ళీ గలగలా నవ్వింది.

"రిక్షా మాట్లాడండయితే."

"బస్సు వచ్చేస్తుంది."

"నే నిస్తాలెండి రిక్షా డబ్బులు."

మళ్ళీ గలగలా నవ్వింది.

రిక్షా మాట్లాడాడు కాశీనాథ్ ఇద్దరికీ. టాపు వేసిన ఇరుకు రిక్షాలో బయల్దేరారు.

"నా పేరు కాశీనాథ్." చెప్పాడు.

ఆమె మాట్లాడలేదు.

జేబులోంచి సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె తీస్తూ అడిగాడు.

"తాగొచ్చా?"

"తప్పనిసరి అనుకుంటే తాగచ్చు. ఫర్వాలేదు."

కాశీనాధ్ సిగరెట్ కాల్చకుండా మళ్ళీ రెండింటినీ జేబులోకి తోసేసాడు.

గతుకుల రోడ్లో ఆమెవళ్ళు మెత్తగా తగులుతోంది కాశీనాధ్‌కి.

"ఇక్కడ దిగిపోదాం." అన్నది రిక్షా రామ్‌నగర్ గుండు చేరగానే."

కాశీనాధ్ రిక్షా ఓగి తనే డబ్బులిచ్చే శాడు రిక్షావాడికి.

నాలుగు నిమిషాల్లో ఓ పెద్దయింటి గేటు తెరిచి లోపలికి వెళ్ళాడు కాశీనాధ్. ఆ అమ్మాయి కాశీనాధ్ వెంట నడిచింది.

ఎదురుగా మూడంతస్తుల పెద్దమేడ. ఆమేడ ప్రక్కనుంచి, క్రోటన్‌మొక్కల మధ్యలో వెనకవైపుకి చిన్న కాలిబాట.

ఆ మేడ వెనకాల పెద్ద ఖాళీస్థలం. స్థలంనిండా రకరకాల మొక్కలు, చెట్లు. ఓ మూలగా విసిరేసినట్లుగా వుందో చిన్న గది.

కాశీనాధ్ జేబులోంచి తాళంచెవి తీసి ఆ గది తలుపు తెరిచాడు. బయటే నిల బడింది ఆ అమ్మాయి.

గది లోపల చీకటి.

ఓ నిమిషం తర్వాత అగ్గిపెట్టె గీసిన చప్పుడు. గదంతా మందమయిన వెలుగుతో నిండింది.

"రండి."

పిల్చాడు కాశీనాధ్. ఆ అమ్మాయి లోపలికి రాగానే గది తలుపులు మూసి లోపల గడియపెట్టాడు.

ఆ గదివంక పరిశీలనగా చూసింది ఆ అమ్మాయి. చేతులు రెండూ పైకెత్తితే తగిలేంత ఎత్తులోవున్న ఏస్‌బెస్టాస్ రేకులు ఆ గది కప్పు. ఓ ప్లాస్టిక్ బకెట్, ఓ ఇనప బకెట్, చిన్న స్టవ్. ఓ మూల ఖాళీ బీర్ బాటిల్‌లో సగందాకా వున్న కిరసనాయిలు, రెండు చాపలు. ఒకటి నేలమీద పరచబడి వుంది. పైన మాసిపోయిన దుప్పటి, దిండు. పుస్తకాలు కొన్ని అడ్డదిడ్డంగా పడివున్నాయి. ఓ మూలగా హేమామాలిని కాలండర్ ఒకటి, దాని ప్రక్కనే అద్దం పగిలిన ఓ ఫోటో వేలాడుతున్నాయి. కిటికీకూడా లేదు ఆ గదికి.

"ఇదే నా గది" కొద్దిగా ఇబ్బందిగా అన్నాడు కాశీనాధ్.

చాపమీద దుప్పటిని సరిచేసి దానిమీద కూర్చుంది ఆ అమ్మాయి.

"ఎవరూ రారా?" అడిగింది కాశీనాధ్ లాంతరు వత్తిని తగ్గిస్తుంటే.

"ఊహూ. నేనొక్కడ్నే వుంటున్నాను."

"ఎంత దీనికి అద్దె?" అడిగింది.

"ముప్పై."

"చవకే."

కాశీనాధ్ నవ్వాడు. అతను కూర్చోటానికి ప్రక్కకు జరిగింది ఆమె

కూర్చున్నాక కాశీనాథ్ భుజంమీద చేతులువేసి బుగ్గమీద ముద్దుపెట్టుకుంది.

"గడ్డం గీసి ఎన్నాళ్ళయింది?" నవ్వుతూ అడిగింది.

కాశీనాథ్ వెంటనే లేచాడు. మళ్ళీ లాంతరు వత్తి పెద్దదిచేసి గడ్డంసామాను బయటకుతీసి పది నిమిషాల్లో గడ్డం గీసుకున్నాడు.

నవ్వుతూ చూస్తూండిపోయింది ఆ అమ్మాయి కాశీనాథ్ వంక.

కాశీనాథ్ జేబులోంచి మూడు పది రూపాయల నోట్లు తీసి అందించాడు ఆ అమ్మాయికి.

ఆ అమ్మాయి జాకెట్‌లోంచి చిన్న పర్సుని బయటికితీసి ఆ డబ్బు పర్సులో పుంచుకుని దాన్ని దిండుక్రింద పుంచి లాంతరు వత్తి తగ్గించింది.

"మీ పేరు?" అడిగాడు ప్రక్కన కూర్చుంటూ.

"మీకే పేరు ఇష్టం?" అడిగింది వెంటనే.

"ఏం?"

"ఆ పేరుతో పిలవండి."

"అలా వద్దు. మీపేరు చెప్పండి."

"ప్రణయశీల."

"ప్రణయశీలా?"

"అవును."

"గమ్మత్తుగా పుంది. ఇది మీ వాళ్ళు పెట్టిన పేరా లేక మీరు మధ్యలో మార్చుకున్నారా?"

జవాబుగా గలగల నవ్వింది.

కాశీనాథ్ రెండుభుజాలమీద చేతులు వేసి మీదకి లాక్కుంది. కాశీనాథ్ పెదవులని తన పెదవుల మధ్యవుంచుకొంది. గుండె వేగంగా కొట్టుకుంటుంటే, కాశీనాథ్ కళ్ళు మూసుకుని ప్రణయశీలని చుట్టుకుపోయాడు.

పావుగంట తర్వాత ప్రణయశీల లాంతరు వత్తిని పెద్దది చేసింది.

"బనీను వుతికి ఎంతకాలమయింది?" అడిగింది కాశీనాథ్ తొడుక్కున్న బనీను విప్పుతూ.

కాశీనాథ్ సిగ్గుపడటం స్పష్టంగా గమనించింది ప్రణయశీల.

"ఏం చేస్తున్నారు?" అడిగింది లేచి కూర్చుని.

"ఉద్యోగంకోసం వెతుకుతున్నాను."

కాశీనాథ్ తలని ప్రణయశీల తన వళ్ళోకి లాక్కుంది.

"ఆ ఫోటోలో వాళ్ళెవరు?" అడిగింది.

"మా అమ్మా, నేను, తమ్ముడు, ఇద్దరు చెల్లెళ్ళు, అక్కయ్య."

"ఎక్కడ వుంటారు?"

"బాపట్ల."

కాశీనాథ్ జుట్టుని చేతితో నిమురుతూ యాంత్రికంగా అడిగింది.

"ఏం చదివారు?"

"బి.ఏ."

"బండబ్బాయి అన్నమాట."

"అంటే ?"

గలగల నవ్వింది ప్రణయశీల.

"నేను బి.ఏ. చదివే రోజుల్లో మా లెక్చరర్ అనేవాడు. బి.ఏ. అంటే బండమ్మాయి. ఎం.ఏ. అంటే మొద్దమ్మాయి అని."

"మీరు 'మొద్దమ్మాయి' దాకా చదివారా ?"

"ఉహు. బండమ్మాయికూడా పూర్తి చేయలేకపోయాను."

కాశీనాథ్, ప్రణయశీల చాలాసేపు మౌనంగా ఉండిపోయారు.

"మరి ఎలా గడుస్తోంది ఉద్యోగం లేకపోతే ?" అడిగింది.

"వారంనుంచి ఆటో నడుపుతున్నాను అద్దెకు తీసుకొని. ఇందాక మీరు చూసిన మేడాయన-ఈ ఇంటి యజమానికి ఆటోలున్నాయి."

"ఇంకో ఇరవై వుంటే ఇవ్వరాదా ? తెల్లారేదాకా వుండిపోతాను."

"లేవు. నా కిదే మొదటిసారి. ఉంటే తప్పకుండా ఇచ్చేవాణ్ణి."

కాశీనాథ్‌ని దుప్పటీమీదకి సరిగా లాగి ప్రణయశీల తనే కాశీనాథ్‌ని ఆక్రమించుకోసాగింది. కాశీనాథ్ చేతులు ప్రణయశీల వీపుని చుట్టేశాయి.

* * *

ప్రణయశీల కాశీనాథ్ వంకచూసింది. గాఢనిద్రలో వున్నట్లుగా అతనిముఖమే చెప్తోంది. అతని చేతిని తన భుజాలమీద నుంచి తీసి నిశ్శబ్దంగా లేచింది.

లాంతరు వత్తిని పెద్దది చేసింది. చీర కట్టుకొని, ఆ గదివంక చూసింది. సైంపీస్, వాచ్, ట్రాన్సిస్టర్ లాంటి విలువయిన చేత్తొ పట్టుకెళ్ళగలిగిన వస్తువుల కోసం వెతుకుతున్నాయి ఆమె కళ్ళు.

బోసిగా వెలవెలబోతోంది ఆ గది. ఎక్కడ చూచినా పేదరికపు ఛాయలు.

తాడుతో కట్టిన దండేనికి వేలాడుతున్నాయి రెండు జతల బట్టలు. గబగబా వాటి జేబులు వెతికింది. ఖాళీగా ఉన్నాయ్. అన్నీ కాటన్ బట్టలే.

చాప ప్రక్కన పడివున్న, కాశీనాథ్ వంటిమీదినుంచి విప్పిన చొక్కా, పేంట్‌లని వంగి చేతిలోకి తీసుకొని జేబులలో చేతులుంచి తనిఖీ చేసింది.

గలగలమంటూ కొంత చిల్లర నేలమీదపడి గది మూలకి జారిపోయింది. ఉలిక్కిపడి చూసింది కాశీనాథ్ వంక.

మెలకువ రాలేదు. ఆదమరచి నిద్రపోతున్నాడు.

పేంట్ జేబు బేక్‌పాకెట్‌లో ఏదో కాగితం తగిలింది.

వంద రూపాయిల నోటు అయివుండచ్చని బయటకి తీసింది ఆత్రంగా.

డబ్బుకాదు.

ఇన్‌లాండ్ లెటర్. మడతలు విప్పింది.

అదో ఉత్తరం. ఆ కాగితంమీది వాక్యాలవెంట పరిగెత్తాయి ఆమెకళ్ళు. తెలుగులో వ్రాసివుంది.




-కాశీ అన్నయ్యకు నీ చిన్నచెల్లెలు నమస్కరించి వ్రాయునది,

విసుగ్గా దాన్ని మళ్ళీ జేబులో పెట్ట బోయింది కాని ఉత్తరం మధ్యలోని ఓ మాట ప్రణయశీల దృష్టిలో పడింది

ఆ మాట డబ్బు

మళ్ళీ చదవసాగింది ఉత్తరం

వ్రాయునది,

అమ్మకు ఎక్కువయింది శానిటో రియంలో చేర్పించాలని అంటున్నారు అంతా దగ్గు విపరీతంగా ఎక్కువయింది ఇప్పుడు పెద్దక్కకూడా దగ్గుతోంది అనుమానంగా వుంది నాకు చిన్నన్న య్యని పనిలోంచి తీసేసారు స్పేర్ పార్ట్స్ పోతే వాడు నేను తీయలేదు, నాకేం తెలియదంటున్నాడు బట్టలు చిరిగి పోయాయి అందరికీ, వీలుంటే డబ్బు పంపు అత్తయ్య కూతురికి మొగపిల్లా డుట చిన్నక్క మొన్నరాత్రి ఆలస్యంగా వచ్చింది ఇంటికి అమ్మ చివాట్లు పెట్టింది డబ్బు తప్పక పంపు, ఉద్యోగం వచ్చింది కనుక ఏం ఉద్యోగమోరాయ లేదే. మా అన్నయ్యకి ఉద్యోగం వచ్చిందంటే "ఏం ఉద్యోగం" అని అడుగుతున్నారు అంతా

నమస్కారాలతో నీ చెల్లెలు

ఉత్తరం మడిచి మళ్ళీ ఆ కాకీరంగు పేంట్ బేక్‌పాకెట్‌లో వుంచింది దాన్ని

తలుపు తెరచి బయిటకువెళ్ళి నిల బడింది కాస్సేపు రెండడుగులుముందుకు వేసింది కాని వెళ్ళబుద్ధిగాలేదు ప్రణయ శీలకు

మళ్ళీ లోపలికివచ్చి జాకెట్‌లోంచి పర్స్‌తీసి, పర్స్‌లోంచి ఇందాక కాశీనాథ్

ఇచ్చిన ముప్ఫై రూపాయలు బయటికి తీసి అతని పేంట్ జేబులో పెట్టింది.

చిన్నగా నిట్టూర్చి మళ్ళీ బయటకు నడిచింది. అయినా అడుగు పడలేదు.

మళ్ళీ లోపలికి వచ్చింది.

పర్స్ తెరిచి దాంట్లోంచి నలభై రూపాయలు తీసి పేంట్ జేబులో వుంచింది.

మళ్ళీ బయటికి నడిచింది.

ఈసారి కూడా అడుగులు పడలేదు.

ఇంకోసారి లోపలికి వచ్చింది.

పర్స్ తెరచింది మళ్ళీ.

పేంట్ జేబులో తను వుంచిన నలభై లోంచి ఇరవై తీసి మళ్ళీ పర్స్‌లో వుంచుకుంది. గుమ్మందగ్గరికి వెళ్ళి వెనక్కి తిరిగి చూసింది నిద్రపోతున్న కాశీనాథ్ వంక. నిద్రలో శ్వాసకి అచ్ఛాదనలేని ఛాతి ఎగిరెగిరి పడుతోంది.

ఓసారి ఆ గదివంక చూసింది.

హేమామాలిని కాలెండరు ప్రక్కన వ్రేలాడుతున్న ఫోటోదగ్గరికి వెళ్ళింది. లాంతరు ఎత్తిపట్టి కొన్ని క్షణాలు తదేక దీక్షగా చూసింది ఆ ఫోటోలోని మనుషుల వంక.

తర్వాత కాశీనాథ్ దగ్గరికి వెళ్ళింది, లాంతరు పక్కన పెట్టి.

తన కిష్టంలేదని సిగరెట్ కాల్చలేదు! తనకు గుచ్చుకుంటుందని గడ్డం గీసుకున్నాడు !!

కాశీనాథ్ మొహంలోకి కొన్నిక్షణాలు చూస్తూండిపోయింది.

"నా కిదే మొదటిసారి" అన్న కాశీనాథ్ మాటలు గుర్తుకువచ్చాయి.

వంగి ప్రక్కన పడివున్న మాసిన లుంగిని అతని వంటిమీద కప్పింది ప్రణయశీల.

తర్వాత తృప్తిగా బయటకి నడిచి, తలుపులు దగ్గరికి నొక్కి, వడివడిగా చీకట్లో కలిసిపోయింది.



# శాంతి కిరణాలు

వి.జానకీరాంశ్రీ

ఉదయం ఏడుగంటలయింది సుబ్బారావ్ యీజీఛెయిర్‌లో కూర్చుని న్యూస్ పేపరు చూస్తున్నాడు వసుంధర రెండు కప్పులతో కాఫీ తీసుకువచ్చి, ఒకటి భర్తకిచ్చి, అతని ఎదురుగా మరో కుర్చీలో కూర్చుని తనూ త్రాగుతూంది ఏదో చెబ్దామనుకుని మళ్ళీ ఊరుకుంది

ప్రతిరోజూ ఒకటే హడావిడి ఉదయం లేచినప్పటి నుండీ యంత్రంలా గిరగిర తిరుగుతూ వంటపని, స్నానాలు, కారియర్ సర్దటం, యింటికి తాళంవేసి తొమ్మిదిన్నరకు బయటపడటం, పదింటికి స్కూలుకి చేరుకుని ఒంటిగంటవరకు పాఠాలు చెప్పడం, యింటర్వెల్‌లో యింటికి వెళ్ళి, నాల్గుమెతుకులు తిని, పని మనిషికి పాలసీసాలు, డబ్బులు యిచ్చి ఓ అరగంట రెస్ట్ తీసికొని, మళ్ళీ రెండుగంటలకల్లా స్కూల్లో ఉండాలి మరలా సాయంత్రం నాల్గున్నరకు కాళ్ళీడ్చుకుంటూ వచ్చి, కిరసిన్ స్టౌమీద కాఫీ తయారుచేసి ఫ్లాస్కులో పోసి, తను స్నానంచేసి, తలదువ్వుకునేసరికి అయిదుంబావవుతుంది

సుబ్బారావు యింటికి రాగానే అతనికి కాఫీ యిచ్చి, తనూ త్రాగుతుంది వసుంధర ఆరింటివరకూ యిద్దరూ, స్కూలువిషయాలూ, దేశ కాలపరిస్థితుల గురించీ, పెరుగుతున్న ధరల గురించీ, పొలిటికల్ పార్టీలగురించి, నగరంలో రిలీజవుతున్న సినీమాల గురించీ, సినిమా స్టార్స్ గురించీ, ఒకటేమిటి చాలా విషయాలు చర్చిస్తారు



ఆరున్నరకు సుబ్బారావు, అలా బయటికి వెళ్ళొస్తానని, భార్యను తలుపేసుకోమని చెప్పి వెళ్తాడు అతనటువెళ్ళగానే వసుంధర వంట మొదలుపెడుతుంది ఎనిమిదిన్నరకు వంట అయిందనిపించి, ఏదో వీక్లీ చదువుతూ మరో అరగంట గడుపుతుంది



తొమ్మిదింటికి సుబ్బారావు రాగానే యిద్దరూ భోంచేసి, పక్కమీద చేరతారు అలసిన దేహాలను ఒడిలోకి తీసుకొని నిద్రాదేవి వారిద్దరినీ లాలిస్తుంది తెల్లవారు ఝామున అయిదింటికే లేచి, ఆ రోజు స్కూల్లో చెప్పవలసిన లెసన్స్ ప్రిపే రవటంతో, మళ్ళా యధాప్రకారం దినచర్య ప్రారంభమవుతుంది గొడ్డుతోక

బెత్తెడన్నట్టు ఎదుగూ బొదుగూ లేని జీవితం పెళ్ళై రెండేళ్ళయినా వారి జీవితంలో మార్పేమీలేదు.

సుబ్బారావుది లవ్ మేరేజ్ మాత్రం కాదు. తన తండ్రి చెప్పినట్టు బుద్ధిగా, ఆయన స్నేహితుని కూతురు వసుంధరను కానీ కట్నం లేకుండా పెళ్ళాడాడు. వసుంధర యింటర్మీడియట్ పాసై, టీచర్ ట్రెయినింగ్ అయింది. పెళ్ళైన నెలరోజులకే ఉన్న ఊళ్ళోనే హైస్కూల్లో సెకండరీగ్రేడ్ టీచర్ ఉద్యోగం వచ్చింది సుబ్బారావు బి.యస్సీ. చదివాడు. తండ్రికి యింకా చదివించే స్తోమత లేక, ఒక ప్రైవేట్ కంపెనీలో క్లర్క్‌గా చేరాడు. యిద్దరికీ చెరో మూడు వందలూ వస్తున్నాయి. కొంతకాలంవరకూ తమకు పిల్లలు వద్దనుకున్నారు యిద్దరూ.

సుబ్బారావు తండ్రి రాఘవయ్యగారు ఎలిమెంటరీ స్కూల్ టీచర్‌గా పనిచేసి, రిటైరై మూడేళ్ళయింది ఆయన తనకు వచ్చిన ప్రావిడెంట్ ఫండ్, ఇన్సూరెన్స్ మొత్తం యిరవై వేలు, సుబ్బారావు చెల్లెలు సుజాత పేరున ఓ పదివేలూ, సుబ్బారావు తల్లి సుందరమ్మ పేరున ఓ పదివేలూ బ్యాంక్‌లో వేశారు. సుబ్బారావు పెళ్ళైన ఆరు మాసాలకే రాఘవయ్యగారు హార్ట్‌ఎటాక్‌తో మరణించారు అప్పటికి సుజాతకు పధ్నాలుగేళ్ళు, టెన్త్‌క్లాస్ పాసయింది. చదువులో బాగాచురుకయింది సుజాత. ఇంటర్మీడియేట్‌లో చేరతాననిపట్టుబట్టింది.

అన్నయ్య ఉండేది విజయవాడలోనే గనుక తనను తీసికెళ్ళి కాలేజీలో చేర్పిస్తాడని ఆశపడింది సుబ్బారావు తల్లితో ఆలోచించి గుడివాడ ఉమెన్స్ కాలేజీలో చేర్పించాడు, ప్రతిరోజూ యింటిదగ్గరనుండే, సిటీబస్‌మీద వెళ్తున్నది. సాయంత్రం కాలేజీ అయింతర్వాత ఓ గంట యింగ్లీషు టైపురైటింగ్ నేర్చుకుని ఆరింటికల్లా యింటికి చేరేది సుజాత. సుందరమ్మ పాడి గేదెలను పెట్టుకుని, పెరట్లో పండించిన కూరగాయలు, యింటిదగ్గరే అమ్మి, బ్యాంక్‌నుండి వచ్చే వడ్డీతో, ఎంతో పొదుపుగా సంసారాన్ని గడిపేది యింట్లో ఉండేది కూతురూ, తనే కనుక ఎంతో ప్రశాంతంగా గడిచేది నెలకోసారి, నెయ్యి, పచ్చళ్ళు, కూరగాయలు, పప్పులు అన్నీ తీసికొని వెళ్ళి కొడుకునూ, కోడల్నీ చూసి సాయంత్రానికి వచ్చేస్తుండేది.

వెళ్ళినప్పుడల్లా కోడలు అత్తయ్యా, అత్తయ్యా అంటూ ఎంతో ప్రేమగా చూచేది. బాగా మర్యాద చేసేది సుందరమ్మ, "అటు ఉద్యోగమూ, ఇటు యింట్లో పనీ ఒక్కదానివే అవస్థపడుతున్నావమ్మా," అని జాలిపడేది.




తనున్నంతసేపూ ఏ పనీ చెయ్యనివ్వక, అన్నీ తనే చేసేది. కొడుకుతో మాత్రం అంటూ ఉండేది. "మీ నాన్నగారు లేకపోవటం, బాధ్యత నీ మీద పెట్టవలసివచ్చింది ఏదైనా మంచి సమ్మంధంచూసి, నీ చెల్లెల్ని ఒక యింటిదాన్ని చెయ్యి బాబూ."

"అలాగే చేద్దామమ్మా: యింటర్ పూర్తికానీ," అని ఊరుకునేవాడు సుబ్బారావు.

రెండు సంవత్సరాలూ జాగ్రత్తగా చదివి యింటర్ ఫస్ట్‌క్లాసులో పాసయ్యింది సుజాత టైపురైటింగ్ హయ్యర్‌గ్రేడ్ పాసయింది సుందరమ్మ యింక నిన్ను చదివించలేను, మానేసి యింటిపని నేర్చుకోమని చెప్పింది కూతురికి

సుజాతకు బి.ఏ. చదవాలని ఉన్నా కుటుంబ పరిస్థితులు ఆమెను చదవనివ్వ లేదు. సుబ్బారావు, భార్యాభర్తలిద్దరూ ఉద్యోగం చేస్తున్నా పైసా పంపించడు. తల్లి ఒక్కతే అన్నిటికీ అవస్థపడుతుంటే తను కూడా ఏదైనా ఉద్యోగం చేస్తే బావుండుననుకుంది కాని బి.ఏ.లు, ఎం ఏ. లు చదివినవాళ్ళే నిరుద్యోగులై తిరుగుతుంటే, తనకెవరిస్తారు ఉద్యోగం? అన్నయ్య వచ్చి నప్పుడు గట్టిగా చెప్పాలి, తను ఉద్యోగం చేస్తున్నాడుగా, తనకు తెలిసినవాళ్ళ నెవరినైనా అడిగి రికమెండ్ చేయించమని, అని అనుకునేది సుజాత.

* * * * *

వసుంధరకు జీవితంమీద విరక్తి కల్గుతోంది. నెలంతా యిద్దరూ కష్టపడి, వెరో మూడువందలూ సంపాయించడం, ఏ కోరికలూ, సరదాలూ తీరకుండానే రోజులూ, వారాలూ, నెలలూ గడచిపోతున్నాయి. నెలకు నూటపాతిక

రూపాయలు ఇంటద్దె చెల్లించాలి. మిగతా నాల్గువందల డెబ్భైఅయిదు, బియ్యం, పాలు, కిరసిన్, కిరాణా, కూరగాయలు, కాస్మటిక్స్ అన్నీ కొనడానికి మూడు వందలు, భర్త మధ్యాహ్నం కాఫీ ఖర్చుకు రిక్షాలకు ఓ యాభై, పనిమనిషి జీతం ముప్పై, న్యూస్ పేపర్‌కు పది, నెలలో యిద్దరూ ఒకసారి సినిమాకెళ్తే పది యిలా ఖర్చవుతుండేది ఎంతో పొదుపుగా వాడితే నెలకు పాతిక రూపాయలు సేవ్ చెయ్యడం కష్టమవుతుంది ఎన్నాళ్ళనుంచో అనుకుంటోంది గాస్‌స్టౌ, ప్రెషర్‌కుక్కర్ కొనాలని. ఆమె కోరిక తీరకుండానే పెళ్ళై మూడేళ్ళు గడిచాయి.

ఎన్నాళ్ళిలా గానుగెద్దు జీవితం గడపటం? ఎంతకాలం యిలా ప్రగతికోసం పయనం? ప్రగతి సంగతి దేవుడెరుగు, యిప్పుడు భార్యా భర్తలిద్దరికే అంతంత మాత్రంగా సరిపోతున్న సంపాదన రేపు తమకు పిల్లలు పుడితే యిలాకూడా జరగదు. ఎలా కష్టపడినా పిల్లల భవిష్యత్తేమిటి? అయన జాబ్‌కు రిజైన్‌చేసి ఏదైనా బిజినెస్ చేస్తే బావుండును బిజినెస్ చెయ్యటానికైనా పెట్టుబడి కావాలి. ఎవరిస్తారు? ఆయన మాత్రం ఎక్కడ తెస్తారు? నిద్రపోతున్న భర్త ముఖంలో కన్పిస్తున్న అలసటను చూసి వసుంధర స్త్రీ హృదయం బాధగా మూల్గేది. పదింటికి నిద్రపోతే ఒకగంటకే మెలకువ వచ్చేది రాత్రంతా ఆలోచనలతో గడిపేది. ఆమె ఆలోచనలు ఒక దరికి చేరకుండానే టేబిల్‌మీద అలారం, అయిదయిందని గణగణా మ్రోగేది. యిక తప్పదన్నట్టుగా లేచి తన దినచర్య మొదలుపెట్టేది

యిలా ఆలోచిస్తూ ఉండగా ఒకనాడు అర్ధరాత్రి పన్నెండు గంటలకు వసుంధరకు ఓ ఐడియా తట్టింది. భర్తను లేపి చెప్పేవరకూ ఆమె మనసు ఊరుకోలేదు. వెంటనే సుబ్బారావును తట్టి లేపింది.

"ఏమండీ, ఏమండీ." వసుంధర నెమ్మదిగా పిలిచింది

సుబ్బారావుకు వళ్ళుమండింది ఏం కొంప మునిగిందని, తనకు నిద్రాభంగం కల్గించి యింతరాత్రి నిద్రలేపటం నిద్ర చాలకపోతే, రేపు ఆఫీసులో కునికి పాట్లు పడాలి, కాన్‌సీక్వెంట్‌గా ఆఫీసర్‌తో అక్షతలు వేయించుకోవాలి. ఎందు కొచ్చినగొడవ అనుకుని మెడవరకూ కప్పుకున్న దుప్పటిని ముఖంమీదకు లాక్కున్నాడు.

ఆమె అంతటితో ఊరుకోలేదు. చెవిలో జోరీగలా 'ఏమండీ, ఏమండీ' అని పిలుస్తూనే ఉంది. అతడు 'ఊ, ఊ,' అంటూనే నిద్రపోతున్నాడు. వసుంధర దుప్పటిలాగేసి, అవతల పడేసింది. సుబ్బారావు అప్పటికీ లేవలేదు. నిద్ర

పోతున్నవాళ్ళను లేపటం సులభం, దొంగనిద్ర నటించేవాళ్ళను లేపటం బ్రహ్మకుకూడా సాధ్యంకాదు ఏం చేయటమా అని ఆలోచిస్తే తను చదువుకునే రోజుల్లో, పరీక్షలకు చదువుకోడానికి తెల్లవారుఝామున లేవకపోతే, అన్నయ్య చెవిలో నీళ్ళుపోసి లేపేవాడన్న విషయం గుర్తువచ్చి, వెంటనే మంచందిగి, కూజాలో నీళ్ళు గ్లాసులోకి వంచసాగింది యిక లాభంలేదనుకుని సుబ్బారావు లేచి మంచంమీద కూర్చుని, "ఏమిటోయ్, ఏమిటారహస్యం? అంత అర్జెంటుగా చెయ్యవలసిన రాచకార్యమేమిటో చెప్పు," అన్నాడు కళ్ళు నులుముకుంటూ.

గ్లాసు అక్కడే వదిలేసి, నెమ్మదిగా వెళ్ళి భర్త ప్రక్కనే కూర్చుంది వసుంధర సుబ్బారావు, ఆమె భుజం చుట్టూ చెయ్యివేసి దగ్గరకు తీసుకుంటూ, "కమ్మటి నిద్ర పాడుచేశావ్ ఎందుకో చెప్పుమరి?" అని అడిగాడు.

"నిద్రకేంలెండి, ఎప్పుడైనా వస్తుంది. డబ్బుపోసి కొనాలా ఏమన్నానా?" వసుంధర నవ్వుతూనే అంది.

"వసూ, నువ్వు చెప్పేదేమిటో త్వరగా చెప్పు, నాకు నిద్రవస్తోంది." సుబ్బారావు తొందరచేశాడు.

"చూడండి, మనం ఎన్నాళ్ళు యిలా రెక్కలు ముక్కలు చేసుకున్నా, ఏమీ సంపాయించలేము యీ మూడేళ్ళలోనూ, వెనకేయటం, పండుగలకు బట్టలు కొనటం, యింట్లోకి మంచి ఫర్నిచర్ కొనడం గాని ఏదీ చెయ్యలేదు. దీనికంతటికీ, ఎదుగూ బొదుగూ లేని మన సంపాదనే కారణం "

"అవును, వసూ, నేనుమాత్రం ఏంచేస్తున్నాను? నాకు కాఫీ, రిక్షా ఖర్చులకు యాభై తీసుకుని మిగతాది నీకే యిస్తున్నాను ఉన్నంతలో తృప్తిపడాలి ఎంత చెట్టుకు అంతగాలి ఏం చేస్తాం?"

"అలా అని ఊరుకుంటే సరా? రేపు మనకు పిల్లలు పుడితే యిలాకూడా జరగదు ఎన్నాళ్ళనుండో గ్యాస్‌స్టవ్, ప్రెషర్ కుక్కర్ కొందామని అనుకుంటూనే ఉన్నాను. ఎక్కడనుండి వస్తుంది అంత డబ్బు? మీకు మాత్రం మంచి బట్టలైనా లేవు గ్రాడ్యుయేటైు ఉండికూడా, మీరిలా ఒకరి చేతిక్రింద పని, చేస్తూ, గుమాస్తాగా జీవించటం మీకు బాధగాలేదూ?"

"బాధపడి చేసేదేముంది? ఈ ఉద్యోగం దొరక్క ఎంతోమంది బాధపడుతున్నారు. అందరూ పల్లకీలెక్కేవాళ్ళే అయితే బోయీలుండొద్దూ? పిచ్చి ఆలోచనలతో బుర్ర పాడుచేసుకోక పడుకో. తెల్లవారితే నీకు రొటీన్ వర్కుతోనే సరిపోతుంది."

"అది కాదండీ, మీరు ఏదైనా బిజినెస్ చెయ్యకూడదూ?"

"మరి పెట్టుబడి ఎక్కడనుంచి తేనూ? ఏదైనా చిన్నషాపు ఓపెన్ చెయ్యాలంటే ఎట్‌లీస్ట్ ట్వంటీ తౌజండ్ కావాలి. అంత డబ్బు ఎవరిస్తారు?"

"మనసుంటే మార్గం లేకపోదు మీకు బిజినెస్ చెయ్యాలని ఉంటే ఎక్కడైనా అప్పుకోసం ప్రయత్నించండి, తప్పక దొరుకుతుంది"

"పిచ్చి వసూ, నీ భర్త నిర్ధనుడని మరచిపోతున్నావు. సెక్యూరిటీ లేకుండా అంత సొమ్ము అప్పు ఎవరిస్తారు?" భార్య చెంపలు రెండూ రెండు చేతులతో నిమురుతూ సుబ్బారావు బాధగా అన్నాడు

"మీ అమ్మగారి పేర ఉన్న పదివేలూ, మీ చెల్లెలిపేరున ఉన్న పదివేలూ అప్పుగా తీసుకుంటే పోలా? నెలనెలా వచ్చే లాభంతో తీర్చెయ్యొచ్చు"

"నిజమే, నువ్వు చెప్పిందికూడా బాగానేఉంది వసూ కాని వాళ్ళు యివ్వటానికి ఒప్పుకోవాలిగా?" సుబ్బారావు సందేహాన్ని వెలిబుచ్చాడు,

"మీకు అన్నీ సందేహలేనండీ ధైర్యే సాహసే లక్ష్మి, అన్నారు మీరు అడగాలేగాని వాళ్ళు కాదంటారా? మీరు రేపు ఆదివారం వెళ్ళి అడగండి. మీ అమ్మగారు మీ మాట కాదనరు వాళ్ళకుమాత్రం మీరూ నేనూ తప్ప ఎవరున్నారు?" వసుంధర ఆవేశంగా అంది

"యిరవై వేలూ తీసుకుంటే మరి వాళ్ళకు జీవనాధారం ఉండొద్దూ?"

"బాకీ తీర్చేవరకూ మనతోపాటు వాళ్లూ ఉంటారు మీ చెల్లెలి పెళ్ళి బాధ్యత మీదే మీ అమ్మగారు ఎప్పుడైనా మనదగ్గర ఉండవలసిందే వాళ్ళు ఒంటరిగా అక్కడ ఉండటం యిక్కడ చేసుకోలేక నేను అవస్థపడటం ఎందుకు? వాళ్ళిద్దరినీ యిక్కడికే తీసుకురండి అందరం కలిసే ఉందాము"

"వసూ, తొందరపడుతున్నావేమో! మా అమ్మనూ, చెల్లినీ సరిగా చూడలేకపోతానేమోనని నా భయం"

"డియర్, మీ డౌట్ నా కర్థమయింది మీ అమ్మగారినీ, సుజాతనూ జాగ్రత్తగా చూచుకునే పూచీ నాది ప్రామిస్ చేస్తున్నాను, నన్ను నమ్మండి," అని భర్త చేతిలో చేయివేసింది

"సరే వచ్చే ఆదివారం వెళ్ళి అడుగుతాను వాళ్ళు ఒప్పుకుంటే నువ్వు చెప్పినట్టే అన్నీ సవ్యంగా జరుగుతాయి" సుబ్బారావు దుప్పటి కప్పుకుని అటు తిరిగి పడుకున్నాడు

వసుంధర ఆలోచిస్తూ, చాలాసేపు యింటి పైకప్పు వంక చూస్తూ పడుకుంది ఆమెకు ఎంతో ఉత్సాహంగా ఉంది భర్త తన మాటకు విలువనిచ్చి, చెప్పగానే

"దాని మొహం, అది ఉద్యోగం చెయ్యాలా. వసూ, ఎలాగూ చేస్తున్నది. నేనుకూడా ఏదైనా వ్యాపారం చేద్దామనుకుంటున్నానమ్మా"

"అవన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు. ముందు అత్తయ్యను స్నానంచేసి కాసేపు విశ్రాంతి తీసికోనివ్వండి" అని వసుంధర "బాత్‌రూమ్‌లో బకెట్‌తో వేడినీళ్ళు, మగ్గూ పెట్టు మంగమ్మా," అని పనిమనిషికి పురమాయించింది. తను లేచి సోపూ, టవలూ, తీసికెళ్ళి బాత్‌రూమ్‌లో పెట్టివచ్చింది.

"స్నానం చేయండత్తయ్యా," అని సుందరమ్మతో చెప్పి తను కిచెన్‌లోకి వెళ్ళి వంటపని చూడసాగింది

సుందరమ్మ స్నానం చేస్తూ, "ఏ మాట కామాటే అనుకోవాలి పరాయిపిల్లైనా తనంటే ఎంతో ప్రేమ కొడుకుకంటే వసుంధరే ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతుంది ఆదరంగా చూస్తుంది. అందరి కోడళ్ళలాటిదికాదు. కట్నం తేకపోయినా వసుంధర సుగుణాలే పదివేలు. చదువుకుని ఉద్యోగం చేస్తున్నా, నెలకు మూడువందలకు పైగా సంపాయిస్తున్నా వీసమంత గర్వంలేదు ఇలాటి పిల్ల కోడలవటం నిజంగా తన అదృష్టం," అనుకుంది

సుందరమ్మ స్నానంచేసి వచ్చేసరికి వసుంధర వంట చేస్తున్నది. అది చూసి "నేను చేస్తానుగా! నువ్వెళ్ళి కాసేపు రెస్ట్ తీసుకోమ్మా, ఆదివారం కూడా పనేనా?" అంటూ సుందరమ్మ వంటింట్లోకి అడుగుపెట్టింది.

"వద్దండీ, మీరు ప్రయాణంచేసి అలసిపోయి వచ్చారు గదిలోకి వెళ్ళి పడుకోండి వంట అయిపోవచ్చింది అవ్వగానే యిద్దరికీ వడ్డిస్తాను," అని సుందరమ్మ అక్కడినుండి వెళ్ళేవరకు ఊరుకోలేదు వసుంధర.

పదకొండయ్యేసరికి వంటపని పూర్తిచేసి, తనూ స్నానంచేసి ఉతికిన చీర కట్టుకుని, భర్తకూ, అత్తగారికీ వడ్డించింది ఆమె ప్రవర్తనకు సుబ్బారావు లోలోన మురిసిపోయాడు సుందరమ్మ తీసుకువచ్చిన, కందిపప్పు ముద్దపప్పు చేసి. వెన్నకాచిన కమ్మని నెయ్యి, వంకాయ పులుసు, బెండకాయల వేపుడు, కొబ్బరి పచ్చడితో, వసుంధర దగ్గర కూర్చుని యిద్దరికీ కొసరి కొసరి వడ్డించింది సుందరమ్మ వడ్డించుకోమన్నా వినక వాళ్ళు తిని లేచిన తరువాత ప్రక్కలు వేసి, యిద్దరికీ వక్కపొడి యిచ్చి, తను వడ్డించుకుంది.

తల్లీ కొడుకు లిద్దరూ కబుర్లు చెప్పుకుని, నిద్రపోయారు. మధ్యాహ్నం మూడింటికి, వాళ్ళిద్దరూ లేచేటప్పటికి, గారెల వాసన ఘుమాయిస్తోంది. సుందరమ్మ లేచి వంటింటివైపు వెళ్ళి, "వారమంతా నీకు ఎలాగూ తీరదు.

ఆదివారమైనా కాసేపు పడుకోకూడదూ? నేనేమైనా క్రొత్త చుట్టాన్నా' నువ్వు మర్యాద చెయ్యలేదనుకోవటానికి ?" అంటూ స్టౌ దగ్గరకు వెళ్ళబోయింది.

"మీరు పదండత్తయ్యా. చెయ్యటం అయిపోయింది. రోజూ ఎలాగూ చెయ్యటానికి వీలుపడదు. ఈ రోజు ఆదివారం కనుకనే చేశాను." అని పాలగిన్నె స్టౌ మీద పెట్టింది వసుంధర.

సుందరమ్మ చేసేదిలేక యింట్లోకి వచ్చి, అప్పటికే తనకోసం చూస్తున్న, కొడుకు ప్రక్కనేఉన్న కుర్చీలో కూర్చుంది. ఐదు నిమిషాల్లో రెండు ప్లేట్లతో గారెలు కొబ్బరిచట్నీ వేసి తీసుకువచ్చింది సుందరమ్మ, సుబ్బారావు మౌనంగా తినసాగారు. వసుంధర రెండు గ్లాసులతో మంచినీళ్లు పెట్టి, లోపలి కెళ్ళి సుందరమ్మ తీసుకువచ్చిన మైసూర్ పాక్ డబ్బా తెరిచి, ప్లేట్లో నాలుగు బిళ్ళలు పెట్టి తీసుకువచ్చింది సుందరమ్మ తినలేదుకాని సుబ్బారావు రెండు తిన్నాడు. సుందరమ్మ చేతివంట రుచిని మెచ్చుకున్నాడు.

వసుంధర కాఫీ తీసుకువచ్చి చెరో కప్పు యిచ్చి వెళ్ళింది. కాఫీ త్రాగుతూ సుబ్బారావు తను అడగదల్చుకున్న విషయం ఎలా ప్రస్తావించాలా అని ఆలోచించాడు.

"అమ్మా!"

"ఏమిటి బాబూ ?"

"నేను యిప్పుడు చేస్తున్న గుమాస్తా ఉద్యోగం మానేద్దామనుకుంటున్నాను."

"మానేసి ఏం చేస్తావ్ ?" సుందరమ్మ ప్రశ్నార్థకంగా కొడుకు ముఖంలోకి చూసింది.

"ఏదైనా బిజినెస్ చేద్దామని ఉందమ్మా."

"ఏం బిజినెస్ చేస్తావు ? యీ గుమాస్తా ఉద్యోగం దొరక్క బాధపడేవాళ్ళు బాధపడుతున్నారు. ఉన్న ఉద్యోగం వదులుకుంటే తరవాత విచారించవలసి వస్తుందేమో!" సుందరమ్మ తన సందేహాన్ని వెలిబుచ్చింది.

"నెలంతా కష్టపడి ఒళ్ళు విరుచుకుంటే ముష్టి మూడొందలు వస్తున్నాయి. యిద్దరం కష్టపడినా, రెండుపొట్టలు నిండటానికే చాలటంలేదత్తయ్యా. మీకు మనవడో మనవరాలో పుడితే ఎలా పెంచడం? వాళ్ళ భవిష్యత్తేమిటి ? అన్నదే ఆలోచన. ఏదైనా షాపు పెట్టుకుంటే లాభం పొంది రెండు మూడు సంవత్సరాలలోనే పైకి రావచ్చనే ఆశ, నాకూ మీ అబ్బాయికీనూ." వసుంధర అత్తగారికి నచ్చజెప్పింది.




ఒప్పుకున్నందుకు ఆమెకు ఏనుగెక్కినంత సంబరంగా ఉంది. ముందు జరపబోయే కార్యక్రమాలను గురించి ఆలోచిస్తూ తృప్తిగా నిద్రపోయింది.

అనుకున్న ప్రకారం ఆదివారం ఉదయం ఎనిమిది గంటలకు తల్లిదగ్గరకు వెళ్ళాలని ప్రయాణమయ్యాడు సుబ్బారావు. వసుంధర గుమ్మంవరకూ సాగనంపి, తల్లికి, చెల్లెలికి ఎలా నచ్చచెప్పడమో, వాళ్ళను ఎలా ఒప్పించాలో భర్తకు బోధించి, అతను వీధి చివరికి వెళ్ళేదాకా చూసి, తలుపేసుకుంది ఆ పూట వంట చెయ్యాలన్న ధ్యాస లేదు ఉదయం చపాతీలు చేసి భర్తతో పాటు తనూ రెండుతిని కాఫీ తాగింది కడుపునిండుగా ఉంది. వెళ్ళి మంచంమీద పడుకుని న్యూస్ పేపరు చేతిలోకి తీసుకుంది. ఆమె మనసు అక్కడ నిలవలేదు.

ఆయన వెళ్ళి అడుగుతారు, వాళ్ళేమంటారో. వాళ్ళు ఒప్పుకుంటే బావుండును. వాళ్ళు కూడా వస్తే యీ యిల్లు సరిపోదు కాస్త పెద్ద యిల్లు తీసుకోవాలి. కాస్త పెరడు ఉన్న యిల్లయితే బావుంటుంది. కూరపాదులు పెంచుకోవచ్చు. తను హైమవతమ్మగారింటి దగ్గర చూసింది కిచెన్ గార్డెన్. ఎప్పటికప్పుడు తాజా కూరలు వండుకోవచ్చు. నెలకు అరవై రూపాయల ఖర్చు తగ్గుతుంది. నాలుగు గులాబీ మొక్కలు కూడ కుండీలలో పెట్టుకుంటే బావుంటుంది. సుజాతకు మొక్కల పెంపకం అంటే చాలా యింటరెస్ట్, తనే నీళ్ళుపోసి పెంచుతుంది కూడాను అత్తయ్య వస్తే తనకు వంటచేసే అవసరం ఉండదు. అన్ని పనులూ తనే చేస్తుంది తనకు కావలసినంత లీజర్.

సుజాతకు యింటర్లో క్లాసు వచ్చిందట షైపు ఎగ్జామ్ కూడా పాసయిందట. ఆమెకుకూడా ఏదైనా జాబ్ చూసి, పెళ్ళి చేసేస్తే అత్తగారూ, భర్తా, తనూ హాయిగా ఉండొచ్చు. అందరిలాగా తను కాస్త మంచి బట్టలు వేసుకోవచ్చు, నగలు చేయించుకోవచ్చు తమకు పిల్లలు పుడితే, ఇద్దరు చాలు, వాళ్ళను అల్లారుముద్దుగా పెంచుకోవచ్చు. పిల్లల బాధ్యత అంతా అత్తగారే చూచు కొంటుంది అప్పటిమాట, తను ఉద్యోగం చెయ్యగల్గితే చేస్తుంది, లేకుంటేలేదు.

వీధి గుమ్మం తలుపు తట్టిన చప్పుడై, ఆమె ఆలోచనలను చెదరగొట్టింది. రెండంగల్లో వెళ్ళి తలుపుతెరచింది సుబ్బారావు, వెనకే సుందరమ్మా లోనికి ప్రవేశించారు వసుంధర నవ్వుతూ అత్తగారిని లోనికి ఆహ్వానించింది

వెనకే రిక్షావాలా సామానులు లోపలపెట్టి, సుబ్బారావు యిచ్చిన రూపాయి నోటు తీసికొని వెళ్ళిపోయాడు వాడటు వెళ్ళగానే సుబ్బారావు తలుపు గడియ పెట్టివచ్చాడు అపట్టిటికే సుందరమ్మ కాళ్ళు కడుక్కొని వచ్చి కుర్చీలో కూర్చుంది. సుబ్బారావు తల్లికెదురుగా కుర్చీ లాక్కొని కూర్చున్నాడు

వసుంధర ట్రేలో మూడు కప్పుల కాఫీ పట్టుకుని వచ్చింది భర్తకూ, అత్తగారికీ చెరోకప్పూ యిచ్చి, తనూ ఒక కప్పు తీసికొని సుందరమ్మ ప్రక్కనే మరో కుర్చీలో కూర్చుంది

"ఎప్పుడు బయల్దేరావమ్మా? నేనే మనఊరు వద్దామని బయల్దేరాను. యింతలో బస్టాండులో నువ్వే కనిపించావు" సుబ్బారావు తల్లినుద్దేశించి అన్నాడు

"ఉదయం ఆరున్నరకు బస్సెక్కాను ఈ రోజు ఆదివారంకదా, యిద్దరూ యింటివద్దరే ఉంటారు, చూసిపోదామని వచ్చాను నువ్వొస్తానని ఉత్తరం రాస్తే వచ్చేదాన్నికాదు," అంది సుందరమ్మ

"రావటం మంచిదే అయిందమ్మా నీ కోడల్ని చూసి వెళ్ళవుగాని"

"వసుందరా, ఏమిటలా చిక్కిపోయావ్? ఒంట్లో బావుంటటం లేదా"

"బాగానే ఉంచత్తయ్యా సుజాత బావుందా?"

"ఆఁ బాగానే ఉందమ్మా చదువుతానని గొడవచేసింది మనకు చదివించే ఓపికా ఉండాలి అదీగాక దీన్ని బి ఏ చదివిస్తే, బి ఏ. చదివిన వాణ్ణో అంత కంటే ఎక్కువ చదివినవాణ్ణో తేవాలి మనం అంతేసి కట్నాలు ఎక్కడ యివ్వగలం? అందుకే చదువు మాన్పించాను 'ఉద్యోగం చూడమని అన్నయ్యతో చెప్పు, ఏమీ తోచటంలేదు' అని చెప్పింది."

సుందరమ్మకు కోడలు చెప్పింది అక్షరాలా నిజమనిపించింది. కోడలి తెలివికి, వాక్చాతుర్యానికి లోలోన మురిసిపోయింది.

"మీ అభిప్రాయం కూడ బాగానే వుంది. కాని పెట్టుబడి కావద్దూ ?" సుందరమ్మ తిరిగి తన సందేహాన్ని బయటపెట్టింది

"అదా, నువ్వు నాతో సహకరిస్తే చాలు పెట్టుబడిదేముందమ్మా ? పెట్టిన పెట్టుబడి మొత్తం, కొంత గవర్నమెంట్ లోన్ తీసికొని, కొంత బిజినెస్‌లో సంపాదించే ప్రోఫిట్స్‌లో నుండి, రెండు మూడు సంవత్సరాల్లో తీర్చేస్తాను." సుబ్బారావు భరోసా యిచ్చాడు.

"నా సహకారమా ?" సుందరమ్మ ఆశ్చర్యపోయింది.

"అవునత్తయ్యా. మీ పేరుమీద, సుజాత పేరుమీద ఉన్న మొత్తం యిరవై వేలు పెట్టుబడి పెట్టండి సుజాతను తీసికొని మీరు యిక్కడికి వచ్చెయ్యండి. అందరం కలిసి ఉందాం మీ బాకీ తీర్చిన తర్వాత, మీ కిష్టం లేకపోతే వేరే ఉందురుగాని అంతవరకూ మీ యిద్దరి బాధ్యతా మేమే స్వీకరిస్తాము." వసుంధర చెప్పదల్చుకున్నది చెప్పింది.

"సుజాత నడిగి ఏ విషయం ఉత్తరం రాయిస్తాను." సుందరమ్మ పెండింగ్‌లో పెట్టింది

"సుజాతను ఒక యింటిదాన్ని చెయ్యవలసిన బాధ్యత మాదే. మీరు యింక ఎలాటి సందేహాలు పెట్టుకోవద్దు ఒక్క అన్నయ్య తప్ప సుజాతకు మాత్రం ఎవరున్నారు ?" వసుంధర సానుభూతిని వ్యక్తపరచింది.

"అదీ నిజమేనమ్మా, మా బాధ్యత మీరు స్వీకరిస్తానంటే కాదంటానా ? యిప్పుడు ఉన్నదంతా పెట్టుబడి పెడితే, సుజాత పెళ్లి కుదిరితే, కొద్దో గొప్పో కట్నం యివ్వటం, పెళ్లిఖర్చు ఎలాగని ?" సుందరమ్మ మనసులోని మాట బయటపెట్టింది

"మెడికల్ షాపు ఓపెన్ చేద్దామనుకుంటున్నాను. షాపు చెల్లి పేరున రిజిస్టర్ చేయిస్తాను. బాకీ పూర్తిగా తీర్చేవరకూ, అది సెక్యూరిటీగా ఉంటుంది సుజాత పెళ్లికి అవసరమైతే లోన్ తీసుకుందాము. చాలకపోతే యిల్లు అమ్మివేద్దామమ్మా." సుబ్బారావు తల్లికి ధైర్యం చెప్పాడు.

సుందరమ్మ ఆ రాత్రికే స్వగ్రామానికి ప్రయాణమైంది. సుజాతతో కూడ ఒక్కమాట చెప్పి లెటరు వ్రాయిస్తానని, బస్సెక్కింది.

# 2

సుందరమ్మ రాత్రి, యింటికి చేరుకునేటప్పటికి ఏడయింది సుజాత అప్పటికే వంటచేసి తల్లి రాకకోసం నిరీక్షిస్తూంది. సుందరమ్మ కాళ్ళూ చేతులు కడుక్కొని లోపలికి రాగానే సుజాత గ్లాసుతో మంచినీళ్ళు అందించింది

"నువ్వు అన్నం తిన్నావా?" సుందరమ్మ ఆతురు నడిగింది.

"లేదమ్మా, నువ్వు వచ్చేక యిద్దరం తినొచ్చని, నీకోసమే చూస్తున్నాను." సుజాత చెప్పడం పూర్తికాకుండానే సుందరమ్మ చేతిలోని గ్లాసు అలాగే పట్టుకుని వంటింట్లోకి దారితీసింది తల్లి వెనకే సుజాత కూడా నడిచింది. సుందరమ్మ రెండు కంచాలు కడిగి యిద్దరికీ వడ్డిస్తుంటే, సుజాత పీటలువేసి గ్లాసులతో మంచినీళ్ళు పెట్టింది తింటూ సుజాత తల్లి నడిగింది

"అన్నయ్యా, వదినా కులాసాయేనా, అమ్మా?"

"ఆఁ, బాగానే వున్నారు."

"అన్నయ్యతో నాకు జాబ్ కోసం ట్రై చెయ్యమని చెప్పావా?"

"ఆ, చెప్పానమ్మా; వాడు ఉద్యోగం మానుకుంటున్నాడుట" సుందరమ్మ నెమ్మదిగా చెప్పింది.

"మానుకుని ఏంచేస్తాడట!" సుజాత తల్లిముఖంలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

"బిజినెస్ చేస్తాడట. ఏదైనా షాపు పెట్టుకుంటానని చెప్పాడు.

"అదే నయం. ఈ రోజుల్లో ఉద్యోగాలకంటె బిజినెస్ లాభసాటిగా కన్పిస్తోంది"

"మనం పెట్టుబడి పెట్టాలట." సుందరమ్మ రహస్యం చెబుతున్నట్టు చెప్పింది.

"మన దగ్గరేముందమ్మా, పెట్టడానికి? ఉంటె అలాగే యిచ్చేవాళ్ళం"

"మీ నాన్నగారు బాంక్‌లో వేసిన మొత్తం, యిరవై వేలు అప్పుగా యివ్వమన్నాడు నెలవారీ వచ్చే లాభంతో తీరుస్తాడట"

"యిస్తే బాగానే వుంటుందనుకో, మరి మనకు యిల్లు గడిచేదెట్లా?" సుజాత సందేహంగా అడిగింది

"నేనూ అదే అన్నాను. బాకీ తీర్చేవరకూ, మనం కూడ వాళ్ళలో కలిసి ఉండాలట. ఆ తర్వాత మీ యిష్టం. సుజాత పెళ్ళి బాధ్యత కూడా మాదే అని భరోసా యిచ్చింది మీ వదిన"

"అమ్మా! మనం వాళ్ళ దగ్గరే ఉంటే యీ మంచితనం నిలవదేమో! అన్నయ్యకు యివ్వాలని ఉన్నా, లాభం రావాలి, తీర్చటానికి వదిన ఒప్పు

కోవాలి. యిందులో ఏది సవ్యంగా జరగకపోయినా మనం బాధపడవలసి వస్తుంది. అన్నయ్యకూ అనవసరంగా రిస్క్ యిచ్చినవాళ్ళమవుతాము."

"ఆ గుమాస్తా ఉద్యోగంలో వచ్చే ఆదాయం ఎటూ చాలటంలేదు మీరు మాతో సహకరిస్తే, షాపు సుజాత పేరున పెడతాం సుజాత పెళ్లి మేమే చేస్తాం యిద్దరూ వచ్చెయ్యండి అందరం కలిసే ఉందామన్నాడు నీ పెళ్ళి వాడు చెయ్యవలసిందేగా? యింట్లో కూర్చునేదాన్ని, నావల్ల ఏమౌతుంది?"

"అన్నీ అనుకున్నట్టు సవ్యంగా జరిగితే ఎవ్వరికీ బాధ ఉండదు అన్నయ్య తప్ప మనకు మాత్రం ఎవరున్నారమ్మా? ఒకే యింట్లో ఉంటే మనస్పర్థలు వస్తాయేమోనని"

"బాకీ తీర్చేవరకూ ఉందాము ఆ తర్వాత యిష్టంలేకపోతే వేరే యిల్లు తీసికొని విజయవాడలోనే ఉందాము నీకు ఆ మూడుముళ్ళూ వేయించేస్తే నీ దారిన నువ్వే వెళ్ళిపోతావు. అక్కడే ఏదైనా ఉద్యోగం చూడవచ్చు."

సుందరమ్మ మాటలు సుజాతకు కొంతవరకు సబబుగానే తోచాయి. నిజమే యీ పల్లెటూళ్ళో కూర్చునేకంటే, అన్నయ్య దగ్గరే ఉండి ఏదో ఒకటి జాబ్ చూసుకుంటే సరి తన కాళ్ళమీద తను నిలబడగలిగితే, ఒకరు చూడాలన్న బాధలేదు. తనకు పద్దెనిమిది జరుగుతోంది జాబ్‌కు ట్రై చెయ్యాలి. ముందు ఎంప్లాయిమెంట్ ఆఫీసులో నేమ్ రిజిస్టర్ చేయించాలి.

"అన్నయ్య చెప్పినట్టే చేద్దామమ్మా! మనమే యివ్వకపోతే తనకు అప్పెవ రిస్తారు? మూడు సంవత్సరాలనుండి యిద్దరూ ఉద్యోగం చేస్తున్నా కానీ వెనకబడలేదు అదృష్టం కలిసొస్తే, బిజినెస్‌లోనైనా లాభిస్తుందేమో చూద్దాం." సుజాత సంతోషంగా ఒప్పుకుంది యిద్దరూ చెయ్యి కడుక్కొని లేచారు. సుజాత రెండు కంచాలు కడిగి షెల్ఫ్‌లో పెట్టివచ్చి తల్లిప్రక్కనే పడుకుంది. సుందరమ్మ కూతురిమీద చెయ్యివేసి, మరో చేతిని తలక్రింద పెట్టుకుని పడుకుంది తల్లీ కూతుళ్ళిద్దరూ జరగబోయే మార్పుల గురించి ఆలోచిస్తు న్నారు. విజయవాడ వెళ్ళిపోవాలంటే, సామానంతా తీసుకువెళ్ళాలి మరి గేదెలు? టౌన్‌లో ఖాళీస్థలం, వాటికి గొడ్లపాక, గడ్డివామి అన్నీ కావాలంటే కుదర్దు వాటిని యిక్కడే అమ్మివేయాలి యీడు వచ్చిన పిల్ల, చెవులకు జూకాలు తప్ప ఏమీ లేవు నగలు చేయించాలి. పెళ్లిఖర్చు, కట్నం, ఇంకా నగలు కూడా చేయించాలంటే మాటలా? ఎంత, చెల్లెలిమీద ప్రేమ ఉంటే మాత్రం ఎక్కడనుండి తెస్తాడు? గేదెలమ్మి సుజాతకు నగలు చేయించాలి.

యిలా ఆలోచిస్తున్న సుందరమ్మ, కూతురు 'అమ్మా' అని పిలవటంతో తన ఆలోచనా ప్రవంతికి ఆనకట్ట వేసి, "ఏమిటమ్మా?" అని కూతుర్ని ప్రశ్నించింది.

"అన్నయ్య ఏం షాపు పెడదామనుకుంటున్నాడు?"

"అదేదో మందులషాపు పెడతాడట."

"అన్నయ్యను వచ్చి అలాగే బాంక్‌లో డబ్బు తీసికెళ్ళమని లెటర్ రాస్తాను."

"నీ యిష్టం తల్లీ. ఎలా చేస్తావో, నీ మాట కాదనను. మీ వదిన కూడ అందరిలాటిది కాదమ్మా, చాలా అణకువగలపిల్ల."

"ఏమోలే అమ్మా, తర్వాత, ఎలా రాసి వుంటే అలా జరుగుతుంది. అన్నయ్య షాపు ఓపెన్ చెయ్యగానే మనం విజయవాడ వెళ్దాం. ఆ తర్వాత నేను ఏదో ఒక జాబ్ చూసుకుని చేరతాను." సుజాత ఉత్సాహంగా చెప్పింది.

"పిచ్చితల్లీ నీ మనసు మంచిది. భగవంతుడు నిన్ను చల్లగా చూస్తాడమ్మా" అని కూతురి తల నిమిరింది సుందరమ్మ.

సుజాత వ్రాసిన లెటర్ చూచి సుబ్బారావు, వసుంధర చాలా సంతోషించారు. ఆ రోజే లైసెన్స్‌కు అప్లై చేశాడు. వారం తిరక్కుండానే వెళ్ళి, తల్లిచేత, చెల్లెలిచేత సంతకాలు చేయించి బాంక్‌లోని మొత్తం యిరవై వేలు తీసుకున్నాడు. 'మీరు ఎప్పుడు బయల్దేరేదీ లెటర్ రాస్తే వచ్చి తీసుకువెళతాను. గేదెలవీ అమ్మేసెయ్' అని తల్లితో చెప్పి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

సుందరమ్మ గేదెలూ, గడ్డీ, అన్నీ అమ్మేసింది. మొత్తం నాలుగువేలు వస్తే, ఆ సొమ్ముతో సుజాతకు రెండుజతల గాజులు, లాకెట్ గొలుసు చేయించింది. సుందరమ్మకు ఆ పల్లెటూరు జన్మభూమి కాకపోయినా, ఆమె కాపురానికి వచ్చి ముప్ఫై అయిదేళ్ళు. ఉద్యోగరీత్యా ఎక్కడెక్కడ తిరిగినా సెలవలొచ్చేసరికి యింటికి చేరేవారు. ఊళ్ళో అందరూ, భర్త ఉన్నప్పటినుండీ కూడ బాగా అభిమానించేవారు. ఆ ఊరు వదిలి వెళ్ళాలంటే సుందరమ్మకు బాధగానే ఉంది. సుజాతకు విజయవాడ వెళ్ళి ఉండాలంటే సరదాగానూ ఉంది. యీ పల్లెటూళ్ళో వుండి చేసేదేముంది, అక్కడే ఏదైనా జాబ్ చూచుకోవటమో లేక షార్ట్‌హాండ్ నేర్చుకోవటమో ఏదో ఒకటి చెయ్యాలని తొందరగానూ ఉంది. వచ్చే ఆదివారం వచ్చి తీసికెళ్ళమని సుబ్బారావుకు లెటర్ రాసింది. నెలకు యిరవైరూపాయల చొప్పున యిల్లు అద్దెకిచ్చారు. సామానంతా సర్దుకున్నారు.

సుజాత రాసిన లెటర్ చూసి, వసుంధర, భర్తను ఉదయం ఎనిమిదిగంటల బస్‌కు పంపించింది. సుబ్బారావు సామానంతా పార్సిల్ చేయించి, తల్లినీ, చెల్లెలినీ తీసికొని సాయంత్రానికి వచ్చాడు. వసుంధర అత్తగారినీ, ఆడపడుచునూ సాదరంగా ఆహ్వానించింది.

## 3

నెలరోజుల్లో లైసెన్సు రావటం, 'సుజాతా మెడికల్ స్టోర్స్' అనే పేరుతో రిటెయిల్ మెడికల్ షాపు ఓపెన్ చెయ్యటం, సైమల్టేనియస్‌గా సుబ్బారావు తను చేస్తున్న క్లర్క్ పోస్టుకు రిజైన్ చెయ్యటం జరిగాయి.

సుందరమ్మగారు యింట్లో వంటపని, వడ్డించటం అన్నీ తనే చేస్తున్నది. సుజాత తల్లికి వంటలో హెల్ప్ చేస్తుండేది. వసుంధర మామూలుగానే స్కూలుకు వెళ్ళివస్తున్నది. యింట్లో చేసే పనేమీ లేదు కనుక కాస్త రిలీఫ్‌గానే వుంటున్నది. యిదివరకుంటున్న యిల్లు సరిపోవటంలేదని, గవర్నర్ పేటలో షాపుకు దగ్గరగా ఉండేటట్టుగా, నెలకు రెండువందల రూపాయల అద్దెకు, డాబా యిల్లు మాట్లాడి షిఫ్ట్ అయ్యారు. చిన్న వరండా, దాని వెనుక వరుసగా మూడు గదులు. అన్ని ఫెసిలిటీస్ ఉన్నాయి. మొదటిగది ఎవరైనా వస్తే కూర్చుని మాట్లాడుకోడానికి, రాత్రిపూట సుందరమ్మ, సుజాత పడుకోవటానికీ కేటాయించారు. సెకండ్ రూం వసుంధర, సుబ్బారావుల బెడ్‌రూమ్ లాస్ట్ రూమ్ కిచెన్ కమ్ డైనింగ్ రూమ్. యింటి వెనుక కాస్త ఖాళీస్థలం ఉంది. సుజాతకు మొక్కల పెంపకం హాబీ. ఆ కాస్త స్థలంలోనే వంగ, పచ్చిమిరప, టొమాటో మొదలైన కూర పాదులు పెట్టింది. కుండీలలో గులాబి, కనకాంబరం మొక్కలు, మరువం చెట్లు పెట్టింది. యిదివరకే నాటి ఉన్న మల్లె, సన్నజాజి చెట్లకు పందిళ్ళు వేసింది.

ఉదయం ఏడు గంటలకు తల్లి పెట్టిన టిఫిన్ తిని కాఫీ త్రాగి షాపుకు వెళ్ళేవాడు సుబ్బారావు. సుందరమ్మ కూరలు చేసి, కాసిని బియ్యం వండి, కోడలికి టిఫిన్ బాక్స్‌లో సర్దేసి, తొమ్మిదిన్నరకు రెడీగా ఉంచేది. వసుంధర స్నానంచేసి, తల దువ్వుకుని టాయిలెట్టయి, టిఫిన్ బాక్స్, కొన్ని పుస్తకాలూ, పర్స్ ప్లాస్టిక్ బాసెట్‌లో పెట్టుకుని రిక్షాలో స్కూలుకు వెళ్ళేది. మరలా సాయంత్రం నెమ్మదిగా నడిచి అయిదింటికి యిల్లు చేరుకునేది.

సుబ్బారావు నెలకు నూటయాభై జీతంతో ఫార్మసిస్ట్ కమ్ క్లర్క్‌ను ఎప్పాయింట్ చేశాడు. మధ్యాహ్నం ఒంటిగంటకు యింటికెళ్ళి భోంచేసి ఓ

అర్ధగంట రెస్ట్ తీసికొని, రెండింటికి షాపుకు వెళ్ళేవాడు రాత్రి పదింటికి షాపు క్లోజ్ చేసి యింటికి వచ్చేవాడు

సుజాతకు ఖాళీగా కూర్చోవాలంటే మోనోటనస్‌గా, బోర్‌గా ఉంది. అవకాశం చూచుకొని అప్పుడప్పుడూ సుబ్బారావుతో తనకు జాబ్ చూడమని చెప్తానే వుంది చెప్పినప్పుడల్లా, చూద్దాం అని అంటూ ఉండేవాడు. జాబ్ రావాలంటే ఉత్తరమో, దక్షిణమో ఉండాలి, కాని తనదగ్గర అవి రెండూ లేవాయె అని మనసులో అనుకునేవాడు ఒక్కోసారి, "చెల్లీ నువ్వు జాబ్ చెయ్యవలసిన అవసరమేం వచ్చింది. ముందు పెళ్లి కానీ, తర్వాత చూద్దాం" అనేవాడు.

ఆఖరుకు ఓ రోజున సుబ్బారావు క్లాస్‌మేట్ ప్రకాశ్ వస్తే, అతనితో సుజాతకు జాబ్ చూడమని చెప్పాడు ప్రకాశ్ విజయవాడలోనే కెనరా బాంక్‌లో పనిచేస్తున్నాడు ప్రకాశ్ ఆలోచించి సుజాతను పిలిచి అన్నాడు "జాబ్ రావాలంటే కొంత టైమ్ కావాలి. యీ లోపు జనరల్ నాలెడ్జి బుక్స్, జర్నల్స్ చదువుతూ న్యూస్‌పేపర్ చూస్తూ వుండు వచ్చే అక్టోబర్‌లో బాంక్ టెస్ట్ రాద్దువుగాని," అని సలహా యిచ్చాడు.

సుబ్బారావు నవ్వి, "ఎలాగయినా, మా చెల్లికి జాబ్ వచ్చేలా చూడు ఏమీ తోచక రోజూ నా ప్రాణం తీస్తోంది," అన్నాడు.

"అయితే మా పిల్లల్నీ, యింకా పది మందిని మాట్లాడి పంపిస్తాను ట్యూషన్ చెప్తావమ్మా ?" ప్రకాశ్ అడిగాడు.

"కాస్త కాలక్షేపంగా వుంటుంది పంపించండి అలాగే చెప్తాను " సుజాత అదే మహద్భాగ్యమనుకుని అర్జంట్‌గా తన అంగీకారాన్ని తెలిపింది.

ఆ తర్వాత వారానికే ప్రకాశ్‌గారి పిల్లలు ముగ్గురు, వాళ్ళ ప్రక్క వాటాల లోని పిల్లలు మరో నల్గురూ సుజాత దగ్గర ట్యూషన్‌కు చేరారు. ఫ్రంట్‌రూమ్ ట్యూషన్‌రూమ్ అయింది మార్నింగ్ సెవెన్ టూ నైన్, యీవెనింగ్ ఫైవ్‌టూ సెవెన్ పిల్లలు వచ్చి ట్యూషన్ చెప్పించుకునేవారు మధ్యాహ్నం లీజర్ టైమ్‌లో సుజాత జనరల్ నాలెడ్జిబుక్స్ చదువుతుంది ఒక నెల గడిచేసరికి, స్టూడెంట్స్ స్ట్రెంగ్త్ ముప్పైకి పెరిగింది నెలకు మూడు వందలకు పైగా ఆదాయం వస్తుంటే, టైమ్‌పాసవుతుంటే, సుజాతకు హుషారుగా ఉంది. తను పెంచిన మొక్కలు పూలు పూస్తున్నాయి, కూరపాదులు కాపుకు వచ్చాయి మరో రెండు నెలలకు. రోజూ సాయంత్రం సన్నజాజులూ, కనకాంబరాలూ కోసి

మాలకట్టి, కొంత వదినకిచ్చి, కొంత తన పొడవాటి జడలో తురుముకునేది. శుక్ర, శనివారాల్లో మాత్రం వెంకటేశ్వరస్వామి, లక్ష్మీదేవి ఫోటోలకు వేసేది. సుజాతకు యిదివరకటిలా తల్లికి వంటపనిలో అసిస్ట్ చెయ్యటానికి వీలు పడటంలేదు.

వసుంధర తనే వెళ్ళి ఏదోపని అందుకుని చేసేది. అత్తగారు వద్దన్నా విన కుండా కూరలు తరగడం, బియ్యంలో రాళ్ళు ఏరటం, కాఫీ కలపటం లాటి చిన్న చిన్న పనులు చేస్తుండేది. సుందరమ్మగారి పొదుపరితనం వలన దొడ్లో పండించిన కూరలు వాడటం వలన కొంత అదనపు ఖర్చు తగ్గింది

యిదివరకు యిద్దరికీ నెలకు ఆరువందలు ఖర్చయ్యేది యిప్పుడు నల్గురు మనుషులు, ఇంట్లో సరుకుల వాడకం, పాలు ఖర్చులు పెరిగాయి హౌస్‌రెంట్ నెలకు డెభ్భైఅయిదు పెరిగింది స్కూలుకు యిల్లు దూరంకావటం వలన ఒక సారి నడచివచ్చినా నెలకు పదిహేను రూపాయలు వసుంధర రిక్షా ఖర్చు పెరిగి వసుంధర జీతం పి ఎఫ్. ఇన్సూరెన్స్ కటింగ్స్‌పోను చేతికి వచ్చే మూడువందల యిరవై, సుజాత యిస్తున్న రెండు వందలూ వాడినా చాలటంలేదు సుబ్బారావు షాపు, సేల్స్ ఎమౌంట్‌లోనుండి నెలనెలా మరో మూడువందలు ఖర్చు చేస్తున్నాడు.

సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ గనుక ఎలా ఖర్చుచేసినా తనను అడిగేవారెవ్వరూ లేరు స్టార్టింగ్‌లో ఎస్టాబ్లిష్‌మెంట్ చార్జెస్ మాత్రం గిట్టేవి. సుబ్బారావు మాత్రం ఎప్పుడూ కాస్త రెప్యుటేషన్ వచ్చేవరకూ వెయిట్ చెయ్యాలి, అనే ఆప్టిమిస్టిక్ వ్యూలోనే ఉండేవాడు కాంపిటిషన్ పెంచడానికి, ఇతర షాపులలో కంటె, కమిషన్ రేట్ తగ్గించి అమ్మేవాడు దానితో సేల్స్ పెరిగాయి. ప్రాఫిట్స్ పెద్దగా లేకపోయినా బిజినెస్ బాగానే రన్నవుతోంది ఎకౌంట్స్ మెయింటెయిన్ చేస్తున్నాడు. షాపు సుజాత పేరున ఉంది గనుక తనుకూడ నెలకు నాల్గువందల జీతంమీద మానేజర్‌గా ఎప్పాయింటయినట్టు ట్రీట్ చేస్తున్నాడు పెట్టుబడికి తీసికొన్న యిరవై వేలూ తీర్చడం మొదలుపెట్టాలని, నెలనెలా ఎంతో కొంత బ్యాంక్‌లో జమకట్టాలని అనుకునేవాడు కాని ప్రతినెలా ఎకౌంట్స్ సెటిల్ చెయ్యడం సాధ్యంకాదు ప్రాఫిట్స్ ఎంత మిగిలింది యియర్ ఎండింగ్‌కుగాని తెలియదు అందువలన ఆ ప్రయత్నం మానుకున్నాడు తను తీసుకునే శాలరీ నాల్గువందల్లో మూడువందలు యింటిఖర్చు చేసేవాడు ఓ యాభై తన సిగరెట్లకు, బయట కాఫీలకు ఖర్చుచేసి, మిగిలిన యాభై తన సేవింగ్స్‌లో వేసేవాడు.

ఒకరోజున వసుంధర మధ్యాహ్నం స్కూలునుండి వచ్చి తలనొప్పిగా ఉందని పడుకుంది. ఉదయం తీసికెళ్ళిన అన్నం తినకుండా టిఫిన్ బాక్స్‌తో అలాగే తీసుకువచ్చింది. మంచంమీద వాలి కళ్ళు మూసుకుని పడుకుంది.

"ఏం వదినా అలా వున్నావ్? ఒంట్లో బావుండలేదా?" సుజాత అడిగింది.

"కళ్ళు తిరుగుతున్నట్టు, వికారంగా ఉంది" వసుంధర నీరసంగా జవాబిచ్చింది.

సుజాత యీ విషయం తల్లితో చెప్పి, కాఫీ కలిపి తీసుకురావటానికి కిచెన్ లోకి వెళ్ళింది

సుందరమ్మ కంగారుపడుతూ వచ్చి కోడలి నుదుటిమీద చెయ్యివేసి చూసింది.

"ఉదయం వెళ్ళేటప్పుడు బాగానే ఉన్నావుగా, యింతలోనే ఏమైంది? వళ్ళు చల్లగానే ఉంది," అంటూ వసుంధర, ముఖంలోకి ఆశ్చర్యంగా చూసింది. వసుంధర లేచి చకచకా నడిచి దొడ్లోకి వెళ్ళిపోయింది సుందరమ్మ కోడలి ననుసరించి వెనకాలే వెళ్ళి, ఆమె వాంతిచేసుకోవటం చూసి గ్లాసుతో మంచి నీళ్ళు తెచ్చియిచ్చింది. వసుంధర మంచినీళ్ళు త్రాగి మళ్ళీ గదిలోకెళ్ళి పడుకుంది సుందరమ్మ ఆమె మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చుంది. ఆమె మనసంతా ఆలోచనలతో నిండిపోయింది.

"వసుంధరా, నెలానెలా వాకిటుంటున్నావా?" తన సందేహనివృత్తికోసం కోడలిని ప్రశ్నించింది.

వసుంధర నీరసంగానే నవ్వి "లేదండీ, మూడు నెలలయింది," అని చెప్పి మళ్ళీ యథాప్రకారం కళ్ళు మూసుకుని పడుకుంది.

సుబ్బారావు పెళ్ళై నాల్గు సంవత్సరాలు. అతనితో పెళ్ళైన వాళ్ళంతా యిద్దరు ముగ్గురు పిల్లల తండ్రులయ్యారు యిన్నాళ్ళకు దైవం కరుణించాడు. యింకా కొన్ని నెలలకు తనకు మనవడో, మనవరాలో పుట్టబోతున్నారు. సుందరమ్మ హృదయం ఆనందడోలిక లూగుతోంది.

సుజాత ఆస్ప్రో టాబ్లెట్లు రెండు, ఓ కప్పు కాఫీ తీసుకువచ్చి వదిన కిచ్చింది "ఆ టాబ్లెట్లు వేసుకోకు, కాఫీ త్రాగి పడుకో," అని సుందరమ్మ చెప్పగానే, వసుంధర, టాబ్లెట్లు రెండూ దిండు ప్రక్కనే ఉంచి కాఫీత్రాగి పడుకుంది. సుజాత లోపలికెళ్ళబోతుంటే సుందరమ్మ, "నీకు మేనల్లుడు పుడతాడమ్మా," అని చెప్పింది.




సుజాత ఒక్కసారి ఎగిరి గంతేసింది. వసుంధర మంచందగ్గరకు ఒక్క అంగలో వెళ్ళి, "వదినా, ఈ శుభవార్త ఇందాకటినుండీ చెప్పవే మరి," అంటూ ఉత్సాహంగా ఆమె రెండు భుజాలూ పట్టుకుని ఊపేసింది.

వసుంధర చిన్నగా నవ్వి, సిగ్గుతో ఎర్రబడిన బుగ్గలను తన రెండు చేతులలో దాచేసుకుంది.

"నీ పిచ్చి ఆనందం నువ్వూనూ, వదిన్ని అలా కుదిపేయకు," అని సుందరమ్మ నవ్వుతూనే కూతుర్ని మందలించింది.

ఆ రాత్రి సుబ్బారావు వచ్చినతర్వాత సుజాత ఈ శుభవార్త చెప్పింది. సుజాత అనుకున్నట్టు అతను ఆనందంతో తలమునకలవలేదు. చెల్లెలి ఆనందాన్ని చూసి చిన్నగా నవ్వుకుని, తాపీగా "అలాగా," అని ఊరుకున్నాడు.

సుజాత చిన్నబుచ్చుకుని లోపలికెళ్ళింది.

సుబ్బారావు డ్రస్ మార్చుకోవటానికి గదిలోకెళ్ళాడు. వసుంధర ప్రశాంతంగా నిద్రపోతున్నది. లేపటం ఎందుకులే అని, లుంగీ కట్టుకుని కామ్‌గా బయటకు వచ్చాడు. అతను కాళ్ళూ చేతులు కడుక్కుని వచ్చేసరికి సుందరమ్మ భోజనం వడ్డించింది. సుబ్బారావు పీటమీద కూర్చుంటూ అడిగాడు.

"చెల్లి భోంచేసిందమ్మా?"

"ఆ యిందాకే తిని, నీకోసం కాచుక్కూర్చుంది." సుందరమ్మ అర్థవంతంగా జవాబిచ్చింది.

వదిన ప్రెగ్నెంట్ అని తనతో చెప్పాలని, సుజాత యిప్పటివరకూ వెయిట్ చేసిందని ఆమె భావం. అది గ్రహించిన సుబ్బారావు మళ్ళీ అడిగాడు.

"నీ కోడలు భోంచేసిందా?"

"మధ్యాహ్నంనుండి అలా పడుకునే ఉంది. స్కూలుకు తీసుకువెళ్ళిన అన్నం తినకుండా తెచ్చింది. సాయంత్రం ఆరింటికి గుప్పెడు బియ్యం వండి ఉసిరికాయ పచ్చడితో వడ్డించాను. వేడిగా నాల్గు మెతుకులు తిని పడుకుంది"

"నువ్వూ వడ్డించుకో అమ్మా, అప్పుడే పదిన్నరయింది" ఒక్కసారి కొడుకుముఖంలోకి చూచి తనూ వడ్డించుకుంది సుందరమ్మ.

సుబ్బారావుకు పెరుగువడ్డించి అతను అన్నం కలుపుతుండగా సుందరమ్మ అతనితో, "బాబూ, రేపు ఉదయం వసుంధరను తీసుకువెళ్ళి డాక్టరుకు చూపించు. మందులూ, బలానికి టానిక్కులు రాయించుకురా. యిప్పటినుండే పళ్ళూ అవీ వాడాలి. అసలే బక్కపల్చగా సన్నగా ఉంటుంది," అని చెప్పింది.

"నా కెక్కడ వీలవుతుంది? నువ్వు తీసుకువెళ్ళమ్మా, లేడీ డాక్టరు దగ్గర కేగా?"

"శుభమా అని నేను తీసికెళ్ళడమేమిటి? నీకు షాపులో పని ఎప్పుడూ ఉండేదే. నాకు ఎదురు చెప్పక, రేపు ఉదయం తొమ్మిది గంటలకు ఓసారి వచ్చి తీసికెళ్ళు."

"అదికాదమ్మా, ఎవరు వెళ్ళినా ఒకేరకం మందులు రాస్తుంది. చీటీ తీసుకు వస్తే నేను రేపు మధ్యాహ్నం షాపునుండి మందులు పంపిస్తాను"

"ముందు నేను చెప్పినట్టు చెయ్యి ఒకసారి నువ్వు చూపించిరా. తర్వాత ఎప్పుడైనా అవసరమయితే సుజాతగాని నేనుగాని తీసికెళ్తాము." సుందరమ్మ ఖచ్చితంగా చెప్పింది ఆమె మాటను కాదనలేకపోయాడు సుబ్బారావు.

తను భోంచేసి తల్లి తినేవరకూ కూర్చుని ఆ తర్వాత సిగరెట్ అంటించుకుని, వీధి గుమ్మంలో నిలబడి, పొగ రింగులు రింగులుగా వెళ్తుంచే, ఆ సిగరెట్ ధూప మేఘాలతో పాటే అతని ఆలోచనలూ సాగుతున్నాయి.

తన పెళ్ళై నాల్గు సంవత్సరాలయింది యిన్నాళ్ళూ ఆర్థిక యిబ్బందుల వలన, యిద్దరూ ఉద్యోగాలు చేస్తూ పిల్లల్ని పెంచడం కష్టమని సంతానాన్ని వాయిదా వేస్తూ వచ్చారు. యిప్పుడు షాపు బాగానే నడుస్తున్నది మెడికల్ షాపు నుండి తను జీతంగా తీసికొనే డబ్బు, వసుందర జీతం, సుజాత నెల నెలా యిస్తున్న రెండువందలతో యిల్లు హాయిగా గడుస్తోంది. తనకు పిల్లలు కావా

లని తన భార్య పట్టుబట్టింది. ఆడవాళ్ళకిదోపిచ్చి పిల్లలు లేకపోతే వచ్చిన నష్టమేమిటి?

యింతవరకూ, అప్పుచేసిన యిరవై వేలూ, ఒక్క పైసా కూడా తీర్చలేదు. యిప్పుడే నెలకు ఎనిమిదివందల పైచిలుకు ఖర్చవుతోంది. రేపు తన ఫామిలీలో ఐదవ మెంబరు చేరబోతున్నాడు నెల ఖర్చు మరోవంద పెరుగుతుంది బాకీ ఎలా తీరగడం? సుజాతకు పందొమ్మిదేళ్ళు నిండి, యిరవై జరుగుతోంది యిప్పటికే ఎన్నో సమ్మంధాలు వచ్చాయి అందంగా ఉంటుంది కనుక చేసుకుంటామని చాలామంది అడిగారు పెళ్ళిఖర్చులు, లాంఛనాలు వీటికి కనీసం పదివేలయినా కావాలి. కట్నం సంగతి అలాఉంచి, ముందు పెళ్ళి చెయ్యటానికే డబ్బులేదు. అందుకే సుజాత పెళ్ళి యీ సంవత్సరానికి వాయిదావేశాడు యీ సంవత్సరం వచ్చే లాభం చూసుకుని, వచ్చే సంవత్సరం సుజాత పెళ్ళి చెయ్యాలి ఆ తర్వాత రెండేళ్ళలో ఆమెకివ్వవలసిన పదివేలూ తీర్చెయ్యాలి తల్లి ఎలాగూ తన దగ్గరే ఉంటుంది కనుక ఆమెకివ్వవలసిన పదివేలూ తర్వాత సంవత్సరానికి వెయ్యి, రెండువేల చొప్పున బ్యాంక్‌లో డిపాజిట్ చెయ్యవచ్చు షాపు మిగిలితే తమ జీవితాలకు సరిపోగా, పుట్టేపిల్లలకు తనివ్వగల్గేది అదే సిగరెట్ చివర వరకూ కాలి, వేలు చురుక్కుమనడంతో యీ లోకంలోకి వచ్చి, సిగరెట్ పీకను దూరంగావిసరి, లోపలికొచ్చి తలుపు గడియవేసి నిద్రపోతున్న సుజాతను, అప్పటికే గుర్రుపెడుతున్న తల్లినీ, ఒకసారి చూసి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి, ప్రశాంతంగా, పసిపాపలా, ముడుచుకుని పడుకున్న వసుంధరను ఒకసారి చూసి లైటాఫ్‌చేసి నెమ్మదిగా వెళ్ళి ఆమె ప్రక్కనే పడుకున్నాడు వసుంధరకు మెలకువవచ్చి భర్తను చూచి, "ఎంతసేపయింది మీరొచ్చి? అలా పడుకుంటే నిద్రపట్టేసింది" అని భర్త వచ్చేటప్పటికే భోంచేసిపడుకున్నందుకు నొచ్చుకుంది.

"సరేగాని, నువ్వు తల్లివి కాబోతున్నావట, నిజమేనా?" భార్య నడుం చుట్టూ చేయివేసి దగ్గరకు లాక్కుంటూ అడిగాడు సుబ్బారావు

"మీరు తండ్రి కాబోతున్నారు, అక్షరాలా నిజం," అంది చిలిపిగా అతని జుట్టులోనికి తన చేతివ్రేళ్ళు పోనిస్తూ

"అయితే మనకు బాబు పుడతాడన్నమాట"

"కాదు పాపే పుడుతుంది"

"నీకేం, ఆడపిల్లను కని కూర్చుంటావు కట్నాలివ్వలేక, పెళ్ళి చెయ్యడానికి నేను బాధపడాలి"

"మీరేమీ బాధపడక్కరలేదు మా నాన్నగారు మీకిచ్చారా కట్నం? అలాగే మీరూ మీ అమ్మాయికి యివ్వనక్కర్లేదు."

"అందరూ నాలాగే ఉంటారా? అయినా అప్పటిసంగతి. మనకు బాబు పుడితే పేచీయే లేదు "

"పాప పుట్టినా ఏమీ ఫర్వాలేదు బాగా చదివించి డాక్టరును చేద్దాం అప్పటి వరకూ యాంటీడౌరీ ఎనాక్ట్‌మెంట్ అమలులోకి రాకపోతే అప్పుడాలోచిద్దాం "

"నీ తెలివి అమోఘం, వసూ, నువ్వు మినిస్టరవ్వాల్సింది, నాకు భార్య వయ్యావుగాని " భార్య చెంపమీద ముద్దు పెట్టుకుని ఓ కాంప్లిమెంట్ విసిరాడు.

"యిప్పుడు మాత్రం కాలేదా 'కరణేషుమంత్రి' నాకేం తక్కువయింది?"

"ఆనాడు నువ్వు ప్లానేసి నన్ను ప్రోత్సహించబట్టే షాపు పెట్టడం జరిగింది. లేకపోతే ఎక్కడేశావ్ గొంగళీ అంటే వేసినచోటే ఉన్నానన్నట్టు, ఆ గుమాస్తా ఉద్యోగాన్ని పట్టుకుని వ్రేలాడుతూ ఉండేవాణ్ణి."

"నేను కేవలం ఎడ్వైజర్‌ను మాత్రమే. కష్టమంతా మీది. మీ కృషి ఫలితంగా, బిజినెస్ డెవలప్ అయింది. మెడికల్ షాపు అచిరకాలంలోనే పాపుల రయింది."

"కృషి చెయ్యకుండా ఏ పనీ జరగదు అంతా దేవిగారి అదృష్టం " అని వసుంధరను హృదయానికి హత్తుకున్నాడు. ఆమె అతని గాఢ పరిష్వంగంలో గువ్వలా యిమిడిపోయింది

"పడుకోండి, అప్పుడే పన్నెండవుతోంది. మరలా ఎర్లీమార్నింగ్ సిక్స్‌కే లేవాలి " వసుంధర భర్తవేపు జాలిగా చూస్తూ అంది.

"చెప్పడం మరచిపోయాను. అమ్మ నిన్ను లేడీడాక్టరుకు చూపించమంటోంది. రేపు ఉదయం నైన్‌తర్టీకి వచ్చి తీసుకెళ్తాను రెడీగా ఉండు "

"యిప్పుడెందుకండీ, బాగానే ఉన్నానుగా?"

"ఏమో నాకు తెలియదు పండులాటి మనవడు ఆరోగ్యంగా పుట్టాలని ఆవిడ గారి ఆశ. నిన్ను తీసికెళ్ళి టెస్ట్ చేయించేవరకూ ఊరుకోదు."

"నైన్‌తర్టీకి వెళ్తే, స్కూలుకు అందుకోగలనా?" వసుంధర తన సందేహాన్ని వెలిబుచ్చింది.

"రేపుకూడా లీవ్ పెట్టెయ్ "

"మాద్దాంలెండి," అని, నిద్రలోకి జారుకుంది.

తెల్లగా పాలిపోయినట్టున్న చెక్కిళ్ళు, మూసిన విశాలమయిన కళ్ళకు దిద్దిన

కాటుక రేఖ, కోటేరులాంటి ముక్కు, చిన్ననోరు, విశాలమయిన నుదురు, దాని మీద ఫ్యాను గాలికి పడి చిందులేస్తున్న నీలాలముంగురులు, ఆమె ముఖాన్నే చూస్తూ ఎప్పుడో నిద్రపోయాడు సుబ్బారావు.

## 4

అక్టోబర్‌లో సుజాత కెనరా బ్యాంక్ టెస్ట్ రాసింది. స్వతహాగా మెరిటోరియస్ స్టూడెంట్ కావటం, జాబ్ చెయ్యాలన్న పట్టుదలతో బుక్స్ చదివిందేమో, పేపర్ బాగా ఆన్సర్ చేసింది. అయినా జాబ్ వస్తుందో లేదోనన్న డౌట్ లేక పోలేదు. యిదివరకు చెప్తున్న ట్యూషన్ కంటిన్యూ చేస్తున్నది.

వసుంధర ఓ పదిహేను రోజులు మార్నింగ్ సిక్‌నెస్‌తో బాధపడినా తర్వాత బాగానేఉంది. సుందరమ్మ కోడల్ని ఎంతో అపురూపంగా చూసుకుంటోంది. రోజూ ఒక సీసా పాలు ఎక్స్ట్రాగా పోయించుకొని, ఉదయం, సాయంత్రం పాలు, ప్రొటినెక్స్ కలిపి యిస్తున్నది ఆరిపోయినవి తినలేవు అని ఉదయం తొమ్మిదిన్నరకు స్పెషల్‌గా వండి వడ్డిస్తున్నది. మధ్యాహ్నం పళ్ళరసం, ద్రాక్ష పళ్ళు, రెండు చెక్కెర కేళీలు యిచ్చిరమ్మని సుబ్బారావుకు స్పెషల్ డ్యూటీ వేసింది. సాయంత్రం అయిదింటికి వేడివేడిగా టిఫిన్, కాఫీ యిచ్చేది. స్నానం చేసి కొంచెంసేపు రెస్ట్ తీసుకొనేటప్పటికి భోజనం రెడీచేసి ఏడింటికే వడ్డించేది. టైంప్రకారం టానిక్కు, మందులూ యిచ్చి, రాత్రి పదింటికి పాలు, షుగర్ కలిపి యిచ్చేది. సుబ్బారావు మామగారికి లెటర్ రాశాడు వసుంధరకు రెండు సంవత్సరాలు నిండకమునుపే తల్లి కరవయింది మేనత్త, విధవగా యింట్లోనే ఉంటూ వసుంధరను పెంచింది ఆవిడకూడా వసుంధరకు పధ్నాలుగేళ్ళు నిండక ముందే పరమపదించింది

వసుంధర తండ్రి సుందర్రామయ్య భార్యపోయిన సంవత్సరానికే మాణిక్యాంబను పెళ్ళిచేసుకున్నాడు ఆవిడకు ముగ్గురు మగసంతానం వసుంధర అంటే ఆవిడకేమాత్రమూ కిట్టదు అందుకే సుందర్రామయ్య యింటర్ పాసవగానే టీచర్ ట్రెయినింగ్‌లో చేర్పించారు. ట్రెయినింగ్ పూర్తికాగానే తన స్నేహితుడు రాఘవరావు ఏకైక పుత్రుడు సుబ్బారావు కిచ్చి కన్యాదానంచేశాడు. యీ నాలుగేళ్ళలోనూ నాలుగైదు నెలలకొకసారి తనే వచ్చి రెండురోజులుండి కూతుర్ని చూచివెళతాడు వెళుతూ గాజులు తొడిగించుకో అమ్మా అని అయిదో, పదో, వసుంధర వద్దన్నా వినకుండా యిచ్చి వెళ్ళేవాడు.

సుందర్రామయ్య, అల్లుడు రాసిన ఉత్తరం భార్యకు చూపించి, "తొలికాన్పు గదా, అమ్మాయిని పురిటికి తీసుకువద్దామా" అని అడిగాడు.

"యిక్కడ మీ ఎస్టేటు తరగదన్నట్టు మాట్లాడతారేమిటి? తీసుకురావటం మాటలా ఎంతలేదన్నా ఏడెనిమిది వందలు ఖర్చవుతుంది వాళ్ళ తిప్పలు వాళ్ళు పడతారు అంటే సవతితల్లి చూడదని ఒకమాట సెన్నే అంటారు మీకు చూడాలనిపిస్తే ఒకసారి వెళ్ళి ఓ డజను పళ్ళు కొని యిచ్చి చూచిరండి అంతే గాని అనవసరంగా ఆర్భాటం చెయ్యకండి" అని సలహాయిచ్చింది మాణిక్యాంబ

సుందర్రామయ్య అదీ నిజమే అనుకున్నాడు అక్కడయితే అత్తగార్నూ, భర్త ఆడపడుచు అందరూ ఉన్నారు దగ్గరే హాస్పటల్స్ ఉన్నాయి యిక్కడకు తీసుకువచ్చినా ఎవరు చూస్తారు? మొగవాడు తనేం చెయ్యగలడు? అని ఆలోచించి జాగ్రత్తగా చూచుకోమని వీలు చూచుకొని వస్తానని అల్లుడికి లెటర్ రాశాడు

కానీ కట్నం లేకుండా చేసుకున్నా పుట్టింటివారు ఎ లాంఛనాలూ జరపక పోయినా భర్తగాని అత్తగారుగాని తనను ఒక్కమాట అనకుండా ఎ లోటూ రానివ్వకుండా ఎంతో ఆప్యాయంగా ఆదరాభిమానాలతో చూడటం వసుంధరకు మహదానందంగా ఉంది వీళ్ళు నిజంగా దేవతలు యిలాంటి వాళ్ళుండటం లోకంలో అరుదు అనుకునేది ఆ మాటే అప్పుడప్పుడు భర్తతో అనేది రెండు చేతులూ కలిస్తేగాని చప్పట్లు మ్రోగవ్ వసూ మాలో కలిసిపోయే ఉత్తమ సంస్కారం గల నీవు మా గృహలక్ష్మివి కావటం మా అదృష్టం మన సంసార నౌక యిలాగే నాల్గు కాలాలపాటు చల్లగా నడవాలని భగవంతుని ప్రార్థిస్తాను, అనేవాడు

"మీలాటి సహృదయులను కరుణామయుడగు భగవంతుడు ఎప్పుడూ చల్లగా చూస్తాడు" అనేది వసుంధర

వసుంధరకు ఆరవమాసం వచ్చింది సుందరమ్మ శ్రీమంతం చెయ్యాలని సుబ్బారావుతో చెప్పింది "పెద్దగా ఖర్చుపెట్టకు ఓ పదిరూపాయలిస్తాను పళ్ళు తెప్పించి నల్గురు ముత్తైదువులను ఎలిచి యిప్పించు" అన్నాడు

సుందరమ్మ ముక్కుమీద వేలేసుకుని "చాల్లే మంచిమాటే చెప్పావుగాని నీ డబ్బేం యివ్వద్దులే నా డబ్బులోనుండి ఓ అయిదువందలిలా పారెయ్యావోయ్ శుభమా అని పెళ్ళైన నాలుగేళ్ళకు కొడుకు పుట్టబోతున్నాడని ఓ ముద్దూ మురిపెంలేదు ఆ అమ్మాయికీ తల్లి లేకపోబట్టి యిక్కడ చెయ్యవలసి వచ్చింది అవసరానికి ఖర్చుపెట్టకపోతే ఎందుకు నీ సంపాదన" అని కొడుకుని పట్టుకుని దులిపింది

సుబ్బారావు నోరు మూసుకుని కావలసినవన్నీ కొనితెచ్చాడు. ఎనిమిది వందలు ఖర్చయింది. వసుంధర తండ్రికి లెటర్ రాశారు. మాణిక్యాంబ వచ్చి రవికలగుడ్డ, పసుపూ, కుంకుమ, ఓ డజన్ పళ్ళూ, సవతి కూతురి ఒళ్ళోపెట్టి, మీ నాన్నగారి ఓపిక యింతేనమ్మా! అని చెప్పింది. "మీరు పెట్టాలా? కంటితో చూస్తే చాలదూ," అని, కొడుకుతో తెప్పించిన చీర, జాకెట్టు, పళ్ళూ మాణిక్యాంబతో వసుంధరకు యిప్పించింది సుందరమ్మ. అవన్నీ యిచ్చి మాణిక్యాంబ, వసుంధర నెత్తిమీద అక్షతలు చల్లి, త్వరలో పనసపండులాటి బాబు నెత్తుకుని, మీ నాన్నగారిని తాతగారిని చెయ్యమ్మా," అని నవ్వింది.

పేరంటాళ్లందరూ వెళ్ళింతర్వాత సుందరమ్మ పసుపు సున్నం కలిపిన నీళ్ళు తెచ్చి వసుంధరకు దిష్టితీసింది. మాణిక్యాంబ, వసుంధరను పురిటికి తీసుకువెళ్తాను పంపించమని అడిగింది. "వద్దులెండి ఎక్కడయితేనేం? మా యింట్లోనే పురుడు పోస్తాము. ప్రసవించగానే లెటర్ రాయిస్తాను, రండి," అని చెప్పింది. మాణిక్యాంబ, తను పైమాటగా అన్నా, వాళ్ళు పంపించనందుకు మనసులోనే సంతోషిస్తూ, మరునాటి ఉదయమే వెళ్ళిపోయింది.

డిసెంబరు ముప్పైఒకటికల్లా, సుబ్బారావు మెడికల్‌షాపు ఫైనల్ ఎకౌంట్స్, తయారుచేయించాడు. టాక్సులన్నీ చెల్లించగా ఆరువేలు లాభం మిగిలింది. శ్రీమంతం ఖర్చు ఎనిమిదివందలూ బాకీ తీర్చేశాడు. ఐదువందలు ఖర్చుపెట్టి భార్యకూ, తల్లికీ, చెల్లెలికీ, సంక్రాంతికి చీరలు, జాకెట్టుగుడ్డలూ కొన్నాడు. ఏడువందలు వసుంధరకు డెలివరీ అయితే కావాలని దాచాడు. మిగతా నాలుగు వేలూ, సుజాతకివ్వవలసిన బాకీ తీర్చడానికి బ్యాంక్‌లో వేశాడు.

ఒకరోజు రాత్రి వసుంధర భర్తను అడిగింది.

"యీ సంవత్సరం లాభం ఎంత మిగిలిందండీ?" వసుంధర.

"ఆరువేలు. షాపుతెరిచిన మొదటి సంవత్సరంగదూ. తర్వాత యింకా ఎక్కువే మిగలొచ్చు." సుబ్బారావు ఉత్సాహంగా చెప్పాడు.

"ఆరువేలూ ఏంచేశారు?"

"శ్రీమంతం ఖర్చు, పండుగకు బట్టలఖర్చు, నీ డెలివరీ ఖర్చుకు ఏడు వందలు దాచాను."

"మిగిలిన సొమ్ము ఏంచేశారు?"

"సుజాత పెళ్ళికోసం బ్యాంక్‌లో వేశాను."

"సుజాత పెళ్ళి, 'సంబంధం కుదరాలిగా, అప్పటి సంగతి చూడవచ్చు."

"అయితే యిప్పుడేంచేద్దామంటావ్?"

"మీ చెల్లెలికి ఉన్నవి చూడండి అలాటి గాజులు చేయించరూ?" వసుంధర, భర్త చొక్కా-కాలరు సరిచేస్తూ గోముగా అడిగింది

సుబ్బారావు అదిరిపడ్డాడు తన కంగారు తనలోనే దాచుకుని

"వసూ యిప్పుడు రెండుపేలు ఖర్చుపెట్టి ఎందుకు ముందా బాకీ తీర్చనియ్ తర్వాత చూద్దాం" నెమ్మదిగా చెప్పాడు

"ఓ ముద్దూ ముచ్చటా లేవు నా బ్రతుక్కి భార్యకు నగలు చేయించాలి, మంచి బట్టలు కొనివ్వాలి అందంగా తిరుగుతుంటే చూసి మురిసిపోవాలని భర్త అనేవాడు ఎవడైనా అనుకుంటాడు మీ కా ధ్యాసేలేదు దేనికైనా పెట్టి పుట్టాలి" అని విసురుగా దిండు క్రిందకు పడేసి లేచి వెళ్ళి దిండుమీద తల పెట్టుకుని దుప్పటికూడా లేకుండా కటికనేలమీద పడుకుని చిన్నగా ఎడవటం మొదలుపెట్టింది

సుబ్బారావు భార్య దుఃఖాన్ని కోపాన్ని చూసి క్షణం నివ్వెరపోయాడు తక్షణమే బెడ్‌మీదనుంచి దూకి భార్య దగ్గరగా వెళ్ళి కూర్చుని ఆమె తల తన ఒడిలోకి తీసుకున్నాడు ఆమె రెండు చేతులలో ముఖం దాచుకుంది ఏడుపు మాత్రం మానలేదు

"ఏమీలేనివాణ్ణి నన్ను కట్టుకుని నువ్విలా నగలు లేకుండా ఉండటం చూస్తే నాకూ బాధగానే ఉంది వసూ కాని ఎం చెయ్యను చెప్పు చాలీ చాలని సంపాదన పెరిగే ఖర్చు వీటితో సతమతమవుతూ నీ కోరికలు తీర్చలేని అసమర్థుడనయ్యాను" అని బాధపడుతూ భార్య కన్నీరు తుడిచాడు

"యిదివరకు మిమ్మల్ని ఎప్పుడైనా చీరలు నగలు, కావాలని అడిగానా? యిప్పుడు కాస్త కలిసొచ్చింది నాలుగువేలు చేతిలో ఉన్నాయి కదా అని ముచ్చటపడి అడిగాను" వసుంధర వెక్కి వెక్కి ఎడుస్తూ చెప్పింది

"అనుకూలవతియైన భార్య దొరకడంకంటె పురుషుడికి వేరే అదృష్టం ఏముంది నిన్ను చూచి గర్వపడుతుంటాను అందుకే"

"అవును అందుకే తీర్చారు ముద్దూ ముచ్చట్లు" ఆమె నిష్ఠూరంగా అంది

"నీకు ఏ నగలూ లేకపోయినా నీ అందంలో ఒక ప్రత్యేకత ఉంది వసూ నిరంతరం నీ ముఖంలో మెరిసే చిరునవ్వే నీకు పెట్టని ఆభరణం యింత అందంగా ఉన్న నీకు నగ లెందుకు"

"హుఁ మాటలు నేర్చారు నన్ను మాయపుచ్చడం మీకు వెన్నతో పెట్టిన విద్య" అని కోపాన్ని మరిచిపోయి నవ్వింది




సుబ్బారావు 'హమ్మయ్య' అనుకుని తృప్తిగా శ్వాస తీసుకున్నాడు.

"నిజం వసూ, అజంతా చిత్రసుందరిలా మెరిసిపోతున్న నిన్ను చూడగానే మనసు పారేసుకున్నాను. అందుకే కట్నంకోసం ఆశించక, నీ మెడలో మూడు ముళ్ళు వేసి నిన్ను నాదాన్ని చేసుకున్నాను. ఒక్క రెండు సంవత్సరాలాగు, ఆ తర్వాత మెడికల్‌షాపు మీద వచ్చే లాభమంతా నీ చేతికే యిస్తాను. నీ యిష్టం వచ్చిన నగలు చేయించుకుందువుగాని" అని వసుంధరను శాంతపరచి పక్కమీదకు తీసుకువెళ్ళాడు. అప్పటి కా గండం గడిచిందని సంతోషించాడు.

## 5

ఒక నెలరోజులు ఎలాటి ఒడిదుడుకులూ లేకుండా ప్రశాంతంగానే గడిచాయి. సుజాత చేతిగాజులు చూచినప్పుడల్లా, వసుంధర మనసులో కలుక్కుమంటోంది. అయినా భర్తను మరోసారి అడగలేకపోతున్నది.

మాణిక్యాంబ కన్ను సుజాతమీద పడింది. ఆవిడ జ్యేష్ఠ పుత్రుడు చిరంజీవి మధుసూధనరావు, ఉరఫ్ మధు, ముచ్చటగా మూడుసార్లు, యింటర్మీడియట్ పరీక్షలకు దండయాత్ర చేసి, విరక్తి జెంది ఆ ప్రయత్నం మానుకుని, టైపు నేర్చుకుంటానని చెప్పి రోజూ సినిమాలు చూసి వస్తుంటాడు. చేతికందిన వస్తువులు పట్టుకుపోయి అమ్మి, ఆ డబ్బుతో సినిమాలు చూడటం, హోటళ్ళలో మెక్కడం, జులాయి తిరుగుడు తిరగటం, అర్ధరాత్రి ఇంటికి చేరటం, ఇవి అతని హాబీలు. వయసులో వున్నాడు, ఏదో తిరుగుతున్నాడు, పెళ్లిచేస్తే

బాధ్యత నెత్తినపడితే తనే కుదురుగా ఉంటాడు, అని సరిపెట్టుకునేది మాణిక్యాంబ తండ్రి ఎప్పటికప్పుడు చివాట్లు పెడుతున్నా లెక్కచేసేవాడుకాదు. అందుకే సుందర్రామయ్య మధును గాలికి వదలి, కనిష్ఠు లిద్దరినీ శ్రద్ధగా చదివించుకున్నాడు

శ్రీమంతానికి వచ్చివెళ్ళిన తర్వాత మాణిక్యాంబ భర్తతో, "వసుంధర ఆడపడుచు లేదూ, సుజాత, రత్నం, అందానికి అందం, చదువుకు చదువూ, పనిపాటలన్నీ వచ్చు, అణకువగల పిల్ల మన మధుకి చేసుకుంటే బావుండు. నండీ," అని అంది

"ఆ, బాగానే ఉంటుంది, చేసుకోవటం నీ యిష్టమేనా ? వాళ్ళివ్వద్దూ, ఆ పిల్ల యిష్టపడవద్దూ ?"

"ఎందుకివ్వరు ? వాడికేం తక్కువ, అందానికి లోటా ? మంచి పర్సనాలిటీ, యింటర్ చదివాడు, యివాళ కాకపోతే రేపు బంగారంలాటి ఉద్యోగం వస్తుంది. ఫాషన్‌గా వుంటాడు, తెలివైనవాడు కో అంటే కోటిమంది పిల్లనిస్తామని వాడి కాళ్ళమీద పడతారు "

"యింకేం అయితే కో అని అరచి, ఆ యిస్తామనే కోటిమంది పిల్లల్నీ తీసుకువచ్చి నీ పుత్ర రత్నానికి పరిణయం గావించు పాపం, తండ్రిలేని పిల్ల ఆ రాఘవయ్య కూతురి జీవితం నాశనం చెయ్యకు "

"మీ కసలు కొడుకుమీద ప్రేమాభిమానాలు లేవు ఉంటే యిలాగేనా మాట్లాడటం ?" భర్తమీద కస్సుమంది మాణిక్యాంబ

"మధ్య మనం దెబ్బలాడుకోవటం దేనికి ? అడిగిచూడు, వాళ్ళిస్తానంటే నా అబ్జక్షన్ ఏమీలేదు అలాగే చేద్దాం "

"అలా దారికి రండి ఆడదాన్ని నేను కాకపోతే మీరు వెళ్ళి అడక్కూడదూ ? మీ అల్లుడేగా సుబ్బారావు అతన్నడిగితే సరిపోతుంది "

"చాల్లే, బాగా చెప్పావ్, కావాలంటే నువ్వడుగు లేకుంటే లేదు నేను మాత్రం చచ్చినా అడగను " సుందర్రామయ్య ఖచ్చితంగా చెప్పాడు

"సరేలెండి, నా కెలా తప్పుతుంది, నేనే వెళ్ళి అడుగుతాను" అని ఆ సంభాషణ అంతటితో ఆపేసింది

వసుంధరను కాకాపడితేగాని వాళ్ళను ఒప్పించదు అనుకొని, మాణిక్యాంబ నాలుగు రకాల స్వీట్సు తయారుచేసి, ఓ యాభై రూపాయలు పెట్టి చీర, జాకెట్టు గుడ్డ, తెప్పించుకుని శనివారం సాయంత్రం విజయవాడ వెళ్ళింది బస్‌స్టాండులో

ఫ్రూట్‌షాపు దగ్గర ఓ యాభై అరటిపళ్ళు తీసికొని, రిక్షా ఎక్కి ఆరింటికి వసుంధర యింటిముందు దిగింది సుందరమ్మ, మాణిక్యాంబ తీసుకువచ్చిన సూడిదలు చూసి, ఎనిమిదో నెల జరుగుతుంటే యిప్పుడివన్నీ ఎందుకని అనుకుంది ఆ మాటే వియ్యపురాలితో అంటే, "ఎప్పుడయితేనేం మా పిల్లకు పెట్టుకోవాలనిపించింది, తీసుకువచ్చాను మీరు ఎంతో జాగ్రత్తగా చూడబట్టే, అమ్మాయి ఆరోగ్యంగా ఉంది, వళ్ళుచేసింది వదినగారూ" అని సుందరమ్మను మెచ్చుకుంది

సుందరమ్మ వియ్యపురాలికి కాఫీ యిచ్చి వంటపనిలోకి వెళ్ళిపోయింది సుజాత, పిల్లలకు ట్యూషన్ చెబుతూ ఫ్రంట్‌రూమ్‌లోనే ఉంది మాణిక్యాంబ తను వచ్చిన పని వసుంధరతో చెప్పటానికిదే మంచి సమయమనుకుంది

"మీ ఆయన ఎప్పుడు వస్తాడమ్మా?" మాణిక్యాంబ వసుంధర నడిగింది

"ఆయన వచ్చేసరికి రాత్రి పదవుతుంది పిన్నీ" వసుంధర సమాధానం యిచ్చింది

"చల్లకొచ్చి ముంత దాచటం ఎందుకు? నీతో ఒక మాట చెప్పాలనుకున్నా నమ్మా."

"చెప్పు పిన్నీ! ఏ విషయం?"

"అదేనమ్మా, నీ తమ్ముడు మధు గురించి"

"మధు ఇంటర్ పాసవలేదు కదూ! పోయిన పార్టులన్నా కంప్లీట్ చేస్తే దేన్లోనయినా చేర్పించవచ్చు"

"అవన్నీ తర్వాత చూడవచ్చు ముందు మీ ఆడపడుచును యిచ్చి పెళ్లి చేశావంటే నువ్వు చెప్పినట్టు బుద్ధిగా చదువుకుంటాడు"

"సుజాతనా, అదెలా సాధ్యం పిన్నీ ఆయనా, వాళ్ళమ్మగారు ఒప్పుకుంటారా? వాళ్ళు ఒకవేళ ఒప్పుకున్నా, సుజాత యిష్టపడాలిగా?"

"నువ్వెంత పిచ్చిదానివి బయట సంబంధం చెయ్యాలంటే వేలకువేలు గుమ్మరించాలి తల్లీ కొడుకు లిద్దరూ కలిసి నీకూ నీ పిల్లలకూ ఏమీ మిగల నివ్వరు. నీ తమ్ముడికి చేసుకుంటే కానీ యివ్వనక్కర్లేదు ఉభయతారకంగా ఉంటుంది. ఇటు నీకూ ఖర్చు తప్పుతుంది, అటు నాకూ అయినవాళ్ళపిల్ల కోడలవుతుంది"

"నువ్వు చెప్పింది బాగానే ఉంది. కాని వాళ్ళు ఒప్పుకోకపోతే మనం చెయ్యగలిగింది ఏమీలేదు."

"మీ ఆయనను అడిగి చూడు. మధు యింటర్ ప్యానయ్యాడని చెప్పు మీ ఆయన్నను ఒప్పించావంటే, మీ అత్తగారు ఒప్పుకున్నట్టే ఇక సుజాత సంగతంటావా, తెలిసీ తెలియని వయసు, ముందు వద్దన్నా, ఏమన్నా, కాళ్ళూ చేతులూ కట్టి ఆ మూడుముళ్ళూ వేయిస్తే అదే చచ్చినట్టు పడివుంటుంది"

"ఆయనను ఒప్పించడం అంత సులభంకాదు పిన్నీ"

"అడిగి చూడు, ఒప్పుకుంటే సరే, లేకుంటే, వచ్చిన లాభం ప్రతి సంవత్సరం, నీ చీరలకు, నగలకు, ఏవైనా వస్తువులు కొనడానికి ఖర్చు పెట్టించు కట్నంలేకుండా పెళ్లాడటానికి ఎవరూ ముందుకు రారు అప్పుడు చచ్చినట్టు కాళ్ళబేరానికి వస్తాడు ఒక్క దెబ్బకు రెండు పిట్టలన్నట్టు, ఇటు నీ సొమ్మూ చెక్కుచెదరదు అటు సుజాత నీ తమ్ముడి పెళ్లాం అవుతుంది"

"రాత్రికి ఆయనను అడిగి చూస్తాను కాదంటే ఆ తర్వాత నువ్వు చెప్పినట్టే చేస్తాను పిన్నీ" అని సవతి తల్లికి హామీ యిచ్చింది వసుంధర

సవతికూతురు తన మాట విన్నందుకు మాణిక్యాంబ చాలా సంతోషించింది. ట్యూషన్‌కు వచ్చిన పిల్లలను ఏడవగానే పంపేసి సుజాత తల్లి దగ్గర కెళ్ళింది వంటచేస్తున్న సుందరమ్మ, "వదినను భోజనానికి పిలువమ్మా," అని చెప్పడంతో సుజాత వెళ్ళి వసుంధరను పిలిచింది మాణిక్యాంబ సుజాతను ఎగాదిగా చూసింది

ఆ రాత్రి పదిన్నరకు సుబ్బారావు భోంచేసి హుషారుగా యీలవేసుకుంటూ గదిలో కొచ్చాడు వీక్లీ చదువుతూ పడుకునిఉన్న భార్యను చూచి, "యింకా నిద్రపోలేదేం వసూ?" అని పలకరించాడు

"నిద్ర రావటంలేదు మీరు యింత పొద్దుపోయేదాకా ఉండటం ఎందుకు? ఒక గంట ముందుగా షాపు మూసేసి రాకూడదూ?"

"సరేలే, యిప్పుడు చెప్పు, వచ్చానుగా," అంటూ లైటాఫ్ చెయ్యబోయాడు.

"ఆగండి," అని వసుంధర లేచి మాణిక్యాంబ తెచ్చిన స్వీట్స్ ప్లేట్లో పెట్టి తీసుకువచ్చింది

సుబ్బారావు స్వీట్సు తింటూ "ఏమిటి విశేషం? ఈ రోజు యిన్ని రకాలు చేశారు?" అని భార్య ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు

"మా పిన్ని వచ్చింది ఈ స్వీట్సూ, పళ్ళూ, యీ చీరా తీసుకువచ్చింది" అని చీరా, జాకెట్టు గుడ్డ తీసుకువచ్చి భర్తకు చూపించింది

"ఏం ఇంత హఠాత్తుగా ప్రేమ పుట్టుకువచ్చింది, నీ మీద?" అన్నాడు ఆశ్చర్యాన్ని నవ్వుతో మేళవించిన స్వరంతో

"ప్రేమ ఉంటే మాత్రం వాళ్ళకు చేతిలో ఉండొద్దూ పెట్టడానికి. ముగ్గురు మగపిల్లల చదువులు, ఎంత ఖర్చు? నాన్నగారి సంపాదన ఎన్నిటికి సరిపో తుంది? వచ్చే సంవత్సరం రిటైరవుతారు," అంది సానుభూతితో.

తను చెప్పదలచుకున్న విషయం ఎక్కడ మొదలుపెట్టాలి, ఎలా అడగాలి అనే ఆమె ఆలోచిస్తున్నది.

"ఏమండీ," భర్త హృదయంమీద చెయ్యివేసి పిలిచింది నెమ్మదిగా.

"ఏం కావాలి మై డార్లింగ్?" అన్నాడు సుబ్బారావు ఆమెవైపుతిరిగి నవ్వుతూ.

"మిమ్మల్ని ఒక విషయం అడగాలనుకుంటున్నాను." వసుంధర రహస్యం చెబుతున్నట్టుగా అంది.

"అడుగు, సందేహం దేనికి?"

"సుజాతను, మా తమ్ముడు మధు కిచ్చి పెళ్లి చేస్తే ఎలా ఉంటుందంటారు?"

"మా చెల్లినా? మన తాహతుకు తగిన సంబంధం చూసి చేద్దాం. మా నాన్నగారిచ్చి వెళ్ళిన పదివేలూ కట్నం, తర్వాత సర్దుదాం. యిప్పుడు బ్యాంక్‌లో దాచిన నాలుగువేలూ, వచ్చే సంవత్సరం లాభం పెళ్లిఖర్చుకూ లాంఛనాలకూ సరిపోతుంది. వచ్చే సంవత్సరం చేద్దాం. యిప్పుడు తొందరేమొచ్చింది."

"అది కాదండీ, బయట సంబంధం చెయ్యాలంటే మాటలా? ఎంత ఖర్చుపెట్టి చేసినా కుర్రాడు బుద్ధిమంతుడౌతాడని గ్యారంటీ ఏముంది?"

"మీ తమ్ముడు మాత్రం తక్కువా, చదువూ అంతంత మాత్రం, ఉద్యోగమూ లేదు కాస్త కుదురు తక్కువ అని కూడా విన్నాను. యిలాటివాడికి చూస్తూ చూస్తూ బంగారంలాంటి పిల్లను ఎలా యిస్తాం?"

"మీ చెల్లెలినే పొగుడుతున్నారు. మధుకు మాత్రం చిన్నతనం. పెళ్లిచేసి మన యింట్లో పెట్టుకుని చదివించుదాం. పోయిన పార్టులు పూర్తిచేస్తాడు. ఆ తర్వాత బి.ఏ. లోనో పాలిటెక్నిక్‌లోనో చేర్పిద్దాం. కోర్స్ పూర్తయితే ఏదో ఒక జాబ్ రాకపోదు."

"నువ్వు చెప్పేది మరీ బావుంది వసూ. చదివినవాళ్ళు డిగ్రీలు పట్టుకుని రోడ్లు సర్వే చేస్తుంటే, యిప్పుడు మొదలుపెట్టి చదువుతాడు, అతని చదువు పూర్తయ్యేసరికి జాబ్ గ్యారంటీ నువ్విస్తున్నావా?"

"ఏదో, అల్లుడి చెల్లెలుగదా అని మా పిన్ని అడగాలని వచ్చింది. ఇంత గొప్ప సంబంధం వాడికి రాకపోదులెండి." వసుంధర కోపంగా అని దుప్పటి కప్పుకుంది.

"సుజాతకు జాబ్ వస్తే ఎక్కడన్నా నాలుగువందలు సంపాయించు కుంటుంది అలాగే ఏదో చిన్న ఉద్యోగం చేసుకునేవాడి కిచ్చి చేస్తే వాళ్ళ బ్రతుకు వాళ్ళు బ్రతుకుతారు నాకూ ఒక్కగానొక్క చెల్లెలు చూస్తూ చూస్తూ దాని గొంతు కొయ్యలేనని మీ పిన్నితో చెప్పు" సుబ్బారావు ఖచ్చితంగా చెప్పేసి తనూ పడుకున్నాడు

మరునాటి ఉదయం ఆరింటికిలేచి కాఫీత్రాగి ఎడయ్యేసరికి షాపుకెళ్ళిపోయాడు సుబ్బారావు అతను వెళ్ళిన తర్వాత వసుంధర లేచి ముఖం కడుక్కుంది అప్పుడనుకుంది ఈ రోజు ఆదివారంకదా యీయన షాపు కెందుకెళ్ళినట్టు? తనమీద కోపంవచ్చి వెళ్ళిఉండాలి షాపుకే వెళ్ళారో మరెక్కడికైనా వెళ్ళారో, అనుకుంటూ సుజాత తెచ్చియిచ్చినపాలు త్రాగింది మాణిక్యాంబ కాఫీ త్రాగి కూతురి దగ్గరకు వచ్చికూర్చుంది. ఆమె వసుంధర ముఖకవళికలనుబట్టి, సుబ్బారావు అంగీకరించలేదని గ్రహించింది.

"అడిగావమ్మా? ఏమన్నాడు మీ ఆయన?" మాణిక్యాంబ అడిగింది.

"యివ్వనన్నారు పిన్నీ, ఎన్నివిధాల నచ్చజెప్పినా ముందు ఆయనే ఒప్పుకోవటంలేదు." వసుంధర నెమ్మదిగా చెప్పింది.

"ఒప్పుకోడు, ఎందుకు ఒప్పుకుంటాడు? నీ యిల్లు గుల్లచేసి, సర్వం దోచిపెట్టి చెల్లెలిని ఓ ఆఫీసరు కివ్వాలని అతని తాపత్రయం. నువ్వు నేను చెప్పినట్టు చెయ్యి. మన మధు కివ్వక ఏంచేస్తాడో చూద్దాం. నువ్వు సంపాయించి పెడుతుంటే తల్లినీ, చెల్లెలినీ తీసుకువచ్చి ఇంట్లో పెట్టాడు. నీ మాటకే ఎదురు చెప్తాడా?" మాణిక్యాంబ కోపంతో ఊగిపోయింది.

"చెప్పు పిన్నీ, నువ్వు చెప్పినట్టే చేస్తాను," వసుంధర ఆసక్తిగా అడిగింది.

"నీ జీతం నెల నెలా బాంక్‌లో దాచుకో. షాపుమీద వచ్చే లాభం అంతా ఖర్చుపెట్టించి నీకు కావలసిన చీరలు, నగలు, సామాన్లూ కొనుక్కో. మీ ఆయన చేతిలో పైసా వుండనివ్వకు. యింట్లో మీ అత్తగారినీ, ఆడపడుచునూ హీనంగా చూడు. జూన్‌లో మధును యిక్కడికే పంపిస్తాను, కాలేజీలో చేర్పించు. నీకు ఎప్పుడేది అవసరమయినా, నాకు వ్రాయి. యీ విషయాలు మీ నాన్నగారికి కూడా తెలియనివ్వకు. అప్పుడప్పుడు చూసి వెళ్తుంటాలే. నేను చెప్పిన విషయాలు మరచిపోకు." అని వసుంధరకు బోధించి మాణిక్యాంబ వెంటనే బయలుదేరింది. వసుంధర "సాయంత్రం వెళ్దువుగానిలే పిన్నీ," అన్నా వినకుండా రిక్షా పిలిపించుకుని వెళ్ళిపోయింది.

రిక్షాలో వెళుతున్న మాణిక్యాంబను షాపులో కూర్చున్న సుబ్బారావు చూసి, త్వరగానే వెళ్ళిపోయిందే అని అనుకుని షాపు మూసి యింటికి వచ్చాడు

"ఇంతసేపూ ఎక్కడున్నారు?" వసుంధర భర్తను ప్రశ్నించింది

"ఊరికే అలా షాపువైపు వెళ్ళాను. నువ్వు లేవలేదుగా, అందుకని ఏమీ తోచక అలా తిరిగివచ్చాను."

"సుజాతకు సంబంధం కుదిరితే, అప్పటి సంగతి చూద్దాం. ముందు ఓ అయిదు కాసులు పెట్టి నాకు గాజులు చేయించండి." వసుంధర లాలనగా అడిగింది.

"క్రిందటిసారి అడిగినప్పుడు నీకేం చెప్పానో గుర్తుందా? మళ్ళీ అదే మాట." సుబ్బారావు కోపంగా అన్నాడు.

"అన్నీ గుర్తున్నై. మీరు చేయించాల్సిందే. గాజులు చేయిస్తాననే వరకూ అన్నం తినను. యీ నాల్గు సంవత్సరాల్లో నా జీతం బాంక్‌లో వేస్తే ఎంత లేదన్నా పదివేలయ్యేది. తెలివితక్కువదాన్ని ప్రతిసారీ మిమ్మల్ని అడగటం, లేదనిపించుకోవటం." వసుంధర నెమ్మదిగానే అన్నా, ఆమె ముఖం కోపంతో ఎర్రబడటం గమనించాడు సుబ్బారావు.

"ముందీ బాకీ తీర్చనివ్వు, ఆ తర్వాత నీ జీతం నువ్వే దాచుకుందువుగాని." సుబ్బారావు అనునయంగా అన్నాడు.

"మీరు నాకేమీ సలహాలివ్వక్కర్లేదు. ముందు నాకు గాజులు చేయిస్తారా లేదా? చెప్పండి!"

"చేయించను." సుబ్బారావు తెగేసి చెప్పాడు.

వసుంధర లేచి విసవిసా నడచి బెడ్‌రూమ్ తలుపులు బిగించుకుని పడుకుంది. కొడుకూ కోడలూ కీచులాడుకోవడం విన్న సుందరమ్మ, ఆ మాణిక్యాంబ ఏదో నూరిపోసి ఉంటుంది. అందుకే వసుంధర ఉదయాన్నే భర్తతో పోట్లాడుతోందని ఊహించింది.

వసుంధర మధ్యాహ్నమైనా భోజనానికి లేవలేదు. పన్నెండుంబావయింది. తన ఫ్రెండ్ సునందతో యింగ్లీషు పిక్చర్‌కు మార్నింగ్ షోకి వెళ్ళి వచ్చిన సుజాత, తల్లిద్వారా జరిగింది తెలిసికొని, అన్న దగ్గరకు వచ్చింది.

"పోనీ చేయించరాదూ. వదిన మాత్రం నిన్ను ఏమడిగింది? రెండు జతల గాజులేగా? అయితే రెండు వేలవుతాయి. బంగారం మన యింట్లో ఉండేదేగా? బాంక్‌లో మాత్రం ఎంత వస్తుంది వడ్డీ!" సుజాత అన్నకు నచ్చజెప్పింది.

"అసలే వట్టిమనిషి కూడా కాదు. గర్భిణీ స్త్రీల కోర్కెలను తీర్చాలి. చేయించు బాబూ." సుందరమ్మ కొడుకును బ్రతిమాలింది.

వసుంధర చెప్తే వినేట్టు లేదు. పరిస్థితి చూస్తే సుబ్బారావుకు చేయిస్తాననక తప్పలేదు. "అలాగే చేయిస్తానమ్మా, నీ కోడలిని భోజనానికి రమ్మను," అన్నాడు.

సుందరమ్మ కిటికీ దగ్గరకు వెళ్ళి "అబ్బాయి నీకు గాజులు చేయించడానికి ఒప్పుకున్నాడమ్మా. భోంచేద్దురుగాని, బయటికి రా, వసుంధరా," అని పిల్చింది.

ఆ రోజు కొడుక్కీ, కోడలికీ, కూతురికీ ఒకేసారి వడ్డించింది. ముగ్గురూ తృప్తిగా భోంచేసి కాసేపు పేకాడుకున్నారు.

ఆ మర్నాడే షాపులో ఆర్డరిచ్చి వచ్చాడు. మరో వారానికి, అచ్చు సుజాత గాజుల్లాటివి రెండు జతలు తీసుకువచ్చి భార్యకిచ్చాడు. అప్పటికే వసుంధరకు తొమ్మిదో మాసం ఆరంభమయింది.

## 6

మార్చి యిరవై ఒకటవ తేదీన సుజాతకు కెనరా బాంక్‌లో యింటర్వ్యూ. ఆ రోజు ఉదయం వసుంధరకు పెయిన్స్ మొదలయ్యాయి. వెంటనే మాధవీ నర్సింగ్ హోమ్‌లో ఆమెను చేర్పించాడు సుబ్బారావు.

డాక్టర్ మాధవీలత, వసుంధరను పరీక్ష చేసి, పెయిన్స్ అంత స్ట్రాంగ్‌గా రావటంలేదు. యింకా అయిదారు గంటలలో డెలివరీ అవుతుందని చెప్పి, కొన్ని మెడిసిన్స్ రాసి ఇచ్చి, వసుంధరను అడ్మిట్ చేసుకుంది. సుబ్బారావు డాక్టర్ యిచ్చిన ప్రిస్క్రిప్షన్ తీసికొని, రిక్షాలో బయలుదేరి మెడికల్ షాపు దగ్గర దిగాడు. అప్పటికే తొమ్మిదయింది. పనికుర్రాడు తాళాలు తెచ్చియిస్తే ఫార్మసిస్టు షాపు తెరిచాడు. పనికుర్రాడు, కుర్చీలు, బెంచీలు క్లీన్ చేస్తున్నాడు. కావలసిన మందులు తీసికొని, ఫార్మసిస్టుతో యీ రోజుకు షాపు జాగ్రత్తగా చూచుకోమని చెప్పి అయిదునిమిషాల్లో ఇంటికి వచ్చాడు. సుజాతకు యింటర్వ్యూ పదిన్నరకు. వంటచేసి, టాయిలెట్టయి, సుబ్బారావు సంక్రాంతికి కొన్న చీర కట్టుకుని రెడీగా ఉంది.

సుబ్బారావు రావటం చూసి, గుమ్మంలో అడుగు పెట్టగానే, "ఎలా ఉందన్నయ్యా వదినకు?" అని అడిగింది సుజాత.

"అలాగే ఉంది. అయిదారు గంటలలో డెలివరీ అవుతుందని డాక్టరు చెప్పింది."

"మాధవీ నర్సింగ్ హోమ్ కదూ, యింటర్వ్యూ అయిపోగానే అటునుండి వెళతాను."




"అలాగే వెళ్దువుగానిలే. మేనల్లుడు పుడతాడన్న సంబరంలో, వాళ్ళు వేసే ప్రశ్నలు సరిగ్గా ఆన్సర్ చెయ్యకుండా వచ్చేవు. జాగ్రత్తగా వెళ్ళిరా. విష్ యూ ది బెస్ట్ ఆఫ్ లక్" అని చెల్లెల్ని రిక్షాలో ఎక్కించాడు.

సుజాత అటు వెళ్ళగానే తను స్నానంచేసి దేవుడికి దణ్ణం పెట్టుకొని, కారియర్‌లో అన్నం, కూరలూ, పెరుగూ సర్దుకుని, తనూ కొంచెం తిని, పన్నెండయ్యేసరికి యింటికి తాళంవేసి, రిక్షాఎక్కి మరో పదినిముషాల్లో నర్సింగ్‌హోమ్ చేరుకున్నాడు. సుందరమ్మ కొడుకు రావటంచూసి వరండాలోకి వచ్చింది. అత నందించిన కారియరూ, మరచెంబూ, ఫ్లాస్కూ అన్నీ తమకు ఎలాట్ చేసిన రూమ్‌లో పెట్టివచ్చి, మందులు డాక్టరుకు చూపించింది. డాక్టర్ ఒక్కొక్క మందూ ఎలా వాడాలో చెప్పింది ఆ తర్వాత సుందరమ్మ కొడుకుతో "ఇక్కడే ఉండు, ఏదయినా కావాలంటే తీసుకురావలసి ఉంటుంది" అని చెప్పింది. సుబ్బారావు వరండాలో బెంచీమీద కూర్చున్నాడు.

వసుంధరను డెలివరీ రూమ్‌లోకి తీసుకువెళ్లారు. పెయిన్స్ స్టార్టింగ్‌గా వస్తున్నాయి. ఒక్కొక్కసారి వసుంధర గట్టిగా అరచి ఏడుస్తున్నది. ఆమె బాధకు తనే కారణమన్నట్టుగా బాధపడుతూ, దిగాలుగా కూర్చున్నాడు సుబ్బారావు. యింటర్వ్యూ కాగానే సుజాత హాస్పిటల్‌కు వచ్చింది. వరండాలోనే ఎదురైన అన్ననుచూసి, అతని ముఖకవళికలనుబట్టి యింకా డెలివరీ అయి వుండదని నిర్ధారించుకుంది. సుబ్బారావు తన ముఖంలోని భావాలను కప్పిపుచ్చ

కొని, "ఎలా జరిగింది యింటర్వ్యూ? బాగా చేశావా సుజా?" అని చెల్లెలిని అడిగాడు.

"ఆఁ, బాగానే చేశానన్నయ్యా, ఆ పైన భగవంతుడి దయ." సుజాత సమాధానం యిస్తూనే లోపలికెళ్ళింది. అప్పటికి టైం సాయంత్రం నాలుగయింది. సుజాత హాస్పిటల్‌లోకి ఎంటరవగానే, 'అమ్మా' అని గట్టిగా వసుంధర అరవటమూ, వెనువెంటనే 'కేర్ కేర్' మని పసిపాప ఏడుపూ విన్పించాయి. సుజాత డెలివరీ రూమ్‌లోకి అడుగు పెట్టబోయినదల్లా అక్కడే ఆగిపోయింది.

డాక్టర్ మాధవీలత బయటికివస్తూ సుజాతను చూసి, "నీకు మేనకోడలు పుట్టిందోయ్, కంగ్రాచులేషన్స్" అని నవ్వింది.

సుజాత "థాంక్యూ డాక్టర్, చాలా సంతోషం," అని ఈ శుభవార్త సుబ్బారావుకు చెప్పటానికి వరండాలోనికి వెళ్ళింది.

ఆడపిల్ల పుట్టిందన్న వార్త సుబ్బారావుకు పెద్ద ఆనందాన్నివ్వలేదు. ఏదో ఒక పిల్లలే, తన భార్య ఈ గండంగడిచి బయటపడింది అంతే చాలు అనుకున్నాడు.

ఓ అర్ధగంట తర్వాత సుజాత పిలిస్తే రూమ్ నంబర్ ఫైవ్‌లోకి వెళ్లాడు. వసుంధర బెడ్‌మీద నీరసంగా పడుకుని ఉంది. ఉదయంనుండీ అనుభవించిన బాధంతా మరచిపోయి, దానిస్థానే ఏదో సంతృప్తి, మమకారం చోటుచేసుకున్నాయి. అంత నీరసంగావున్న ఆమె ముఖంలో మాతృత్వం తాలూకు పరిపూర్ణత్వం ద్యోతకమౌతోంది. నేను తల్లినయ్యాననే గర్వం తాలూకు నూతన కాంతితో ఆమె కళ్ళు మెరిసిపోతున్నాయి.

సుబ్బారావు వెళ్ళి వసుంధర పడుకున్న మంచానికి దగ్గిరగా స్టూల్ లాక్కొని కూర్చున్నాడు.

"వసూ, ఎలావుంది ఒంట్లో?" సుబ్బారావు భార్యను సానుభూతి నిండిన గొంతుతో ప్రశ్నించాడు

"కొంచెం నీరసంగా ఉంది, అంతే. మన పాపను చూడండి, కడిగిన ముత్యంలా ఎలా మెరిసిపోతున్నదో అంతా మీ పోలికే" వసుంధర మురిపెంగా చెప్పింది.

ఉయ్యాలలో పడుకుని నిద్రపోతున్న పాపను అప్పుడు చూసాడు సుబ్బారావు. పాప తెల్లగా బొద్దుగా ఉంది. మెడవరకూ తెల్లటి గ్లాస్కో క్లాత్ కప్పబడివుంది. తాజా గులాబీల్లాటి పిడికిళ్ళు మూసుకొని, తనకీ లోకంతో పని

లేదన్నట్టు ప్రశాంతంగా నిద్రపోతోంది, అరగంట క్రితమే భూమిమీదకు వచ్చిన ఆ కొత్త ప్రాణి. మరీ అంత పసిపాపను చూడటం అదే తొలిసారి. సుబ్బారావుకు. ఆ మాంసపు ముద్దలో వసుంధర చెప్పిన పోలికలేవీ కన్పించలేదు. ఒక్క క్షణం, తన భార్యను నరకయాతనకు గురిచేసింది నువ్వే అని ఆ పసి కందుమీద ద్వేషంకూడా కల్గింది. మళ్ళీ వెంటనే ఆ పాప తమ వలపుల పంట అని అనురాగపు మబ్బు క్రమ్మేసింది.

అతని ఆలోచనలను డిస్టర్బ్‌చేస్తూ, "కాఫీ తాగన్నయ్యా," అని సుజాత పిలిచింది. మౌనంగా గ్లాసందుకుని త్రాగుతుంటే, సుజాత ఫ్లాస్కులో మిగిలిన కాఫీ రెండు గ్లాసులలోకి వంచి, ఒకటి వదినకిచ్చి రెండవది తను తాగుతూ, "పాప అంతా నీ పోలికే నన్నయ్యా. ఆ కళ్ళు, ముక్కు, నోరు అంతా నీకు డిటో" అని నవ్వింది. ఆ మాటలకు వసుంధరకూడా నవ్వింది.

"శుక్రవారం పుట్టింది మనయింటి మహలక్ష్మి" అని సుందరమ్మ మురిపెంగా చెప్పింది.

ఓ పది నిముషాలుండి అన్నాచెల్లెళ్ళిద్దరూ యింటికి వెళతామని లేచారు. వసుంధర భర్తతో మా నాన్నగారికి టెలిగ్రామివ్వండి అని చెప్పింది.

టెలిగ్రాం అందిన వెంటనే మాణిక్యాంబ బయలుదేరి వచ్చింది అప్పటికే వసుంధరను, పాపను యింటికి తీసుకువచ్చారు. ఏడవరోజున వసుంధరకు స్నానం చేయించారు. మార్చి ముప్పై ఒకటిన సుజాతకు అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ వచ్చింది. ఏప్రిల్ ఐదవ తేదీలోపల జాయిన్ అవ్వాలి. అది చూచి సుజాత, సుబ్బారావ్ చాలా సంతోషించారు. వసుంధరకూ ఆనందంగానే ఉంది. అంతా పాప పుట్టిన వేళావిశేషం అన్నారు. సుందరమ్మ ఆ మూడుముళ్ళూ వేయిస్తే తన బాధ్యత తీరుతుందనుకుంది మాణిక్యాంబ సుజాతను ఎలాగైనా తన కొడుక్కి చేసుకుంటే తన జీవితం హాయిగా గడిచిపోతుందనుకుంది।

ఆ సాయంత్రం ట్యూషన్ ఓ అరగంట ముందు వదిలేసి సుజాత బజారుకు వెళ్ళి పాపకు రెండు ఫ్రాకులు, దోమతెర, పౌడరుడబ్బా, గిలక్కాయలు కొని తెచ్చింది ఏప్రిల్ నాల్గవ తేదీన సుజాత జాబ్‌లో చేరింది యింకా పదిహేను రోజులకు పరీక్షలు కనుక ట్యూషన్ చెప్పటం మాత్రం మానలేదు। సుబ్బారావు "పరీక్షలు అయిపోగానే మానేసెయ్ జాబ్‌చేస్తూ ట్యూషన్ చెప్పాలంటే కష్టం, కాసేపుకూడా రెస్ట్ ఉండదు, ఆరోగ్యం పాడవుతుందని" చెప్పాడు. సుజాత "అప్పటి సంగతి చూద్దాంలే అన్నయ్యా. యింకా రెండు నెలలు టైముందిగా" అని ఊరుకుంది

పాపకు యిరవై ఒకటవ తేదీన బారసాల చేశారు శ్రీదేవి అని పేరు పెట్టారు ఆ మర్నాడే వసుంధరకు లోగడ చెప్పిన విషయాలు మరొక్కసారి జ్ఞప్తికి తెచ్చి మాణిక్యాంబ వెళ్ళిపోయింది.

వసుంధరకు మెటర్నిటీ లీవ్ అయిపోవచ్చింది. ఏప్రిల్ ఇరవై తొమ్మిది లాస్ట్ వర్కింగ్‌డే వసుంధర డ్యూటీలో చేరింది మర్నాటినుండి సమ్మర్ హాలిడేస్ తనకు వచ్చిన రెండు నెలల జీతం మొత్తం ఏడువందలు బాంక్‌లో డిపాజిట్ చేసివచ్చింది సుబ్బారావడిగితే "యికనుండి నా జీతం మీకివ్వను నాల్గు సంవత్సరాలనుండి మనం సంపాదించి వెనకేసిందేముంది? పాపకు ఎప్పుడే అవసరం వస్తుందో, మీరు, మీ చెల్లెలూ సంపాదించేది సరిపెట్టుకోండి" అని ఖచ్చితంగా చెప్పింది.

సమ్మర్‌లో ట్యూషన్ కూడలేదు సుజాత జీతం తీసుకోవటం సుబ్బారావు కిష్టంలేదు. తను జీతంగా షాపునుండి తీసుకునే నాల్గువందలతో ఇల్లెలా గడుస్తుంది? ఏం చెయ్యటానికి తోచలేదు సుజాత తన మొదటి నెలజీతం నాల్గువందలయాభై తీసుకొని, యాభై తన ఖర్చులకుంచుకొని, మిగిలిన నాల్గువందలు పెట్టి తల్లికి, అన్నావదినలకూ, పాపకూ బట్టలు కొనితెచ్చింది

సుబ్బారావు, ఇంత ఖర్చుపెట్టి యిప్పుడు బట్టలు దేనికి? వచ్చేనెలనుండి నీ జీతం బాంకులో దాచుకోమని చెప్పాడు

తొమ్మిదిన్నరవరకూ తల్లికి వంటపనిలో, యింటిపనిలో సాయంచేసి, తొమ్మిదిన్నర కాగానే, ముఖం కడుక్కొని, పౌడర్ వేసుకొని, బొట్టు పెట్టుకుని, తల దువ్వుకుని, చీర మార్చుకొని పది నిముషాలలో రెడీ అయ్యేది. సుందరమ్మ టిఫిన్‌బాక్స్‌లో అన్నం, కూర పెట్టియిస్తే అందుకుని రిక్షాయెక్కి పదింటికి బాంక్‌కి వెళ్ళిపోయేది మరలా సాయంత్రం అయిదింటికి యింటికి వచ్చేది

ఈ నెలలో పనిమనిషిని మాన్పించేసింది వసుంధర. పాప స్నానం, పాలు కలిపిపట్టడం, నిద్రపుచ్చటం లాటి చిన్న చిన్న పనులు చేస్తూ గదిలోనుండి బయటకు వచ్చేదికాదు. సుందరమ్మతో మాట్లాడటం మానేసింది. సుజాతగాని, సుందరమ్మగాని పలకరిస్తే ముక్తసరిగా సమాధానం యిచ్చి ఊరుకునేది

పాపకు పాలడబ్బాలకు, మందులకు, సోప్, పౌడర్, గ్రైప్‌వాటర్ వగైరాలకు నెలనెలా అదనంగా యాభైరూపాయలు ఖర్చవుతున్నాయి ఖర్చు తగ్గించాలని యింట్లో టిఫిన్ చేయడం మానేశారు ఒంటిగంటవరకూ ఉండలేదు చెల్లికి

ఒక్కదానికే చేసిపెట్టమ్మా అనేవాడు సుబ్బారావు. అయినా సుందరమ్మ చేసేది కాదు.

చాకలిని కూడా మాన్పించేశారు. వసుంధర తన బట్టలూ పాప బట్టలూ తనే ఉతికేది సుజాత తన బట్టలు ఆదివారం తనే వాష్ చేసుకునేది. సుబ్బారావు బట్టలూ, తన బట్టలూ ఉతకటం, సుందరమ్మకు రోజూ అడిషనల్ వర్క్ అయింది. విజయవాడలో అసలే ఎండలు విపరీతం. అందులోనూ మే నెల. పని ఎక్కువై సుందరమ్మ ఆరోగ్యం దెబ్బతిన్నది

ఆ రోజు శనివారం సుజాత బాంక్ నుండి ఓ గంట ముందుగా వచ్చింది సుందరమ్మ మంచంమీద పడుకుని వుంది సుబ్బారావు తడిగుడ్డతో ముఖంమీద తుడుస్తున్నాడు ఈ టైమ్‌లో ఇంట్లో ఎందుకున్నాడో అన్నయ్య అనుకుంటూ సుజాత తల్లి పడుకున్న మంచం దగ్గరకు వెళ్ళింది పరిస్థితిని అవగాహన చేసుకుని, మరుక్షణమే, అన్నపక్కనే కుర్చీలాక్కుని కూర్చుంది

"నువ్వు లే అన్నయ్యా" అని ఐస్ ఉంచిన కాను తనముందుకు జరుపుకుని గుడ్డను ఆ నీళ్ళలో ముంచి తల్లి శరీరమంతా తుడిచింది

ఇంతలో సుబ్బారావు ఐస్‌వాటర్‌లో నిమ్మరసం, సుగర్ కలిపి గ్లాసులతో తీసుకువచ్చాడు తల్లికీ, చెల్లెలికీ చెరో గ్లాసు ఇచ్చి, తనూ త్రాగాడు. సుజాత "వదినకివ్వవే!" అని అడిగితే, "కావాలంటే తనే ప్రిపేర్ చేసుకుంటుందిలే," అని ఊరుకున్నాడు. వసుంధర ఆ పరిస్థితిలో కూడ బయటికి రాలేదు కనీసం అత్తగారిని ఎలా ఉందని కూడా అడగలేదు.

ఆ రాత్రి, మరుసటి రోజు, వంటపని సుజాత వంతయింది. సుబ్బారావు తల్లి సపర్యలన్నీ స్వయంగానే చేశాడు ఆదివారం రాత్రి సుందరమ్మ కాస్త బాగానే ఉందికదాని, సెంటర్‌కు వెళ్ళివస్తానని భార్యతో చెప్పి వెళ్ళాడు. ఎనిమిదిన్నరకు వాళ్ళ బాబాయి, వెంకట్రామయ్యగారు కనిపిస్తే యింటికి తీసుకువచ్చాడు. యిద్దరూ వచ్చేసరికి వసుంధర ఫ్రంట్ రూమ్‌లో పాపను ఒళ్ళోపెట్టుకుని కుర్చీలో కూర్చుంది

వెంకట్రామయ్యను చూసి పలకరించకుండా, పాపను తీసికొని వెళ్ళిపోయింది వసుంధర. ఆయన ముఖం చిన్నబుచ్చుకోవటం సుబ్బారావు గమనించక పోలేదు సరాసరి తల్లిపడుకున్న మంచందగ్గరకు తీసికెళ్ళి కుర్చీ చూపించాడు. అతను కూర్చున్న తరువాత సుందరమ్మ లేచి మంచంమీద కూర్చుని కుశల ప్రశ్నలు వేస్తుంటే, సుబ్బారావు లోపలి కెళ్ళి చెల్లెని తీసుకువచ్చాడు. సుజాత

ఆయనను చూడగానే ఆప్యాయంగా పలకరించింది. కాఫీ కలపటానికి లోపలి కెళ్ళింది సుజాత

"బాబాయ్, చెల్లికి మీకు తెలిసిన సంబంధం ఏదైనా ఉంటే చూడు. ఇక్కడే కెనరా బాంక్‌లో జాబ్ చేస్తున్నది" సుబ్బారావు నెమ్మదిగా చెప్పాడు

"చూద్దాం, అలాగే కట్నం ఎంతివ్వాలనుకుంటున్నారు?" సుందరమ్మవైపు తిరిగి అడిగాడు వెంకట్రామయ్య.

సుందరమ్మ కొడుకువైపు చూసింది.

"కట్నానికేముంది బాబాయ్ నాన్నగారు చెల్లెలికి పదివేలిచ్చారు. సంబంధం మనకు అన్నివిధాలా నచ్చితే మరో అయిదువేలయినా యిద్దాము. ఈ విషయంలో మీరు కాస్త శ్రద్ధ తీసుకోవాలి. నాకు ఎప్పుడూ యీ షాపు చూచుకోవటంతోనే సరిపోతున్నది" సుబ్బారావు రిక్వెస్ట్ చేశాడు

"తప్పకుండా చూస్తాను. నువ్వు నా కింతగా చెప్పాలా? సుజాత, అన్న కూతురైనా, నా కూతురులాంటిదే."

"మీ అన్నగారు పోవటంతో బాధ్యతంతా వీడి నెత్తినపడింది. అనుభవం లేనివాడు కాస్త నువ్వే శ్రద్ధ వహించి, కూతుర్ని ఒక యింటిదాన్ని చెయ్యి బాబూ" సుందరమ్మ గొంతు ఆర్ద్రమయింది

"మన సరోజ మరిది రవిమోహన్, యం.కామ్. చదివాడు. ఏదో బాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు ఎంతలో ఉన్నారో, వివరాలన్నీ కనుక్కొని లెటర్ రాస్తాను వీలయితే నేనే వస్తాను" వెంకట్రామయ్య వెళ్ళటానికి లేవబోయాడు యింతలో సుజాత రెండుకప్పులతో కాఫీ తీసుకువచ్చి యిద్దరికీ యిచ్చింది.

కాఫీ త్రాగి కప్పు క్రిందపెట్టి వెంకట్రామయ్య మళ్ళీ అన్నాడు. "అమ్మాయికి నగలు ఏమైనా వున్నాయా?"

"ఆఁ, గాజులూ, గొలుసూ చేయించాము మొత్తం పది కాసులుంటుంది." సుందరమ్మ చెప్పింది

"అమ్మ బంగారం, సుమారు యిరవై కాసులూ చెల్లికే యిస్తాము బాబాయ్. యింకా అవసరమయితే మరో నాల్గయిదు కాసులు పెడదాము." సుబ్బారావు ఉత్సాహంగా చెప్పాడు

"నే నింక వస్తాను అన్ని విషయాలూ మాట్లాడి, వీలయితే వాళ్ళను డైరెక్టుగా ఇక్కడికే తీసుకువస్తాను వాళ్ళు అమ్మాయిని చూస్తారు ఉభయులకూ

వచ్చితే, ముహూర్తం నిశ్చయించుకోవచ్చు," అని వెంకట్రామయ్య కుర్చీలోంచి లేచి కండువా భుజాన వేసుకుని బయలుదేరాడు

జూన్ పదహారవ తేదీన స్కూళ్ళు తెరిచారు. మళ్ళీ యథాప్రకారం వసుంధర స్కూలుకు వెళ్తున్నది. పాప పనులన్నీ సుందరమ్మమీద పడ్డాయి. మూడునెలలు నిండుతున్నాయి కనుక పాప కొంచెం లావయింది. మనుష్యులను గుర్తుపడుతోంది ఎవరయినా పలకరిస్తే బోసి నవ్వులు చిందిస్తోంది. సుబ్బారావు కూడ ముద్దులు మూటకడుతున్న శ్రీదేవిని యిప్పుడు దించటంలేదు. సుజాత ఎంత తీరికలేకపోయినా రోజూ ఒక గంటయినా పాప దగ్గర, గడుపుతుంది.

ఇదివరకు సుజాత దగ్గర ట్యూషన్ చదివిన పిల్లలంతా మంచి మార్కులతో పాసయ్యారు. "మేడమ్, ట్యూషన్ చెప్పండి, మళ్ళీ మీ దగ్గరే చేరతాము," అని అడిగారు. ఎక్కువమందిని చేర్చుకుంటే చెప్పడం కష్టమని పదిహేను మందిని చేర్చుకుంది ప్రకాశ్ మరో అయిదుగురిని తీసుకువచ్చి తప్పనిసరిగా చేర్పించాడు.

సుందరమ్మ ఒక్కతే అన్ని పనులూ చెయ్యలేదు కనుక మళ్ళీ పనిమనిషిని పెట్టారు సుజాతకు క్షణం తీరటంలేదు. అయినా ఉత్సాహంగా చేసుకుపోతున్నది.

ఆ రోజు బాంక్‌కు వెళ్ళగానే, అక్కడ పనిచేస్తున్న స్టాఫ్ అందరూ నెమ్మదిగా ఏదో విషయం చర్చిస్తున్నారు. సుజాత కామ్‌గా వెళ్ళి తన సీట్లో కూర్చుని టైమ్ చూసుకుంది. ఫైవ్ టు టెన్ అక్కడే యు. డి. సి గా పని చేస్తున్న వసంత సుజాత దగ్గరకు వచ్చి నెమ్మదిగా పిల్చింది.

"సుజాతా!" సుజాత తలెత్తి చూసింది.

"మన ఆఫీసర్‌గారికి ట్రాన్స్‌ఫరయింది. కొత్త ఆఫీసర్‌గారు మద్రాస్ నుండి ఈ రోజే వచ్చి జాయిన్ అవుతారట పేరు రవిమోహన్, యం కామ్. ఆయన వచ్చిన తర్వాత మనంకూడా వెళ్ళి విష్ చేద్దాం" వసంత నెమ్మదిగా చెప్పి తన సీట్లోకి వెళ్ళిపోయింది

'రవిమోహన్ యం కామ్' సుజాత మనసులో మరొక్కసారి ఉచ్చరించింది. ఆ రోజు బాబాయి చెప్పినది, యితని గురించే కాదు గదా! ఆ పేరుగల మనుషులు ఎందరుండరు? ఎవరైతేనేం అనుకుని ఫైళ్ళలో తల దూర్చింది. మనసెందుకో ఆ కొత్త ఆఫీసర్ ఎలా ఉంటాడో ఒకసారి చూడాలి అని ఉవ్విళ్ళూరుతోంది

పదిన్నరయ్యేసరికి కింద కారాగిన శబ్దమయింది. ఆ తర్వాత బూట్లు టకటక లాడించుకుంటూ మెట్లెక్కి ఆఫీసరు, అతని వెనకే ప్యూన్ వెంకన్న పైకి వచ్చారు. ఆఫీసర్ సరాసరి తన రూమ్‌లోకి వెళ్ళి సీలింగ్‌ఫాన్ క్రింద కుషన్ చైర్లో కూర్చున్నాడు ఒక్కొక్కరూ తాము వ్రాసిన ఫైల్స్ తీసుకువెళ్ళి, ఆయనను విష్ చేసి, సైన్ చేయించుకుని వస్తున్నారు.

సుజాత, వసంత కూడ ఫైల్స్ తీసికొని ఆఫీసర్‌గారి రూమ్‌లోకి వెళ్ళారు. యిద్దరూ ఆయనను విష్ చేసి, తమను పరిచయం చేసుకున్నారు. అతను తల వంచుకునే "టేక్ యువర్ సీట్స్, బోత్ ఆఫ్ యూ," అన్నాడు ఇద్దరూ అతని ఎదురుగా ఉన్న కుర్చీలలో కూర్చున్నారు. సుజాత అతనివైపు చూసింది. చామనచాయ రంగు, ఆరడుగుల పొడవాటి విగ్రహం, విశాల ఫాలభాగం, దాని మీద ఫాన్‌గాలికి కదలాడే ముంగురులు. చారెడేసి కళ్ళు, పొడవుగా ఉండి చివర కొసదేలి ఒంపుగాఉన్న నాసిక, ప్రశాంతవదనం, బ్లాక్ అండ్ వైట్ డ్రస్ చేసుకున్నాడు. బ్లాక్ టై వైట్‌షర్ట్‌మీద మెరిసిపోతున్నది అతను చూస్తున్న ఫైల్‌లోనుండి సడన్‌గా తలెత్తి సుజాతవైపు చూసాడు. అతనినే చూస్తున్న సుజాత, చక్రాల్లాటి కళ్ళతో అతని కళ్ళు ఒక్క క్షణం కలుసుకున్నాయి. సుజాత భయంతో కళ్ళు వాల్చేసుకుంది

కొద్దిక్షణాలు సుజాత అందచందాల్ని పరిశీలనగా చూసి, చూపు మరల్చుకున్నాడు రవిమోహన్ యిన్నాళ్ళూ, ఎన్ని సంబంధాలు వచ్చినా ఔననక నిరీక్షించింది ఈ అందాలరాసి కోసమేనా? నా కలల రాణి, కాదు కాదు నా స్వప్నసుందరి, యిన్నాళ్ళూ ఊహలలో ఒయ్యారం ఒలకబోసి తనను కవ్వించి, యీ రోజున హఠాత్తుగా సాక్షాత్కరించింది నా నిరీక్షణ ఫలించింది ఎలాగైనా, వివాహమంటూ చేసుకుంటే ఈ అమ్మాయినే చేసుకోవాలి. ఆ అమ్మాయి అభిప్రాయం తెలుసుకునేవరకూ తను తొందరపడకూడదు అనుకున్నాడు

సుజాత వసంతవైపు చూసింది. వసంత ఎటో చూస్తూ అది గమనించలేదు సుజాత వసంతను నెమ్మదిగా గిల్లింది. వసంత ఉలిక్కిపడి సుజాత వైపు తిరిగింది సుజాత యిక వెళ్దామని కళ్ళతోనే సౌంజ్ఞ చేసింది ఆఫీసర్ యిద్దరి ఫైల్సూ చూసి సైన్ చేసి యివ్వగానే థాంక్స్ చెప్పి బయటపడ్డారు.

## 8

వెంకట్రామయ్య వచ్చి వెళ్ళి నెలపైనే అయింది ఈరోజు జూన్ యిరవై తొమ్మిది ఆ రోజే ఆయన దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది సుబ్బారావుకు,

పెదపారుపూడి
జూన్ 28

చిరంజీవి సుబ్బారావును మీ బాబాయి వెంకట్రామయ్య దీవించి వ్రాయునది. నీ దగ్గరనుండి వచ్చిన తర్వాత, నీతో చెప్పిన సంబంధం తాలూకు పెద్దవాళ్ళను కన్సల్ట్ చేశాను వాళ్ళకు కట్నం పదిహేను వేలవరకూ ఆశ ఉన్నట్టున్నది. వాళ్ళబ్బాయికి యింత తొందరగా పెళ్ళి చేసుకోవటం యిష్టం లేదని, ఎన్ని సంబంధాలు వచ్చినా అంగీకరించటం లేదని చెప్పారు అవన్నీ బెట్టుసరి కబుర్లనుకొన్నాను.

సుజాత చాలా అందంగా వుంటుందని, బుద్ధిమంతురాలనీ, ఒక్కగానొక్క చెల్లెలు కనుక నువ్వు బాగా చూసుకుంటావనీ, సొమ్ము అనుకున్నదానికంటె ఎక్కువే ముడుతుందని, నేను శతవిధాల నచ్చజెప్పిన మీదట, వాళ్ళు పన్నెండు వేలకు దిగారు జూలై అయిదవ తేదీన పిల్లని చూడటానికి వస్తామన్నారు. పెళ్ళికొడుకు కూడా వస్తాడు అన్ని విషయాలూ అప్పుడే మాట్లాడదాము. ఆ రోజు చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేయించు నీవు బాగా ఆలోచించుకుని నీ భార్యతో కూడ యీ విషయాలన్నీ చెప్పు. ఇక ఉంటాను.

మీ బాబాయి
వెంకట్రామయ్య.

సుబ్బారావు మనసు ఆనందపడింది ఆ రాత్రి సుబ్బారావు భార్యతో అన్ని విషయాలూ చెప్పాడు

"పన్నెండు వేలే. అంత కట్నం ఎక్కడినుండి తెస్తారు?" వసుంధరఅడిగింది.

"రెండు సంవత్సరాలలో సర్దుదాము ఇప్పుడే ఇవ్వమని చెప్తాను" సుబ్బారావు సాలోచనగా అన్నాడు.

"పెళ్ళి ఖర్చు, లాంఛనాలు, కనీసం పదివేలవుతాయి"

"అవి లేకుండా పెళ్ళెలా చేస్తాము ఏ సంబంధమైనా యివి తప్పవు. చేసేది కాస్త సరైన సంబంధం చేస్తే చెల్లి సుఖపడుతుంది మనకూ సంతృప్తిగా ఉంటుంది, వసూ."

"ఉంటుంది. ఎందుకుండదూ? పెళ్ళాం బిడ్డలు బిక్షమెత్తుకుంటే, చెల్లెలు మహారాణిలా, సుఖాలనుభవిస్తుంటే మీకు చాలా సంతృప్తిగా వుంటుంది"

"ఆ పనికిమాలిన వెధవకు కట్టబెట్టి, దాని గొంతుకోస్తే, అది దారిద్ర్యాన్ననుభవిస్తూ, ఏడుస్తుంటే, మనకది శుభమా?"

"మీ చెల్లెల్నివ్వకపోతే మానండి. వాణ్ణి పనికిమాలిన వెధవంటారేమిటి? ఎవరు పనికిమాలినవారో ఆత్మపరిశీలన చేసుకుంటే తెలుస్తుంది." వసుంధర కోపంగా భర్తవైపు చూసి అంది

"ఏది ఏమయినా, సుజాత పెళ్ళి జరిపించే బాధ్యత నాది. ఇది కాకపోతే మరో సంబంధం ఉన్నంతలో ఏ లోటూ రాకుండా చూస్తాను." సుబ్బారావు కృతనిశ్చయంతో అన్నాడు.

వసుంధరకు ఏమి చెయ్యటానికీ పాలుపోలేదు. భర్తతో మొండిగా వాదిస్తే లాభంలేదని ఊరుకుంది

మరునాటినుండి సుందరమ్మ ఇల్లు, వాకిలి శుభ్రంచేయించి, కడిగించి ముగ్గులు పెట్టించింది. యిల్లంతా నీట్‌గా సర్దించింది రెండు రకాల స్వీట్లు, ఒక హాట్ యింట్లో తయారుచేసింది. ఆ రోజు రానే వచ్చింది సుబ్బారావు షాపులోని కుర్చీలు అరడజన్ తెప్పించి, యింట్లోవి, అవి, అన్నీ ఫ్రంట్ రూమ్‌లో వేయించాడు. ఆ రోజు సుజాత శెలవు పెట్టింది. ఉదయంనుండీ సుజాత మనసులో రవిమోహన్ గురించిన ఆలోచనలు మెదులుతున్నాయి. ఆఫీసర్ రూపం కనులలో కదలాడుతున్నది పెళ్ళికొడుకు అతనే అయితే బావుండు ననుకుంది కాని అంతలోనే నిరాశ ఆవరించింది. తనకంత అదృష్టమా? అతని కిదివరకే పెళ్ళయిందేమో! కాకపోయినా, తనను ఏంచూసి పెళ్ళాడతాడు? అతనికి బోలెడు కట్నంతో, తనకన్న అందమైనదీ, ఎక్కువ చదువుకున్న స్త్రీ భార్య అవుతుంది అతని గురించి ఆలోచించి మనసు పాడుచేసుకోగూడదను కుంది.

ఉదయం పదిగంటలవేళ మధు వచ్చాడు. ఓ ట్రంకు, ఓ బాగ్, ఓ చేతి సంచీతో వచ్చాడు అతని రాకతో వసుంధరకు సంతోషం కలిగినా, అతని మాసిన జుట్టు, మాసిన బట్టలు, అతని వాలకం చూసి చిరాకు పడింది అతనికి వెంటనే స్నానానికి నీళ్ళు తోడించి, స్నానం చెయ్యమంది స్వయంగా కాఫీ కలిపి యిచ్చింది అతని దగ్గర కూర్చుని కుశలప్రశ్నలు వేసింది. మధు తనను ట్యుటోరియల్ కాలేజీలో చేర్పించి చదివించమని తల్లి చెప్పినట్టు చెప్పాడు.

ఆయన చెల్లెలికోసం వేలకు వేలు ఖర్చుపెడుతున్నారు. తన తమ్ముణ్ణి ఆ మాత్రం చదివించలేరా? ఎలా చదివించరో చూస్తాను, అని మనసులో అనుకుని, "మీ బావగారు వచ్చిన తర్వాత అడిగి చూస్తాను, ఏమంటారో," అని మధుతో చెప్పింది.




సాయంత్రం నాల్గింటికి వెంకట్రామయ్య పెళ్లికుమారుని, అతని తల్లి దండ్రుల్ని తీసుకువచ్చాడు. వాకిలిముందు కారాగగానే సుబ్బారావు బయటికి వచ్చి వారిని గౌరవంగా ఆహ్వానించాడు. వెంకట్రామయ్య పెళ్లివారిని సుబ్బారావుకు పరిచయం చేశాడు రవిమోహన్‌ను చూడగానే సుబ్బారావుకు సహృదయుడిలా కన్పించాడు. అతని పర్సనాలిటీ, కొంచెం ఛాయ తక్కువైనా కళ గల ముఖం, అని చూడగానే తృప్తిపడ్డాడు. వెంకట్రామయ్య, పెళ్లికొడుకు తండ్రి రామభద్రయ్యగారు ఒక ప్రక్క, పెళ్లికొడుకు, సుబ్బారావు ఒకప్రక్క కుర్చీలలో ఆసీనులయ్యారు. పెళ్లికొడుకు తల్లి శకుంతల లోపలి కెళ్ళింది వసుంధర మనసులో ఏమనుకున్నా, పైకి మాత్రం నవ్వుతూనే వుంది. సుజాతకు తనే స్వయంగా తలదువ్వి జడ వేసింది. దోసెడు మల్లెలు మాల కట్టి తురిమింది తనూ స్నానంచేసి క్రొత్తచీర కట్టుకుంది పాపకు సుందరమ్మ స్నానం చేయిస్తే, తను పౌడర్ వేసి, బొట్టూ కాటుక దిద్ది, క్రొత్త గౌను తొడిగింది. శకుంతల గుమ్మంలో కన్పించగానే నవ్వుతూ, "రండి" అని ఆహ్వానించింది

షాపులోని పని కుర్రాడు, మధు ఇద్దరూ గెస్ట్‌లకు, సుబ్బారావుకు, టిఫిన్ మంచినీళ్ళు, కాఫీ, వక్కపొడి, అన్నీ చకచకా సర్వ్ చేశారు. శకుంతల కాఫీ త్రాగివచ్చి కొడుకు ప్రక్కన కూర్చుంది. రవి తల్లిముఖంలోకి చూసాడు. సుబ్బారావుతో వెంకట్రామయ్య, "అమ్మాయిని తీసుకురా," అని చెప్పటంతో సుబ్బారావు లోపలి కెళ్ళాడు.

సుజాత నెమ్మదిగా నడిచివచ్చి అన్నయ్య ప్రక్కనే తలవంచుకుని నిలబడింది.

రవి తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు ఇది కల కాదు కదా అనుకున్నాడు. ఆ రోజు బాంక్‌లో కన్పించిన అమ్మాయి, సుజాత, అనుక్షణం తన మదిలో మెదిలే ఊహాసుందరి, తన ఎదుటనే సాక్షాత్కరించింది ఆమె అభిప్రాయం తెలుసుకొన్న తరువాతే స్టెప్ వెయ్యాలనుకున్నాడు తను. ఏ దైవమో కనికరించి ఈమెను తన కనులముందు నిలిపింది. ఎన్ని సంబంధాలు వచ్చినా కాదన్నాడు. ఎంతమందినో అమ్మాయిలను చూసి నచ్చలేదన్నాడు. యీ అమ్మాయిని చూడటానికూడా రానన్నాడు నాన్నగారూ, వెంకట్రామయ్య గారూ పట్టుబట్టడంతో, విజయవాడలోనే కదా అని తప్పనిసరిగా వచ్చాడు. రాకపోతే, చేతులారా బెస్ట్ ఛాన్స్ పోగొట్టుకుని ఉండేవాడు.

సుజాత డార్క్ బ్లూ కలర్ అమెరికన్ జార్జెట్ చీర కట్టుకుని సేమ్ కలర్ రూబీ వాయిల్ బ్లౌజు వేసుకుంది చెవులకు నీలంరాళ్ళ జూకాలు, మెడలో నీలంరాల్ల లాకెట్ ఉన్న ఒంటిపేట గొలుసు, కుడిచేతికి నాలుగు బంగారు గాజులు, ఎడమచేతికి వాచీ పెట్టుకుంది నుదుట నీలంరంగు తిలకం గుండ్రంగా చిన్న చుక్క పెట్టుకుంది కలువరేకుల్లాటి కళ్ళకు కాటుక దిద్దుకుంది. వదులుగా జడవేసుకుని, జడలో మల్లెపూలదండ. ఎంత అందంగా ఉందీమె, అజంతా చిత్రసుందరిలా ఉంది. చంద్రబింబంలాటి ముఖం, శంఖంలాటి మెడ, పసిమి వన్నెతో మెరిసిపోతున్నది ఎంచి చూపుదామన్నా ఈమెలో ఎక్కడా లోపం కనిపించటంలేదు

కన్నార్పకుండా ఆమెనే చూస్తున్న కొడుకును చూసి రామభద్రయ్య, శకుంతల లోలోన నవ్వుకున్నారు.

"నువ్వు కూడ ఒకసారి అబ్బాయిని చూడమ్మా అలా సిగ్గుపడతావెందుకు, పరస్పరం చూసుకోవటానికే యీ పెళ్లిచూపులు." శకుంతల సుజాతతో చెప్పి చిన్నగా నవ్వి, కొడుకువైపు చూసింది.

సుజాత తల ఎత్తకపోవటం చూసి వెంకట్రామయ్య "సుజాతా, ఒక్కసారి చూడమ్మా," అని చెప్పాడు.

సుజాత సిగ్గుబరువుతో వాలిన కనురెప్పలను అతి ప్రయత్నంమీద కొంచెం పైకెత్తి క్రీగంట చూసింది. రవి తనవంకే చూసి చిన్నగా నవ్వుతున్నాడు. సుజాత గుండె ఒక్కసారిగా ఝల్లుమంది. సందేహంలేదు, ఆయనే. టక్కున

కళ్ళు రెండూ వాల్చేసుకుంది. స్పెషల్‌గా ఏమీ డ్రెస్ చేసుకోలేదు ఆ రోజు తను బాంక్‌లో చూసినప్పుడెలా ఉన్నారో ఇప్పుడూ అంతే. ఆ రోజు ఆయన ఫైల్ చూస్తుంటే, అయిదు కాదు పదినిముషాలు ఆయననే అబ్జర్వ్ చేసింది. కాని ఆయన తలెత్తి చూడగానే, సూటిగా చూడలేకపోయింది. ఆయనంటే తన కెందుకో, భయమో, భక్తో, మరేదో తెలియని భావం ఎంతసేపయినా ఆయననే చూడాలనిపిస్తుంది కాని సూటిగా చూడలేదు అతను ఎదుట లేకున్నా మనో నేత్రంతో చూడగలదు తన మనసేమిటో తనకే అర్థంకావటంలేదు

"అమ్మాయిని ఏమైనా అడుగు రవీ." శకుంతల కొడుకుతో చెప్పింది ఆమె హెచ్చరికతో ఊహాలోకాన్నుండి సుజాత, రవి, వాస్తవంలోకి వచ్చారు.

"ఇంక అడగవలసిందేమీ లేదు. నీ ఇష్టమే నా ఇష్టమమ్మా," అన్నాడు రవి నవ్వుతూ

సుజాత అతనిమీద ఓ కొంటెచూపు విసిరి లోపలి కెళ్ళిపోయింది. ఆ చూపు రవి మనసును మాగ్నెట్‌లా లాక్కుపోయింది

"శుభస్య శీఘ్రమ్ , మిగతా విషయాలు కూడా మాట్లాడుకోండి. త్వరలో ముహూర్తం కూడ పెట్టించుదాము " వెంకట్రామయ్య అన్నాడు

"అమ్మాయి మావాడికి నచ్చింది వాడు పెళ్లికి అంగీకరించాడు. మిగతా విషయాల్లో మాకు పెద్ద పట్టింపులేదు మీ రిస్తానన్న పదివేలూ ఇవ్వండి చాలు." రామభద్రయ్య సుబ్బారావు భుజంతట్టి అన్నాడు

"కట్నం అంతా ఒక్కసారి యివ్వలేను మామయ్యగారూ, రెండు సంవత్స రాల్లో సర్దుబాటు చేస్తాను " సుబ్బారావు రిక్వెస్ట్ చేశాడు

"మీ చెల్లెలికి యిచ్చుకునేది మీ యిష్టం అంతా ఒక్కసారే యిస్తారో, అప్పుడప్పుడు ఇస్తారో, మీ వీలునుబట్టి యివ్వండి మీ అమ్మాయి పేర బాంక్‌లో వేయండి." శకుంతల భర్త ఎక్కడ కాదంటాడోనని కంగారుగా అంది.

"వచ్చేది ఆషాఢం ఇప్పుడు వారం కూడా టైమ్‌లేదు. శ్రావణమాసంలో లగ్నం పెట్టుకుందాం. ప్రస్తుతానికి పసుపు, కుంకుమ, ఇచ్చి, పిల్ల మాది అనిపించుకుని వెళతాం " రామభద్రయ్య సుబ్బారావుతో అన్నాడు

"మీ యిష్టప్రకారమే చేద్దాం నా అబ్జెక్షన్ ఏమీ లేదు," అన్నాడు సుబ్బారావు.

యింతలో మధు వచ్చి సుబ్బారావును లోపలికి రమ్మని పిలిచాడు.

సుబ్బారావు లోపలికి వెళ్ళి వచ్చి "అత్తయ్యగారూ, మీరు చీర, పసుపు కుంకుమ యిచ్చినా, ఇవ్వకపోయినా సుజాత మీ కోడలే. ఇప్పుడు అవేమీ వద్దులెండి. మీరు అన్యథా భావించకండి," అన్నాడు

వెంకట్రామయ్య తమలపాకులలో పళ్ళు పెట్టి సుబ్బారావుతో రామభద్రయ్యకు రామభద్రయ్యతో సుబ్బారావుకు ఇ ప్పి ం చా డు. "శ్రావణమాసంలో పెళ్లి ఎప్పుడు రమ్మంటారో ముందుగా లెటర్ రాయండి. వస్తాము. వచ్చి ముహూర్తం నిశ్చయిద్దాము," అని చెప్పి అందరిదగ్గర శెలవు తీసికొని వెళ్ళిపోయారు. శకుంతల కోడలితో "వెళ్ళొస్తానమ్మా" అని చెప్పి, వసుంధరకూ, సుందరమ్మకూ చెప్పి కారెక్కింది వెంట్రామయ్య కూడా వాళ్ళతోపాటే వెళ్ళిపోయాడు.

## 9

వసుంధర, మధును రవి టుటోరియల్ కాలేజీలో చేర్పించింది. ట్యూషన్ ఫీజు, నోట్ బుక్స్ వగైరాలకు మూడువందలు ఖర్చయింది. తనే తెలుసుకుంటుందిలే ఎందుకు తను బయటపడటం అని సుబ్బారావు కామ్‌గా ఊరుకున్నాడు.

మధు, ఉదయం ఎనిమిదింటికి కాలేజీకి వెళ్ళి పన్నెండింటికి వచ్చేస్తాడు. మధ్యాహ్నమంతా ఖాళీగానే ఉంటాడు. ఇంట్లో ఏమీ తోచదని సాయంత్రం వరకూ తిరిగివస్తాడు. మధ్య మధ్య అక్కదగ్గర రెండూ, మూడూ అడిగి తీసుకొంటాడు. టౌన్‌కు రావటం క్రొత్తేమో తిరగటం సరదా ఎక్కువయింది. రాత్రి ఎనిమిదినుండి పదయ్యేవరకూ బుక్స్ ముందేసుకుని కూర్చుంటాడు. నోట్ బుక్‌లో డిటెక్టివ్ నావెల్స్, సెక్స్ బుక్స్, పెట్టి ఎవరూ చూడకుండా చదువుతుంటాడు

వసుంధర తమ్ముడి విషయంలో స్పెషల్ కేర్ తీసుకునేది అతనికి ఉదయం, సాయంత్రం కాఫీ కలిపి యివ్వటం, రాత్రి భోజనం వడ్డించటం, అన్నీ స్వయంగా చేసేది మధ్యాహ్నం, తనే పెట్టుకు తినేవాడు.

సుజాతకు ఇటు ట్యూషన్ చెప్పడం, అటు బాంక్‌లో పనిచేయటంవలన అసలు తీరుబడి వుండేదికాదు. ఇంట్లో కనిపించినప్పుడయినా మధుతో మాట్లాడేది కాదు

ఎప్పుడూ రవిని గురించే ఆలోచిస్తుండేది. బాంక్‌లో ఉన్నంతసేపూ సుజాత కళ్ళు అతనికోసమే వెదకేవి రవి, ఆమెను చూడగానే పలకరింపుగా స్మైల్ చేసి వెళ్ళేవాడు. ఆమె హృదయం ఉరకలు వేసేది.

ఈమధ్య సుజాత అలంకరణ విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుంటున్నది. మనసెప్పుడూ రవి దర్శనంకోసం తహ తహలాడుతుండేది. అతన్ని చూడగానే ఏదో పెన్నిధి దొరికినట్టు తృప్తిపడేది. అతను కన్పించని రోజామెకు చాలా దుర్దినమనిపించేది.

వారంరోజుల తర్వాత ఒకరోజు పదిన్నరకు సుజాత తన సీట్లో కూర్చుని, క్రితంరోజురాసిన ఫైల్ రిఫర్ చేస్తున్నది. ప్యూన్ వచ్చి ఆఫీసర్ గారు రమ్మంటున్నారని చెప్పాడు. సుజాత వెళ్ళాలా, వద్దా అని కొన్ని క్షణాలు తటపటాయించి, చూస్తున్న ఫైల్ పూర్తికాగానే, చేత్తోపట్టుకుని లేచింది. వెళ్తూ వసంతవైపు ఒక సారి చూసింది ఆమె చిన్నగా నవ్వి వెళ్ళిరమ్మనట్టు చేత్తోనే సైగచేసింది.

"గుడ్ మార్నింగ్ సర్." సుజాత, ఆఫీసర్ రూమ్‌లోకి ఎంటరవుతూనే విష్ చేసింది.

"వెరీ గుడ్ మార్నింగ్. టేక్ యువర్ సీట్." తన ఎదురుగా ఉన్న కుర్చీ చూపించాడు.

సుజాత చేతిలోని ఫైల్ అతని టేబిల్‌మీద ఉంచి కుర్చీలో కూర్చుంది. అతను ఏదో చెప్తాడని, వినాలని, తలవంచుకుని కూర్చుంది అయిదు పది నిముషాలు గడిచినా, అతను ఒక్కమాటకూడ మాట్లాడలేదు.

బోర్నవిటా కలర్ జపాన్ జార్జెట్ చీరమీద అక్కడక్కడా వైట్ డిజైన్ పెయింట్ చేసింది కట్టుకుంది. మాచింగ్ బ్లౌజ్ రూబీవాయిల్‌ది వేసుకుంది. ఆ డ్రస్‌లో సుజాత సుందర శిల్పంలా మెరిసిపోతున్నది. కళ్ళకు కాటుక, నుదుట బ్రౌన్ కలర్ కుంకుమ గుండ్రంగా దిద్దుకుంది. ఫాన్‌గాలికి నీలాల ముంగురులు ఎగిరి ముఖంమీద పడుతున్నాయి. వదులుగా జడవేసుకుని ఒక ప్రక్కగా తెల్లగులాబీని లీఫ్‌తోసహా అమర్చుకుంది. మెడలోని ఒంటిపేట గొలుసు, దాని తాలూకు తెల్లరాళ్ళ లాకెట్ పైటమీద మెరుస్తున్నది చెవులకున్న బ్రౌన్‌కలర్ జూకాలు, ఆమె ముఖానికి వింత అందాన్నిస్తున్నాయి. ఎడమచేతికి బ్రౌన్‌కలర్ స్ట్రాప్‌తోఉన్న రిస్ట్ వాచీ, కుడిచేతికి బంగారుగాజులు ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు ఆమె పైట, ఛెస్ట్‌మీద అప్ అండ్ డౌన్‌గా మూవ్ అవుతోంది. రవి ఆమె మీదనుండి దృష్టి మరల్చలేకపోయాడు

అతను మౌనంగా తననే పరిశీలిస్తున్నాడని క్రీగంట గమనించడం వలన సుజాత పచ్చని నున్నని చెక్కిళ్ళు సిగ్గుతో ఎరుపెక్కాయి.

"సుజా!" రవి నెమ్మదిగా పిల్చాడు.

"ఊ."

"నీతో కొంచెం మాట్లాడాలని పిలిపించాను."

"చెప్పండి. ఏ విషయం మాట్లాడాలనుకున్నారు?"

"నేనంటే నీకిష్టమేనా?"

"యిష్టంలేకుండానే పెళ్ళికి ఒప్పుకుంటానని ఎలా అనుకున్నారు?

"ఆ రోజు నిన్ను చూసేవరకూ, పెళ్ళికూతురివి నువ్వేనని నాకు తెలియదు."

"మిమ్మల్ని చూసేవరకూ నాకూ తెలియదు"

"ఐ.సీ. మనల్ని విధి భలే గమ్మత్తుగా కలిపింది."

"అది సరే. నేనంటే మీకిష్టమేనా?"

"నువ్వంటే నాకు చాలా యిష్టం. జీవితంలో పెళ్ళంటూ చేసుకుంటే నిన్నే చేసుకోవాలని నిన్ను ఫస్ట్‌టైమ్ చూసినప్పుడే అనుకున్నాను. కాని నా కోరిక యింతత్వరలో నెరవేరుతుందనుకోలేదు."

"నేనూ అలాగే అనుకున్నాను. అంతా భగవంతుని లీల."

"నువ్వు ఎదురుగా ఉంటే యీ లోకాన్నే మరచిపోతాను. నీ చూపులు, విరితూపులై నా మనసులో సూటిగా చొచ్చుకుపోతున్నాయి. నీ అందంతో నన్ను వెర్రివాణ్ణి చేస్తున్నావు. సుజా, నన్ను నీవాణ్ణి చేసుకుని, నా జీవిత నావకు చుక్కానివై, నా ప్రేమదేవతవై నన్ను తరింపజెయ్యి." రవి ఆవేశంగా అన్నాడు. సుజాత, అంతసేపూ ఏమీ అనలేక అతనివైపు చూస్తూ మౌనంగా కూర్చుంది.

"చూడండి, ఇది ఆఫీసు. మీరు బాధ్యతగల ఆఫీసరు. నేనొక సామాన్య గుమాస్తాని. మీరిలా మాట్లాడటం భావ్యంకాదు." సుజాత మృదువుగా మందలించింది.

"యస్, డ్యూటీ యీజ్ డ్యూటీ ఫరాల్. ఐ నో. బట్, యింకా నెలరోజులు యీ వియోగాన్ని భరించటం నా తరమా? పోనీ సాయంత్రం ఒకసారి అలా కృష్ణానదివైపు వెళ్దాం వస్తావా?"

"ఉహూఁ. పెళ్ళికాకుండా మీతో తిరిగానంటే మా అన్నయ్య, అమ్మ చంపేస్తారు. రేపటినుండి బ్యాంక్‌కు కూడా రానివ్వరు."

"మనం కాబోయే భార్యాభర్తలం. కలిసి తిరిగితే వచ్చే నష్టమేమిటి?"

"ఆ మూడు ముళ్ళూ పడితేనే దేనికైనా లైసెన్స్ యిష్యూ అవుతుంది."

"ప్లీజ్ టేక్ వన్ లౌల్లీ కిస్," అంటూనే ఒక్కసారి లేచివచ్చి సుజాత బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు.



ఊహించని, అతని హఠాశ్చర్యకు సుజాత కంగారుపడింది.

"ఒక్క నెల రోజులు ఓపికపట్టండి. శాశ్వతంగా మీదాన్నవుతాను మిమ్మల్ని అడ్డుపెట్టేవారుండరు మీరిలా తొందరపడటం ఏమీ బావుండలేదు నేనింతసేపు యిక్కడ ఉన్నందుకే ఆఫీస్ స్టాఫ్ అంతా ఏవేవో ఊహిస్తూ ఉంటారు. పెళ్ళయ్యేవరకూ మనం హద్దుదాటకుండా ఉండటం ఎంతైనా అవసరం. నేనిలా అన్నందుకు అన్యథా భావించకండి. వస్తా," అని సుజాత బయటకు వచ్చేసింది.

సాయంత్రం సుజాత యింటికి వచ్చేసరికి మాణిక్యాంబ కుర్చీలో కూర్చుని ఉంది చూసి పలకరించకపోతే బావుండదని, "ఎప్పుడొచ్చారు? మామయ్య గారికి ఒంట్లో బావుందా" అని పలకరించింది.

"ఆఁ అదే బాగులేమ్మా మధు ఎలా చదువుతున్నాడో ఒకసారి చూసిపోదామని వచ్చాను" మాణిక్యాంబ చెప్పింది.

సుజాత లోపలికెళ్ళిన తర్వాత వసుంధర రిక్షాదిగింది. యింట్లో అడుగు పెడుతూనే, "ఎంతసేపయింది పిన్నీ, వచ్చి? మధు యింట్లో లేడా? నేను రాసిన లెటరందిందా?" మాణిక్యాంబను అడిగింది.

"నేను వచ్చి గంటయిందమ్మా. మధు యింకా రాలేదు. నువ్వు రాసిన ఉత్తరం నిన్న అందింది. అందుకే యీ రోజు బయల్దేరి వచ్చాను"

యింతలో పాపకు స్నానం చేయించి టవల్‌తో తుడుస్తూ, చంకనెత్తుకుని సుందరమ్మ లోపలికి వచ్చింది. సుజాత స్నానానికి వెళ్ళింది. సుందరమ్మ మనుమరాలికి పౌడర్ వేసి, బొట్టూ, కాటుకా పెట్టి, గౌనువేసి, తల దువ్వటం వగైరా చెయ్యసాగింది. వసుంధర స్టౌమీద కాగుతున్న పాలు కాఫీ కలిపింది. మాణిక్యాంబను పిలిచి పీటవేసి కూర్చోమని, ఆమెకు కాఫీ యిచ్చి, తను త్రాగింది.

సుజాత స్నానంచేసి, ఉతికిన చీర కట్టుకుని, తలదువ్వి జడవేసుకుంది. ముఖానికి పౌడర్ అద్ది, తిలకం దిద్దుకుంది కాఫీ కలిపి, తల్లికిచ్చి, తను త్రాగి, ఓ అర్ధగంట రెస్ట్ తీసుకొనేసరికి ట్యూషన్‌కు పిల్లలు రానేవచ్చారు

* * *

వసుంధర శ్రీదేవికి పాలు పడుతూ పాపప్రక్కనే కూర్చుంది. మాణిక్యాంబ కూతురికెదురుగా కుర్చీ లాక్కుని కూర్చుంది.

"అమ్మాయ్, మీ ఆడపడుచును ఏ వూరిస్తున్నారు?" మాణిక్యాంబ అడిగింది.

"ఉయ్యూరు."

"కట్నం ఎంత?"

"పదివేలు."

"పదివేలే! పెళ్ళిఖర్చుకు లాంఛనాలకు మరో పదివేలు. యీ దెబ్బతో మీ ఆయన షాపు అమ్మెయ్యాల్సొస్తుందేమో?"

"అదే పిన్నీ, నా బాధ. వద్దని ఎంత చెప్పినా ఆయన వినడంలేదు."

"ఏదో గంతకు తగ్గ బొంత చూసుకోవాలిగాని, ఎత్తలేని బరువు ఎత్తడం, బాధపడటం ఎందుకు?"

ఆయనకు ఎంత తోస్తే అంత. నేను ఏంచెప్పినా వినరు." వసుంధర తన మనసులోని బాధను బయటపెట్టింది.

"వినడంటే ఎలా? మంచిమాటలతో చెప్పిచూడు. వినకపోతే, ఏడ్చి, పోట్లాడి సాధించు. అంతకూ లొంగకపోతే, ఛస్తానని బెదిరించు."

"ఏమో పిన్నీ, నాకు భయంగా ఉంది. ఆయన వేటికీ లొంగేరకంకాదు." వసుంధర తన సందేహాన్ని వెలిబుచ్చింది.

"ఐతే మరో ఉపాయమాలోచిద్దాం. ఆ సంబంధం కాస్తా చెడగొడితేసరి, ఏం చేస్తాడో చూద్దాం." మాణిక్యాంబ ప్లాన్ వేసింది.

"అలా చేస్తే బాగానేఉంటుంది. కాని మరో సంబంధం చూస్తారు. ఆయన పట్టు విడువరు ఆయనకు చెల్లెలంటే ఎంత ప్రేమో నీకు తెలియదు".

"ఎంత పిచ్చిదానివి? యిప్పటి కీ గండం గడిస్తే చాలు తర్వాత సంగతి ఆలోచిద్దాం" మాణిక్యాంబ ధైర్యంచెప్పింది.

"యీ గండం మాత్రం గడిచేదెలా? తాంబూలాలు పుచ్చుకున్న తర్వాత ఎలా వద్దనడం?"

"పీటలమీద పెళ్ళిళ్ళు తప్పిపోతున్న యీ రోజుల్లో తాంబూలాలు ఒక లెక్కా? అంతేకాదు ఒకదెబ్బకు రెండు పిట్టలు, అటు సుజాతపెళ్ళి తప్పి పోతుంది, యిటు మరో సంబంధం రావాలంటే కష్టం చచ్చినట్టు నీ తమ్ముడికి కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తాడు మీ ఆయన"

మాణిక్యాంబ మాటలు వసుంధరకు అమృతప్రాయంగా తోచాయి.

"నీ యిష్టప్రకారమే చేద్దాం పిన్నీ. యీ పెళ్ళితప్పిపోయేమార్గమేదో నువ్వే చూడు నీ సహాయం జన్మలో మరచిపోను." వసుంధర ఆర్తిగా అంది.

వసుంధర, పాప నిద్రపోవటంతో, పాప ప్రక్కన దిండుపెట్టి స్నానానికి వెళ్ళింది మాణిక్యాంబ ఆలోచిస్తూ కూర్చుంది

ఆరున్నరకు మాట్నీచూసి, పుస్తకాలు చేత్తోపట్టుకుని మధు వచ్చాడు. తల్లిని చూసి ఆశ్చర్యంగా "ఎప్పుడొచ్చావమ్మా?" అని పల్కరించాడు

"యిప్పటివరకూ క్లాసులేనా? మరీ ఎక్కువ చదివితే ఆరోగ్యం పాడవుతుంది బాబూ." మాణిక్యాంబ కొడుకుతల ప్రేమగా నిమురుతూ అంది.

"ఫ్రెండ్ దగ్గర చదువుకోడానికి వెళ్ళానమ్మా." మధు అబద్ధమాడాడు.

రెండురోజులుండి మాణిక్యాంబ వెళ్తానని బయల్దేరింది. సుజాత పెళ్ళికి, లగ్నం పెట్టుకున్నతర్వాత లెటర్ రాయిస్తాను పెళ్ళికి కనీసం పదిరోజులముందు రమ్మని చెప్పింది సుందరమ్మ. మధు బస్‌స్టాండ్ వరకూ వెళ్ళివచ్చాడు. ఆమె బస్ కదిలేలోగా, సుజాతతో మంచిగా ఉండమని, ఆ పిల్ల మధుకు కాబోయేభార్య అనీ, బావగారు, అక్క, చెప్పినట్టు వినమనీ, పెళ్ళయ్యేవరకైనా బుద్ధిగా చదువుకోమని కొడుక్కి హితవుపదేశించింది.

మధు తల్లిచెప్పిన మాటలు ఒకచెవితో విని, మరో చెవినుండి గాలిలోకి వదిలి, ఆమె ఎక్కినబస్ కదలగానే, యధాప్రకారం, రాత్రి ఎనిమిదయ్యేవరకూ బయట తిరిగి యింటికి వచ్చాడు.

# 10

మాణిక్యాంబ ఉయ్యూరు బస్‌స్టాప్‌లో దిగి, వసుంధర యిచ్చిన అడ్రస్ కాగితం, పర్స్‌లోనుండి తీసి ఒకసారి చూసుకుంది. లక్ష్మిటాకీస్ ఎదురుగా డాబా యిల్లు, గుర్తుపెట్టుకుని రిక్షాదిగి గేట్‌లోకి వచ్చింది.

వరండాలో యీజీఛైర్‌లో కూర్చునిఉన్న నలభైఅయిదు సంవత్సరాల వయసుగల భారీ విగ్రహాన్ని చూడగానే ఆయనే రామభద్రయ్య అయివుంటాడని ఊహించింది.

"రామభద్రయ్యగారి యిల్లు యిదేనాండీ?" మాణిక్యాంబ ప్రశ్నించింది.

"ఔను యిదే. ఎవరు కావాలండీ మీకు?" రామభద్రయ్య అడిగాడు.

"నేను విజయవాడనుండి వచ్చాను. సుబ్బారావు మా అల్లుడు. మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలని వచ్చాను."

ఆమె చెప్పడం పూర్తికాకుండానే రామభద్రయ్య "శకుంతలా" అని భార్యను పిలిచాడు. "వస్తున్నానండీ," అంటూ శకుంతల కాఫీగిన్నెమీద మూతపెట్టి, పైటచెంగుకు చెయ్యి తుడుచుకుంటూ వచ్చింది.

"యీవిడ సుబ్బారావు అత్తగారు, మా ఆవిడ శకుంతల" అని పరస్పరం పరిచయం చేశాడు రామభద్రయ్య.

శకుంతల ఆమెకు నమస్కారమండీ అనగానే మాణిక్యాంబ ప్రతి నమస్కారం చేసింది.

"ఇక్కడే కూర్చున్నారేం? లోపలికెళ్దాంరండి, కాళ్ళు కడుక్కుందురుగాని." శకుంతల మాణిక్యాంబను ఆహ్వానించింది.

"వద్దండీ. యిక్కడే కూర్చుంటాను. మీతో ఒక ముఖ్యవిషయం చెప్పి వెళ్ళిపోతాను." మాణిక్యాంబ మొహమాటంగా అంది.

యింతలో పనికుర్రాడు కాఫీ తీసుకువచ్చి ముగ్గురికీ యిచ్చివెళ్ళాడు.

మాణిక్యాంబ కాఫీత్రాగి కప్పు క్రిందపెట్టి నెమ్మదిగా తను చెప్పదల్చుకున్న విషయం మొదలుపెట్టింది.

"మీతో యీ విషయం ఎలా చెప్పాలో నోరు రావటంలేదు. అయినా చెప్పక తప్పటంలేదు." మాణిక్యాంబ బాధపడుతూ అన్నది.

"ఏ విషయం? ఎలాటి కబురైనా సందేహించక త్వరగా చెప్పండి." శకుంతల ఆత్రుతగా అడిగింది.

"మీ అబ్బాయి రవిమోహన్ పెళ్ళి విషయం. సుజాతకు యీ పెళ్ళి యిష్టం లేదు. సుబ్బారావు యీ విషయం చెప్పమని నన్ను పంపించాడు."

"ఎందుకు యిష్టంలేదు? మావాడి కేంలోపమని?" శకుంతల ముఖం కోపంతో ఎర్రబడింది.

"సుజాత, మా అబ్బాయి మధును ప్రేమించింది. మీ అబ్బాయిని చేసుకోనని ఒకటే ఏడుపు. మా అమ్మాయి, అల్లుడు, వియ్యపురాలు ఎంత చెప్పినా వినటంలేదు. చేసుకుంటే మధును పెళ్ళాడతాను. లేకపోతే చచ్చిపోతా నంటున్నది."

"అంత యిష్టంలేకుండా ఎందుకు చేస్తాము? మావాడు 'ఊ' అంటే చాలు, రేపీ పాటికి, దీని తలదన్నే సంబంధం తెచ్చి చేస్తాను. వాళ్ళమ్మాయి మాకవసరం లేదని మీ అల్లుడితో చెప్పండి." రామభద్రయ్య కోపంగా అన్నాడు.

"మా అమ్మాయి, అల్లుడు ఆ పిల్ల బాధ చూడలేక, మీతో యీ విషయం చెప్పలేక బాధపడుతున్నారు. చివరకు ఆలోచించి నన్ను చెప్పిరమ్మని పంపించారు. మిమ్మల్ని అన్యథా భావించవద్దని చెప్పమన్నారు." మాణిక్యాంబ లోలోన సంతోషపడుతూ పైకి బాధపడుతున్నట్టుగా నటిస్తూ చెప్పింది.

"వివాహాలు దైవనిర్ణయాలు, వాళ్ళిద్దరికీ రాసిపెట్టి లేదేమో! ఎవరుమాత్రం ఏంచేస్తారు? పెళ్ళి నూరేళ్ళపంట. మనసొకచోట, మనువొకచోట అయితే జీవితాంత బాధపడాలి. ఆ పిల్ల యిష్టప్రకారంచే సుకోమనండి." శకుంతల కోపాన్నణచుకుని చెప్పింది.

"వెంకట్రామయ్య చెప్తే, తెలిసిన సంబంధం కదా అని ఒప్పుకున్నాము. మావాడి కేంలోటు? కో అంటే కోటిమంది, పెద్దకట్నాలతో పిల్లనిస్తామంటూ రెడీ అవుతారు. నేనిప్పుడే వెళ్ళి అబ్బాయి కీ విషయం చెప్తాను. మరో సంబంధం నిశ్చయించి యీ శ్రావణమాసంలోనే పెళ్ళి జరిపిస్తాను." రామభద్రయ్య పట్టుదలగా అన్నాడు.

"చెల్లెలిని అదుపులో పెట్టలేని అసమర్థుడైఉండి, పిల్లనిస్తానని మరెవ్వరినీ మోసం చెయ్యవద్దని మీ అల్లుడితో చెప్పండి." శకుంతల బుసలు కొట్టింది.

మాణిక్యాంబ తను వచ్చిన పని అయిపోయిందని సంతోషిస్తూ వెళ్ళిపోయింది. రామభద్రయ్య, మాణిక్యాంబ చెప్పిన విషయాలు అన్నీ వివరంగా కొడుక్కి లెటర్ రాశాడు.

ఆ రోజు జరిగిన సంఘటన తర్వాత సుజాతను, రవి తన రూమ్‌కు మళ్ళీ పిలిపించలేదు. కన్పించినప్పుడైనా చిరునవ్వుతో పలకరించుకునే వారు. రవి చాలా రిజర్వుడుగా ఉంటున్నాడు. సుజాత ఫైల్స్ తీసుకువచ్చి

నపుడు కూడ, ఎక్కువగా మాట్లాడటంలేదు. సుజాత తనలో తనే నవ్వుకునేది. అతని ఆత్మనిగ్రహానికి లోలోన మురిసిపోయేది

రవి, తండ్రిదగ్గరనుండి ఎప్పుడు లెటర్ వస్తుందా? ఎప్పుడు ముహూర్తం నిశ్చయిస్తారా? అని ఎదురుచూడసాగాడు. శ్రావణమాసం రానే వచ్చింది. ఆ రోజు శుక్రవారం తలనొప్పిగా ఉంటే మధ్యాహ్నం రూమ్‌కి వచ్చేశాడు. డ్రెస్సయినా మార్చుకోనకుండా బెడ్‌మీద వాలిపోయాడు. సర్వెంట్, రెండు ఆస్ప్రో టాబ్లెట్స్, కాఫీ యిచ్చి వెళ్ళాడు యీవెనింగ్ పోస్ట్‌లో లెటర్ వచ్చింది ఆత్రంగా అందుకుని ఫ్రమ్ అడ్రస్ చూశాడు అది తండ్రి వ్రాసిన లెటర్ వెంటనే ఓపెన్‌చేసి చదివాడు ఆయన వ్రాసిన విషయాలు ఒక్కొక్కటి చదువుతుంటే తల తిరిగినట్టయింది. అతను షాక్ తిన్నట్టు కొంచెంసేపు అచేతనంగా పడుకున్నాడు. అతని మనసంతా గందరగోళంగా ఉంది ఇలా జరుగుతుందని తను కలలో కూడ ఊహించలేదు.

సుజాతకు తనంటే యిష్టంలేదా? ఇష్టంలేకపోతే ముఖం మీద చెప్పేయ్యొచ్చుగా? తను బాస్, ఆమె తన సబార్డినేట్, చెప్పటానికి సందేహించిందేమో? అలా అనుకోవటానికి వీల్లేదు. తనంటే యిష్టంలేకపోతే, తనతో అలా ఎందుకు చెప్తుంది? సుజాత తననుకున్నంత పిరికిది కాదు. తనను మోసం చేసింది ఆమె అందం చూసి తను మోసపోయాడు. గాజు ముక్కను చూసి రత్న మనుకున్నాడు ఆమె కసలు మనసనేది లేదు. ఉంటే యిలా, తన మనసుతో ఆటలాడుకుని ఉండేదికాదు. ఎవరినో ప్రేమించి, తనను నమ్మించి ద్రోహం చెయ్యటం ఎందుకు? యీ బుద్ధి ఆమెకే స్వయంగా పుట్టిందో? లేక తనను గురించి ఎవరైనా చెడుగా చెప్పారేమో? "క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్" అన్నట్టు, తన మనసు మార్చుకుని ఉంటుంది.

ఆ రాక్షసి అంతు చూడాలి తనను కాదన్నప్పుడు సుజాత యింకెవరికీ దక్కకూడదు. ఆ మధుగాణ్ణి షూట్ చేసిపారెయ్యాలి సుజాతను మర్డర్ చెయ్యాలి సుజాత తనది కానప్పుడు, తన కీ బ్రతుకు అవసరంలేదు. వాళ్ళిద్దర్నీ చంపి, తనూ సూయిసైడ్ చేసుకోవాలి ఆలోచనతో బుర్ర వేడెక్కింది తలనొప్పి ఎక్కువయింది. ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. మర్నాటికి జ్వరం వచ్చింది లీవ్ పెట్టాడు. ఖాళీగా కూర్చుంటే, అతన్ని ఆలోచనలు పిచ్చివాణ్ణి చేస్తున్నాయి. "సుజా, నేను నీకేం అపకారం చేశాను నీ రూపాన్ని నా మనసులో ప్రతిష్ఠించుకుని దేవతగా ఆరాధిస్తున్నానే, నీకోసం అనుక్షణం

తపిస్తున్నానే, యింత నిర్దాక్షిణ్యంగా నన్ను దూరంచేసుకోవటానికి మనసెలా ఒప్పింది?" అని తనలో తనే గొణుక్కున్నాడు జుట్టు పీక్కున్నాడు కనిపించిన ప్రతి వస్తువులోనూ సుజాత రూపం కన్పిస్తుంటే, నేలమీద విసిరి కొట్టాడు ఏమైనా సరే సుజాతను నిలదీసి అడగాలి. తనమీద ఎందుకింత నిరసన చూపుతోందో అడిగి తెలుసుకోవాలి. అంతవరకూ తనకు మనశ్శాంతి లేదు అనుకున్నాడు

సోమవారం, పదింటికే బాంక్‌కు వెళ్ళాడు. సుజాత అతనిని చూసి చిరునవ్వు నవ్వింది అతను సీరియస్‌గా ముఖం తిప్పుకున్నాడు. పళ్ళు పటపట కొరికాడు. షేవింగ్ చేసుకోలేదు. కళ్ళు లోతుకుపోయి ముఖమంతా నీరసంగా ఉంది. యీ రెండు రోజుల్లోకే ఎంతో చిక్కిపోయినట్టు కన్పిస్తున్నాడు. సుజాత, అతనికి ఒంట్లో బావుండలేదేమో ననుకుంది ఒంటరిగా ఉంటున్నాడేమో, అతని ఆలనా పాలనా చూసేవాళ్ళు కూడ ఎవ్వరూ లేరని జాలిపడింది

ఎప్పటిలా ప్రశాంతంగా ఉన్న ఆమె ముఖం, స్వచ్ఛంగా, చెక్కుచెదర కుండా ఉన్న ఆమె చిరునవ్వు చూసి ఒక్క క్షణం రవి మనసు చలించింది కాని అంతలోనే, కోపంతో, అతని కళ్ళు ఎర్రబడ్డాయి. ఇది సమయంకాదని తమాయించుకున్నాడు కామ్‌గా తన రూమ్‌కు వెళ్ళి కూర్చున్నాడు. అంతా నటన, తన గుండెను రంపపుకోత కోస్తూ ఎలా నవ్వగలుగుతుందో? యిలా ఆలోచిస్తూ కూర్చున్నాడు. స్టాఫ్ అందరూ ఒక్కొక్కరే తాము రాసిన ఫైల్స్ తీసుకువచ్చి టేబిల్‌మీద పెట్టి వెళ్తున్నారు. పన్నెండున్నరకు సుజాత, తను రాసిన ఫైల్ తీసికొని వెళ్ళి టేబిల్‌మీద పెట్టి, అతనికి కొంచెం దూరంలో నిలబడి అడిగింది.

"సర్, మీకు ఒంట్లో బావుండలేదా?"

రవి ఏమీ మాట్లాడలేదు. అతని మౌనం చూసి సుజాత తనే మళ్ళీ అడిగింది.

"సాటర్‌డే కూడ లీవ్ పెట్టారు. ఫీవర్‌గాని వచ్చిందా?"

"నీ కనవసరం." రవి కటువుగా అన్నాడు

అతని గొంతులోని కారిన్యానికి సుజాత అదిరిపడింది. అంతలోనే సర్దుకుని, తను వెళ్ళి చూడలేదని కోపమేమో ననుకుంది

"యీ రెండు రోజులలో బాగా చిక్కిపోయారు నీరసంగా కనిపిస్తున్నారు. మీలో చాలా మార్పు కనిపిస్తున్నది"

"ఇది ఆఫీసు. మీరు బాధ్యతగల ఉద్యోగి మిస్ సుజాతా, మీరింక

వెళ్ళొచ్చు" రవి ఫైల్‌మీద సైన్ చేసి టేబిల్ చివరకు త్రోశాడు సుజాత వస్తున్న దుఃఖాన్ని అపుకుంటూ ఫైల్ తీసికొని వెళ్ళిపోయి తన సీట్లో కూర్చుంది.

ఆమె వెళ్ళిన తర్వాత రవి బాధపడ్డాడు. సుజాత తన సజార్దినేటయినంత మాత్రాన, ఆమె మనసుమీద తనకేమి రైట్స్ ఉన్నాయి ఆమె అ మధునే పెళ్ళాడి హాయిగా ఉంటే మనస్ఫూర్తిగా దీవించాలి, సంతోషించాలి. ఆమెను నిజంగా ప్రేమిస్తే, తను ఆమె సుఖాన్నే కోరాలి ప్రేమ త్యాగాన్ని కోరుతుం దంటారు. సుజాత సుఖంకోసం, తను తన పవిత్ర ప్రేమను త్యాగం చెయ్యాలి. ఏమైనా సుజాత రూపంనిండిన తన మనసులో మరొకరికి స్థానం లేదు. తన లైఫ్ బాచిలర్‌గానే గడిచిపోవాలి మనసులేని మనువు చేసికొని మరో స్త్రీకి అన్యాయం చెయ్యకూడదనుకున్నాడు.

వెంటనే, తనకు పెళ్ళిచేసుకునే ఉద్దేశంలేదని, మరే సంబంధాలూ చూడ వద్దని తండ్రికి లెటర్ రాశాడు.

## 11

సుబ్బారావుకు ఎక్కడా అప్పు దొరకలేదు. ఏం చెయ్యటానికీ తోచలేదు. ఆ సాయంత్రం షాపులో కూర్చునివుండగా, ప్రకాశ్ వచ్చాడు షాపు క్లర్క్‌ను చూచుకోమని చెప్పి అతనితో సెంటర్‌కు వెళ్ళాడు. అతనితో, రోడ్డుప్రక్కగా నెమ్మదిగా నడుస్తూ, సుజాత పెళ్ళికి అప్పు దొరకలేదని చెప్పాడు. ప్రకాశ్, తను అయిదువేలు సర్దుతానని, మిగతాది మరెక్కడైనా చూడమని చెప్పాడు. సుబ్బారావతని మాటలకు పరమానందపడ్డాడు. సుజాత స్వయంగా సంపాదించి నది, బ్యాంక్‌లో మూడువేలుంది. లాస్టియర్ ప్రోఫిట్ రెండువేలుంది. ఎలాగో పెళ్ళి జరిపేస్తే తర్వాత చూసుకోవచ్చు. యీ విషయం తల్లితో చెప్పాలని యింటికి బయల్దేరాడు.

దారిలో వెంకట్రామయ్య కన్పించాడు. సుబ్బారావాయనను చూసి నవ్వుతూ పల్కరించాడు.

"బావాయ్, ఎప్పుడు రావటం? అంతా కులాసాయేనా?"

"ఆ కులాసాయే, నీ దయవల్ల" వెంకట్రామయ్య గొంతులో నిష్ఠురత ధ్వనించింది

"అదేమిటలా అంటావ్? యింటికెళ్దాం పద. నీతో ఒకవిషయం మాట్లాడాలి."

"యింకా యింటికి రమ్మంటున్నావా? తాంబూలాలు పుచ్చుకుని ఖాయపర్చుకున్న

సంబంధం కాదని, అగ్నిహోత్రంలాటి వంశానికి మచ్చతెచ్చావు అంత బావమరది కివ్వదల్చుకున్నవాడివి, నన్ను సంబంధం చూడమనటం ఎందుకు?"

"ఏమిటి బాబాయ్ నువ్వనేది?"

"యింకేమంటాను? నాకు నల్గురితో గడ్డిపెట్టించావు. రామభద్రయ్య మండి పడుతున్నాడు. యిలాటి సంబంధం మాట్లాడినందుకు నామీద మండిపడు తున్నాడు"

సుబ్బారావుకు తల తిరిగినట్టయింది వెంకట్రామయ్య మాటలకు కోపం వచ్చినా అణచుకుని, "ఏమిటి బాబాయ్ నువ్వు చెప్పింది? నీ మాటలు నాకేమీ అర్థంకావటంలేదు. పెళ్ళి ఖర్చులకు డబ్బు దొరకగానే నీకు లెటర్ రాద్దామను కున్నా మంచిరోజుచూసి, నువ్వు, రామభద్రయ్యగారిని తీసుకువస్తే ముహూర్తం పెట్టుకోవచ్చుననుకున్నాను," అన్నాడు

"జరిగిందేదో జరిగింది. వాళ్ళబ్బాయి పెళ్ళి చేసుకోనన్నాడట నీ చెల్లెలికి మరో సంబంధం చూసుకోమని చెప్పమన్నారు. నాకు వేరే పనుంది, వస్తా," అంటూ విసవిసా నడిచి వెళ్ళిపోయాడు వెంకట్రామయ్య.

సుబ్బారావుకు కాళ్ళక్రింద భూమి కదిలినట్టయింది భార్యకిష్టంలేకపోయినా, ఉన్నంతలో ఘనంగా పెళ్ళి జరిపించాలనుకున్నాడు బంగారంలాటి సంబంధం, సుజాత సుఖపడుతుందనుకున్నాడు అనుకోని అవాంతరం వచ్చిపడింది. సెటి లయిన మాచ్ తప్పిపోవటమేమిటి? బ్యాడ్ లక్ వాళ్ళు ఎందుకు కాదన్నారో, పెద్దమనుషులతో అడిగించాలి. యిలా ఆలోచిస్తూ, కాళ్ళీడ్చుకుంటూ యిల్లు చేరాడు.

"వెంకట్రామయ్య బాబాయి కన్పించాడమ్మా" సుబ్బారావు తల్లితో నెమ్మదిగా అన్నాడు

"ఏం చెప్పాడు? ముహూర్తం పెట్టుకోటానికి ఎప్పుడు వస్తారన్నాడు?"

సుందరమ్మ సాలోచనగా అడిగింది

"వాళ్ళు రారట" సుబ్బారావు ముక్తసరిగా సమాధానం యిచ్చాడు

"మరి, అక్కడికే రమ్మన్నారా?"

"లేదు. మన సంబందం చేసుకోడానికి వాళ్ళు యిష్టపడటంలేదట. మనల్ని మరో సంబంధం చూసుకోమని చెప్పమన్నారట"

ఆ మాట విన్న సుందరమ్మ షాక్ తిన్నట్టుగా వణికిపోయింది నోట మాట రాలేదు. పడుకుని వాళ్ళ మాటలు వింటున్న సుజాతకు గుండెల్లో రాయి పడి

నట్టయింది. కొంచెంసేపటికి సుందరమ్మ తేరుకుని, కోపమూ, దుఃఖమూ సమ్మిశితమైన స్వరంతో, "పిల్లను చూసి నచ్చిందని, కట్నాలు మాట్లాడుకుని, ఖాయ పరచుకుని, తాంబూలాలు పుచ్చుకుని యిప్పుడు యిష్టంలేదనటమేమిటి? ఎందుకిష్టంలేదట?"

"ఏమోనమ్మా నాకూ అదే అర్థంకావటంలేదు. పెద్దమనుషులను తీసికెళ్ళి ఆ రామభద్రయ్యను నాలుగూ దులిపివస్తాను." సుబ్బారావు ఆవేశంగా అన్నాడు.

"అంతా మనరాత. వాళ్ళను ఏమంటేమాత్రం, మనమ్మాయి పెళ్ళి ఎలా జరుగుతుంది? వాళ్ళకిష్టం లేకుండా బలవంతాన ఎలా కట్టబెడతాం? యింకెవరైనా ఎక్కువ కట్నం యిస్తామంటే మాట తప్పారేమో!" సుందరమ్మ బాధగా తలపట్టుకుంది

"పెళ్ళికొడుకు అడ్రస్ తెలిసికొని, అతన్ని నిలదీసి అడుగుతాను. చెల్లికేం లోపమని, యిలా చూసి, నచ్చిందని, తీరా సెటిలయిన తర్వాత కాదంటాడా? యిదేనా అతని చదువు సంస్కారమూను? వాళ్ళ చెల్లికే యిలా జరిగితే ఎంత బాధపడేవాడో? వెళ్ళి మొహం వాచేలా చీవాట్లుపెట్టి, యిలా మరే ఆడపిల్లనూ అవమానించవద్దని బుద్ధి చెప్పి వస్తాను" సుబ్బారావు పట్టుదలగా అన్నాడు.

"వద్దన్నయ్యా, నువ్వేమీ అనవద్దు. ఇది జీవితసమస్య సంప్రదింపులతో, సలహాలతో, సంజాయిషీలతో చక్కబడేదికాదు. నాకెలా రాసి ఉంటే అలా జరుగుతుంది నువ్వనవసరంగా ఎవ్వరినీ ఏమీ అనవద్దు." సుజాత దుఃఖోద్వేగంతో అని, దిండులో తల దూర్చి రోదించసాగింది

సుబ్బారావు చెల్లెలి వీపుమీద నవరిస్తూ, "నువ్వేమీ బాధపడకమ్మా. నీలాటి సౌందర్యరాశి, సుగుణవతి వాళ్ళకు వేయి జన్మలు తపస్సుచేసినా దొరకదు. నీకు, యింకా నాలుగయిదువేలు ఎక్కువ కట్నంయిచ్చి, యింతకంటె మంచి సంబంధం చేస్తాను," అని చెల్లెలిని ఓదార్చాడు.

"వాళ్ళ ఆడపిల్లకు యిలా జరిగితే ఎంత బాధపడేవారో. వాళ్ళకు ఆడపిల్ల ఉసురు తగులుతుందన్న యింగితజ్ఞానంకూడాలేదు. కుర్రాడికి తెలియకపోయినా, తల్లిదండ్రులు బుద్ధి చెప్పక యిలా మాట్లాడతారా? యింత మాట నిలకడలేని వాళ్ళ సంబంధం పోతే పోయింది మరొకటి చూడుబాబూ" సుందరమ్మ కొడుకుతో చెప్పింది

"అన్నయ్యా, మా యిద్దరికీ రాసి ఉంటే సవ్యంగానే పెళ్ళి జరిగేది. నాకు పెళ్ళి చేసుకునే ఉద్దేశంలేదు. నీవు యింక సంబంధాల వేట మానెయ్. నన్ను




కాస్త మనశ్శాంతికోసం ప్రయత్నించనీ." సుజాత, దుఃఖపూరితమై, బొంగురు పోయిన గొంతుతో తన ఉద్దేశము అన్నకు తెల్పింది.

"అలాగేనమ్మా. ఏ సంబంధమయినా నీకిష్టమయితేనే చేస్తాను " సుబ్బారావు చెల్లెలికి అభయమిచ్చాడు

*　　　　*　　　　*

సుజాతకు బ్యాంక్‌కు వెళ్ళాలన్పించటంలేదు. రిజైన్ చేద్దామంటే, మళ్ళీ జాబ్ దొరకటం అంత సులభంకాదు తప్పనిసరిగా డ్యూటీకి వెళ్తున్నది. రవి కన్పించి నప్పుడు, తలవంచుకుని తనపని తను చేసుకుపోతుంది. అపనితో మాట్లాడటం లేదు. ఫైల్స్ సైన్ చేయించటానికి ప్యూన్‌తో పంపిస్తున్నది. ఎప్పుడైనా స్వయంగా తీసికెళ్ళినా మిగతా ఎంప్లాయీస్‌లాగే తనూ, ముభావంగా చూపించి సైన్ చేయిస్తుంది రవికూడా ఆమె ప్రవర్తనకు లోలోన బాధ పడుతున్నా, పైకి మాత్రం మాట్లాడేవాడు కాదు. యిద్దరికిద్దరూ నిరుత్సాహంగా, అపరిచిత వ్యక్తుల్లా బిహేవ్ చేస్తుంటే, స్టాఫ్ అంతా మొదట ఆశ్చర్యపడ్డారు. తర్వాత మనకెందుకులే అని ఊరుకున్నారు.

## 12

ఎవరు బాధపడ్తున్నా, ఎవరు సంతోషిస్తున్నా, కాలచక్రం క్రమం తప్పకుండా తిరుగుతూనే ఉంటుంది. వర్షాలు వెనకబడుతున్నాయి. పండుగలు, శ్రావణ మాసం, అన్నీ సుజాత జీవితంలో ఏ సరదాను కల్గించక వెళ్తున్నాయి. సుజాత

వెనకటి మాదిరిగా నెలకు రెండువంద లివ్వబోతే, సుబ్బారావు తీసుకోవటంలేదు. సుజాతకు బట్టలు కొనాలనిగాని, నగలు చేయించుకోవాలనిగాని యిష్టతలేదు. ట్యూషన్ ఫీజు, శాలరీ మొత్తం తమ సేవింగ్స్‌లో జమచేస్తున్నది ఆమెకు జీవితం రసహీనంగా తోస్తున్నది హృదయమంతా నిరాశా నిస్పృహలతో నిండి జీవితేచ్ఛ నశించి దానిస్థానే వైరాగ్యం చోటు చేసుకుంటున్నది ఎప్పుడూ పరధ్యానంగా, ఏదో అమూల్యమైన వస్తువును పోగొట్టుకున్నదానిలా తనలో తనే బాధపడుతుంది ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడదు

అక్టోబరులో మధుకు యూనివర్శిటీ పరీక్షలు జరిగాయి గ్రూప్ మాత్రం రాశాడు. ఇంగ్లీషు పరీక్షకు వెళ్ళలేదు. వసుంధర అడిగితే, యిప్పటి నుండీ చదివి మార్చికి రాస్తానని చెప్పాడు పరీక్ష టైం తర్వాత యింటికివెళ్ళి వారం తిరక్కుండానే వచ్చేశాడు యిప్పుడు క్లాసులకు వెళ్ళే పనికూడాలేదు. పగలంతా జులాయి తిరుగుడు తిరగటం వేళకువచ్చి భోం చెయ్యడం, రాత్రి పదింటికి వస్తే యింటికి రావటం, లేకపోతే ఏ ఫ్రెండ్ దగ్గరో గడిపి మర్నాటి ఉదయం వచ్చేవాడు అతని ప్రవర్తన వసుంధరకు విసుగు కల్గించింది. కాని పంపించేస్తే, పిన్ని ఏమనుకుంటుందో అని ఊరుకుంది

సుబ్బారావు ఒకరోజు చీవాట్లేసి, అలా తిని తిరగటానికి వీల్లేదు నీ ప్రవర్తన మార్చుకోకపోతే యీ యింట్లో ఉండొద్దని చెప్పేశాడు మధు, నిజంగానే యింటికి పంపిస్తారేమోనని భయపడి, రోజూ రెండు గంటలు మెడికల్ షాపులో కూర్చోవటం మొదలుపెట్టాడు. యింట్లో చిల్లర డబ్బులు, చిన్న చిన్న వస్తువులు, అందినవల్లా ఎత్తుకుపోతుండేవాడు. సుందరమ్మ, ఏమంటే కోడలు ఏమనుకుంటుందోనని చెప్పేదికాదు.

సుందరమ్మ కూతుర్నిచూసి బాధపడేది సుజాత యింట్లో లేనిసమయంలో, సుజాత పెళ్ళి విషయం సుబ్బారావుకు గుర్తుచేస్తుండేది "చూద్దామమ్మా, సరైన సంబంధం దొరికితే తప్పకుండా చేద్దాము నేనూ అందుకే చూస్తున్నాను" అనేవాడు

అది శరత్కాలం. చలి వణికిస్తున్నది. జాబిల్లి తన వెన్నెల వెలుగులతో ప్రకృతిని పులకింపజేస్తున్నాడు నిర్మలంగాఉన్న, అంబరవీధిని, తొలిమబ్బు తునకలతో దోబూచులాడుతున్నాడు సుబ్బారావు జాబిల్లిని చూసినప్పుడు, అనుకుంటాడు. చంద్రకళలలాగే వ్యక్తుల జీవితాలలో ఉచ్ఛ, అధమస్థితులు, కృష్ణపక్షం, శుక్లపక్షం, కొన్నాళ్ళు కష్టాలు మరి కొన్నాళ్ళు సుఖాలకు నిదర్శ

నాలు. భార్య, తను నెలంతా కష్టపడి చెరో మూడువందలు సంపాదించి, ఎదుగూ బొదుగూలేని జీవితం, తీరని కోరికలతో కొన్నాళ్ళు గడిపారు మెడికల్ షాపు పెట్టిన దగ్గర్నుండీ తమ స్టాండర్డాఫ్ లివింగ్ వృద్ధిచెందింది గత సంవత్సరం కంటె, యీ సంవత్సరం లాభం ఎక్కువే మిగుల్తుంది. జీవితం సాఫీగానే గడుస్తున్నది. తన మనసును వేధిస్తున్నదల్లా ఒక్కటే సమస్య. అదే చెల్లెలి పెళ్ళి. అది కాస్తా అయితే తనకెలాటి బరువు బాధ్యతలూ ఉండవు రవిమోహన్ సంబంధం తప్పిపోయింతర్వాత సుజాత అదోలా ఉంటున్నది ఎప్పుడూ దిగులుగా, బ్రతుకు భారమన్నట్టుగా, యిరవయ్యేళ్ళకే, అరవైలో ఉన్నట్టుగా, విరాగినిలా గడుపుతున్నది. ఆమె మనసు కుదుటబడాలంటే, మామూలు మనిషి కావాలంటే వెంటనే పెళ్ళి చెయ్యాలి సుజాత హృదయం మృదుకుసుమం అది వాడకుండా, పదిలంగా చూసుకోగల్గితేనే సుగంధాన్ని, సౌకుమార్యాన్ని యివ్వ కల్గుతుంది ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా, వాడి, నలిగి, నిరుపయోగమై పోతుంది. తెలిసీ తెలియని వయసు వద్దని మొరాయించినా, మంచి సంబంధం చూసి నచ్చజెప్పి పెళ్ళిచెయ్యాలనుకునేవాడు

శ్రీదేవికి తొమ్మిదవ నెల నిండుతున్నది బొద్దుగా ముద్దుగా, ముద్దబంతి పువ్వులా తయారయింది అమ్మ, అత్త, తాతలాటి చిన్న చిన్న మాటలు చెబుతున్నది కొంచెం దూరం ప్రాకగల్గుతున్నది సుందరమ్మకు మనవరాలి తోటిదే లోకం పాపను ఒక్క క్షణం కూడ విడిచి ఉండదు సుజాతకూడ మేనకోడలి ముద్దుమాటలతో, ఆటపాటలతో కొంచెంసేపు వ్యథాపూరితమైన మనసుకు ఊరట కల్గించుకునేది

మధు ఏదో వంకతో, సుజాతను పలకరించేవాడు. పాపతో ఆడుకుంటూ కూర్చుంటే, తనూ వెళ్ళి ఎదురుగా కూర్చునేవాడు అతని వెకిలినవ్వులు, వింత చేష్టలు చూసి సుజాత లోలోన అసహ్యించుకునేది యీ సంవత్సరం వ్యాపారంలో పదకొండు వేలు మిగులుతుంది. సుబ్బారావు, వెయ్యి రూపాయలు ఖర్చుపెట్టి యింట్లో అందరికీ సంక్రాంతికి బట్టలు కొన్నాడు తను రెండు జతలు కుట్టించుకుని, మధుకు ఒక పాంటూ, షర్టూ కుట్టించాడు

వసుంధర స్కూటర్ కొనమని చెప్పింది. రిక్షాలకయ్యే డబ్బులయినా మిగులుతాయి గదా అని, సుబ్బారావు సరేనని, స్కూటర్‌కు అప్లై చేసి అయిదు వందలు అడ్వాన్స్ ఇచ్చాడు. నెలరోజులకు స్కూటర్ వచ్చింది. సుబ్బారావు వసుంధరను స్కూటర్‌మీద ఎక్కించుకుని స్కూలు దగ్గర దింపేవాడు. అప్పుడప్పుడూ సుజాతను ఎక్కించుకుని బాంక్‌కు తీసికెళ్ళేవాడు.

ఫిబ్రవరిలో మధు రిజల్ట్స్ వచ్చాయి. మళ్ళీ ఫెయిలయ్యాడు. యింక చదవను ఏదైనా ఉద్యోగం చూడండి చేస్తానన్నాడు. సుబ్బారావతనిని చదవమని బలవంతం చెయ్యలేదు. మాణిక్యాంబ ప్రతి లెటర్‌లోనూ రాస్తుంటే, వసుంధర, సుజాతను మధుకివ్వమని భర్తను మళ్ళీ అడిగింది. సుబ్బారావు, మరొక్కసారి ఆ మాట అంటే పళ్ళు రాలగొడతానని, స్ట్రాంగ్‌గా వార్నింగివ్వడంతో నోర్మూసుకుంది.

ఆ రోజు వసుంధర, సుబ్బారావు పిక్చరు కెళ్ళారు. సుందరమ్మ, ప్రకాశ్ తల్లి రామాయమ్మ వస్తే, ఆమెతో హరికథకు వెళ్ళింది. సుబ్బారావు వెళ్తూ, తాము వచ్చేవరకూ పాపదగ్గర పడుకోమని, జాగ్రత్తగా ఉండమని సుజాతతో చెప్పాడు. తొమ్మిదన్నరకు వాళ్ళు బయటకి వెళ్ళారు సుజాత పాపకు పాలు పడుతున్నది. వీధి తలుపు ఎవరో తట్టిన చప్పుడయింది. సుజాత ముందు గదిలోకి వచ్చి, తలుపు తెరవకుండానే ఎవరూ ? అని ప్రశ్నించింది.

"నేను, సుజా, తలుపు తియ్." మధు గొంతు విన్పించింది.

తలుపు తెరవాలా, మానాలా అని ఒక్క క్షణం ఆలోచించి, యింత రాత్రి ఎక్కడి కెళ్తాడులే పాపమని చివరకు తెరచింది.

మధు లోపలికి వస్తూనే, "అక్కా, బావ లేరా ?" అని అడిగాడు.

అతని నోటినుండి బ్రాందీ వాసన గుప్పుమంది. సుజాత అతనికి రిప్లై యివ్వకుండా, విసురుగా లోపలి కెళ్ళబోయింది. మధు, ఆమె జడ పట్టి లాగాడు. అలా జరుగుతుందని ఊహించని సుజాత విసురుగా అతని హృదయంమీద వాలిపోయింది. వెంటనే లేవబోయింది. మధు ఆమెను తన కబంధహస్తాలతో బంధించాడు. ఆమె విడిపించుకోవాలని పెనగులాడింది. గోళ్ళతో రక్కింది. పిడికిలితో గుద్దింది. మధులో పట్టుదల ఎక్కువయింది.

"సుజా! నీ అందంతో నన్ను వెర్రెత్తించావు. నీ ఒంపు సొంపులు, నీ సన్నని నడుము, గులాబీ రంగు అధరాలు, మత్తెక్కించే ఆ కళ్ళు, నీకు నీవే సాటి."

"యూ, స్కౌండ్రల్. ముందు వదులు పిచ్చిగా వాగకు."

"కోపంలో మరీ అందంగా ఉన్నావు. యిలాటి అవకాశం మళ్ళీ రాదు. నేనంటే నీకూ యిష్టమే. పైకి అలా అంటావుగాని డియర్," అంటూ సుజాత పెదాలపై ముద్దు పెట్టుకోబోయాడు.

సుజాత అతని చేతిని బలంకొద్దీ కొరికింది.



"వదులు రాక్షసీ" సుజాతను వదిలేశాడు. సుజాత రెండడుగులలో పాప పడుకున్న గదిలోకి పారిపోయి తలుపేసుకుంది. మధు తలుపు దగ్గరే నిలబడ్డాడు

"సుజాతా నిన్నెంతగా ప్రేమిస్తున్నానో తెలుసా. నీ అందం ఎలాటిదో నీకు తెలియదు బ్యూటీ కాంటెస్ట్‌లో ప్రైజ్ తెచ్చుకోవలసినదానివి. బై దిబై నాకు వరసైనదానివి. నువ్వు ఊ అంటే నీ మెడలో మూడుముళ్ళూ వేసేస్తాను."

"నువ్వేమీ చెయ్యనక్కర్లేదు. నోర్మూసుకుని బయటకు నడువ్." సుజాత తలుపుకు ఆనుకుని నిలబడి, అదురుతున్న గుండెలను చేత్తో పట్టుకుని కోపమూ భయమూ కలిసిన స్వరంతో అంది.

"యిప్పుడప్పుడే మీ అమ్మగాని, అక్క, బావగారు ఎవ్వరూ రారు. యింట్లో ఉన్నది మనిద్దరమే వచ్చిన ఛాన్స్ పోగొట్టకు. నీ అందాన్ని, యవ్వనాన్ని అడవిని కాచిన వెన్నెలచేయకు. అప్పుడే పదినిముషాలు గడచిపోయింది టైమ్ వేస్ట్ చెయ్యకు"

"యూ షటప్." సుజాత కంఠం ఖంగుమంది

"స్వీట్ వాయిస్. లౌలీ మెయిడ్ నీకిష్టంలేకపోతే పెళ్ళాడవద్దులే యీ ఒక్కసారికే నా కోరిక తీర్చు ఎవరితోనూ చెప్పనులే. తలుపుతియ్, సుజా!" మధు గట్టిగా అరుస్తూ తలుపును బలంగా తన్నాడు. సుజాతకు నోట మాట రావటంలేదు. వణకిపోతున్నది. ఏ క్షణంలోనయినా ఆ తలుపు ఊడి పడి పోవచ్చుననుకుంది గోడకు వ్రేలాడుతున్న కేలండర్‌లోని వెంకటేశ్వరస్వామి ఫోటోకు నమస్కరించి, స్వామీ యీ రాత్రి యీ రాక్షసునిచేతిలో చెడిపోకుండా నా శీలాన్ని కాపాడు నాకు నీవే దిక్కు అని వేడుకుంది మధు గది బయట చేస్తున్న చప్పుడుకు పాప లేచి ఏడుపు లంకించుకుంది యింతలో బయట స్కూటరాగిన శబ్దమూ, ఆ తర్వాత, వీధి తలుపు తట్టినధ్వని విన్పించాయి. మధు వెళ్ళి తలుపుతెరిచాడు వసుంధర లోపలికడుగుపెట్టి తమ్ముణ్ణిచూచి "ఎంత సేపయింది నువ్వొచ్చి? మేం సినిమాకని వెళ్ళాము టికెట్స్ దొరకలేదు. అందుకే వచ్చేశాము" అంది

"మీరు నన్ను చూడలేదు కాని, నేను మిమ్మల్ని చూసానక్కా. వీధిచివర ఎదురయ్యారు." మధు నిజంచెప్పాడు

"చెల్లీ" సుబ్బారావు తలుపుతట్టాడు.

సుజాతకు, అన్నపిలుపుతో పోయినప్రాణం లేచివచ్చినట్టయింది. పాపను మంచంమీద వదిలేసి, లేచి తలుపుతీసింది

సుబ్బారావు లోపలికి రాగానే జరిగినదంతా చెప్పింది అతను రుద్రుడిలా లేచి మధు చొక్కా ఒకచేత్తో పట్టుకుని మరోచేత్తో చెంపలు బలంకొద్దీ వాయించాడు. మధు మైకంవదలి బావకాళ్ళు పట్టుకున్నాడు "నన్ను క్షమించండి. యింకెప్పుడూ అలా చేయను. యీ ఒక్కసారికీ వదిలిపెట్టండి. తప్పయి పోయింది," అని వలవల ఏడ్చాడు

సుబ్బారావతనిని కాళ్ళతోతన్ని, యింకా కోపం చల్లారక, జుట్టు పట్టుకుని తల గోడకేసికొట్టాడు.

"రాస్కెల్. తిన్నయింటి వాసాలు లెక్కపెడతావా? నా యింట్లో ఒక్క క్షణం ఉండటానికి వీల్లేదు. గెటవుట్." గట్టిగా అరిచాడు.

యింకా అక్కడె ఉంటే తన ప్రాణాలు దక్కవని, మధు, కాలికి బుద్ధి చెప్పాడు అతనటు వెళ్ళగానే వసుంధర సాధించటం మొదలుపెట్టింది.

"మీ చెల్లెలి మాటంటే మీకంత నమ్మకం. యీవిడగారు ఏమీ అనకుండా వాడెప్పుడూ అలా చెయ్యడు. పెళ్ళిచెయ్యకుండా, చెట్టల్లే ఎదిగిన చెల్లెల్ని యింట్లో పెట్టుకుని, తగుదునమ్మా అని వాణ్ణి యిష్టంవచ్చినట్టు కొడతారా? మీ చెల్లెలికి బుద్ధిచెప్పండి ముందు వాడుకాకపోతే మరొకడు. యీవిడగారిలా తిరిగితే పోయేది మన పరువులేగా. వాడికే, మగమహారాజు. మనయింట్లో ఉంటున్నాడని మీరంత తేలికగా చూస్తున్నారు."

"టికెట్స్ దొరక్కపోబట్టి, సమయానికి మనం రావటంతటస్థించింది లేకపోతే ఎంత అఘాయిత్యం చేసేవాడో. ఆ రాస్కెల్ని సమర్థిస్తున్నావా? నీకు మతి పోలేదుగద."

"మీరు ఎప్పుడూ ఒకకోణంనుంచే ఆలోచిస్తారు వాడు పొరపాటు చేశాడను కోండి తెలిసీ తెలియని వయసు. తొందరపడ్డాడేమో. అలా చావచితకకొడితే, వాడికేమన్నా అయితే మనపరువేంకాను. యీ విషయం నలుగురికీ తెలిస్తే మనల్నే నవ్వుతారు. వయసులోఉన్న వాళ్ళు తొందరపడ్డారేమో, యిద్దరికీ పెళ్ళి చేసెయ్యగూడదూ. యింతకంటె గొప్పసంబంధం తెస్తారా? అని నల్గురూ మనల్నే అంటారు."

"ఎవరేమన్నా నా నిర్ణయం మారదు. సుజాతను వాడికివ్వనని నీకిదివరకే చాలాసార్లు చెప్పాను. వాడు యీ యింట్లో ఉండటానికి వీల్లేదు. తెల్లవారిం తర్వాత వస్తే పెట్టే, బేడా సర్దుకుని పొమ్మను.

"వాడెందుకు వెళ్ళటం. మీ తల్లీ, చెల్లెలు తినడంలేదూ. అక్కయింట్లో నాల్గునెలలుండటానికి వాడికి హక్కులేదా? వాణ్ణి వెళ్ళమనేముందు వాళ్ళిద్దర్నీ పంపించెయ్యండి. యిప్పుడు అర్థాంతరంగా ఎక్కడికిపోతాడు. ఏప్రిల్‌లో పరీక్షలు రాసివెళ్తాడు."

"ఇది నా యిల్లు, నా యిష్టం. వాడిక్కడ ఉండటానికి వీల్లేదన్నాను, అంతే. నువ్వెంత వాదించినా నోయూజ్."

"వాణ్ణి వెళ్ళమంటే, వాడితోపాటు నేను, పాపకూడా వెళ్ళిపోతాం. మీరు మీ అమ్మనూ, చెల్లెల్ని పెట్టుకుని ఊరేగండి"

"నువ్వెళతానంటే, ఉండమని బలవంతంచెయ్యను. ఐ హావ్ నో అబ్జక్షన్. యూ కెన్‌గో",

"మీకు నామీద ప్రేమలేకపోయినా పాపమీదన్నా లేదు. మీకిష్టం లేనప్పుడు ఎలా ఉంటాను? వెళ్తాలెండి." వసుంధర ఏడ్వసాగింది.

సుబ్బారావు ఆమెదగ్గరగా వెళ్ళి, "వసూ, యిక్కడ నా యిష్టా యిష్టాల ప్రసక్తేలేదు. మా చెల్లి, మా అమ్మ, వాళ్ళంతట వాళ్ళు మనింటికి రాలేదు. నీ యిష్టప్రకారం నేను రమ్మంటే వచ్చారు వాళ్ళడబ్బుతో నేను బిజినెస్ చేస్తున్నాను. యిప్పుడు వెళ్ళమంటే ఎక్కడికెళ్తారు?" అనునయించాడు.

"ఏమో అదంతా నాకు తెలియదు. ముందు వాళ్ళిద్దరినీ పంపించెయ్యండి ఆ షాపు వాళ్ళకే వదలి హాయిగా జాబ్‌లో చేరండి. లేదంటే మనం కలిసిఉండటం జరగదు. యీ రెండు సంవత్సరాలలో సంపాదించింది ఏముంది సంపాదన తినడానికే సరిపోయింది."

"అలా అయితే ఆలోచిద్దాంలే. ముందు జాబ్ దొరకాలిగా." అప్పటికి ఓదార్పుగా అన్నాడు.

## 23

సుందరమ్మ, కోడలు, కూతురూ వెళ్ళిన తర్వాత యింటికి తాళంపెట్టి, మనుమ రాలిని పనికుర్రాడికి అప్పగించి, అద్దెయింటికోసం వెదకనారంభించింది. కాళ్ళు నొప్పిపుట్టేలా నడిచి, ఎక్కువ దూరమనుకుంటే రిక్షాలోచేరి, ఎక్కడ ఖాళీ ఉందంటే అక్కడికి పరిగెత్తేది. అలా తిరగ్గా, తిరగ్గా, వారంరోజులకు, రామా యమ్మ, వాళ్ళింటికి రెండు ఫర్లాంగుల దూరంలో ఒక పోర్షన్ ఖాళీగా ఉందంటే వెళ్ళింది. అది పెంకుటిల్లు, రెండు పోర్షన్లుగా ఉంది. ఒక్కొక్క పోర్షన్‌కు రెండుగదులు, చిన్నవరండా. యింటిముందు కొంచెం ఖాళీస్థలంలో సిమెంట్‌పాత్ దాని కిరువైపులా పూలమొక్కలు, గజంన్నర ఎత్తున కాంపౌండ్ వాల్, చిన్న గేటు ఉన్నాయి. యింటి వెనుకభాగంలో బావి, మంచినీళ్ళ పంపు, బాత్‌రూమ్ వగైరా అన్ని సౌకర్యాలతో యిల్లు బాగానేఉంది యింటిఓనర్స్ ఒకపోర్షన్‌లో ఉంటున్నారు రెండవపోర్షన్‌కు రెంట్ తొంభై రూపాయలు, కరెంట్ ఎక్స్ట్రా అన్నారు. సుందరమ్మకు యిల్లు నచ్చింది. రెండువందలు అడ్వాన్స్ యిచ్చి వచ్చింది.

ఆ రాత్రి భోజనాలయింతర్వాత యీ విషయం కొడుక్కీ, కూతురికీ యిద్దరికీ చెప్పింది. సుజాత సంతోషపడింది. సుబ్బారావుకు తల్లీ, చెల్లెలూ అలా వెళ్ళి పోవటం యిష్టలేకపోలునా, పోనీ ఎక్కడయితేనేం, వాళ్ళు సుఖంగాఉంటే తన కంతే చాలునని మౌనంగా ఊరుకున్నాడు. అతని మౌనం సుందరమ్మకు బాధని

పించింది తనను యింట్లోనుండి వెళ్ళవద్దని ప్రాధేయపడతాడని, వెళ్ళటానికి ససేమిరా ఒప్పుకోడని, అతను అలా అంటే, అడ్వాన్స్ కాన్సిల్ చేసుకుని, కొడుకు దగ్గరే ఉండిపోవాలని ఏవేవో ఊహించిన సుందరమ్మకు నిరాశే ఎదురయింది. నిజానికి ఆమెకు కొడుకునూ, కోడల్నీ, మనవరాల్నీ వదలి ఎక్కడికీ వెళ్ళాలని లేదు. సుజాత పోరుపడలేక యింటికోసం తిరిగింది. దైవవశాన యిల్లు దొరికింది వసుంధర, హమ్మయ్య, పీడ విరగడౌతున్నదని మనసులో అనుకుంది పైకిమాత్రం, "కోపంలో నేను ఏదో వాగితే మీరు మనసులో పెట్టుకోకండి. మీరు వెళ్ళొద్దు అందరం కలిసే ఉందామత్తయ్యా," అంది రాని నవ్వును పెదాలమీదకు తెచ్చుకుని.

"వద్దు, వెళ్ళనీ. వాళ్ళను ఆపవద్దు. మనుషులు దూరంగా ఉన్నప్పుడయినా, మనసులు చేరువవుతాయేమో!" సుబ్బారావు నిష్కర్షగా అన్నాడు.

కొడుకు ధోరణికి సుందరమ్మకు ఆగ్రహం వచ్చింది. రాత్రంతా నిద్ర పోకుండా తన సామాను, సుజాతవి, తనవి బట్టలు అన్నీ సర్దేసింది. తెల్లవారితే ఆదివారం, మాఘ శుద్ధ తదియ. ఉదయం, తల్లీ కూతుళ్ళు ప్రయాణ సన్నాహాలలో ఉన్నారు వసుంధర లేవలేదు సుబ్బారావే కాఫీ కలిపి అమ్మకీ, చెల్లెలికీ యిచ్చి, తను త్రాగాడు బాటుగబండి, రిక్షా, పిలిచాడు. బండిమీద సామాను ఎక్కించారు. చిన్న చిన్న సూట్‌కేస్‌లు రెండు, ఒక టేబుల్ ఫాన్, కాళ్ళ దగ్గర పెట్టుకుని సుందరమ్మ రిక్షాలో కూర్చుంది. సుబ్బారావు వసుంధరను లేపాడు. ఆమె కళ్ళు నులుముకుంటూ వచ్చింది. సుందరమ్మ, "వస్తానమ్మా, పాప జాగ్రత్త," అని కళ్ళు తుడుచుకుంది సుజాత, శ్రీదేవిని ముద్దుపెట్టుకుని, వసుంధరకిచ్చి, "వెళ్ళొస్తానొదినా," అని చెప్పి, అన్న వెనుక, స్కూటర్ ఎక్కి కూర్చుంది. వసుంధర, అత్తగారికీ, ఆడపడుచుకూ, అప్పుడప్పుడు వస్తూ ఉండమని చెప్పింది.

కొత్తయింట్లో సుజాతకు మొదట్లో ఏమీ తోచేది కాదు. మార్నింగ్ క్లాసెస్ గనుక, ట్యూషన్ యీవెనింగ్ ఫోర్ టు సెవెన్ మాత్రమే ఉండేది. ఉదయం అంతా ఖాళీగా కూర్చోవలసి వస్తున్నది. యింట్లో ఉన్నది యిద్దరే. పెద్ద పనేమీ లేదు అయినా నెలకు యిరవై రూపాయల జీతంతో రత్నం అనే పనిపిల్లను పెట్టారు. రత్నానికి పదహారేళ్ళుంటాయి. సన్నగా, తెల్లగా, చలాకీగా ఉంటుంది. సినిమా పాటలు, కూనిరాగాలు తీస్తూ, పనులన్నీ చకచకా చేస్తుంది రెండు రోజులకొకసారి సుబ్బారావు ఓ డజను పళ్ళు తీసుకువచ్చి పరామర్శించి

పోతుంటాడు. అతను సాధారణంగా రాత్రి ఎనిమిదింటికి వచ్చి ఓ గంట కూర్చుని వెళతాడు. వాళ్ళకు అవసరమైన, కూరగాయలు, సరుకులు కొని యిస్తాడు. ముందు, ఆ యింట్లో దిగగానే ఒక నెలకు సరిపడే సరుకులు, బియ్యం, పుల్లలు అన్నీ కొని యిచ్చాడు సుందరమ్మ మొదట బాధపడినా, కొడుకు అంతర్యం ఏమిటో యిప్పుడిప్పుడే అర్థం చేసుకుంటున్నది

యింట్లో పెత్తనం సుజాత తీసుకుంది. కావలసినవన్నీ తనే తెప్పిస్తుంది. పెద్దపని కూడ ఏమీలేదు ఇద్దరికి కాసిని బియ్యం వండి ఏవో రెండు కూరలు చేసేది టిఫిన్ సుజాతగాని, సుందరమ్మగాని ఎవరో ఒకరు చేసేవారు సాయంత్రం సుజాత బాంక్‌నుండి వచ్చేసరికి, ఏదన్నా టిఫిన్ చేసి ఉంచేది చేసిన దాన్లో కొంచెం తీసి దాచి, కొడుకు వచ్చినప్పుడు పెట్టేది యింటి ఓనర్స్ వృద్ధ దంపతులు, సహృదయులు. వాళ్ళ ఒక్కగా నొక్క కొడుకు, కోడలూ, పిల్లలూ హైదరాబాదులో ఉంటారు. అతనక్కడ బిజినెస్ చేస్తుంటాడు తల్లిదండ్రులకు ప్రతి నెలా రెండు వందలు పంపిస్తూ ఉంటాడు. సుందరమ్మ ఆ వృద్ధ దంపతులను అన్నయ్యగారూ, వదినగారూ అని పిలుస్తుంది. ఆవిడతో కలిసి పురాణం వినడానికి, దేవాలయాలకు వెళ్తుంది

క్రొత్త యింట్లో దిగిన మూడవ రోజున, జవాను వెంకన్న కన్పించి "ఇక్కడున్నారేమండీ ?" అని పల్కరించాడు

"యిక్కడే ఉంటున్నాంగాని, నువ్విక్కడున్నావేమిటి? మీ యిల్లిక్కడేనా?" సుజాత అతన్ని అడిగింది

"మా యిల్లిక్కడ కాదండీ. ఎదురుగా కన్పించే మేడమీద అయ్యగారు ఉంటున్నారు అక్కడనుండి వస్తున్నాను.

"ఎవరు ? ఆఫీసర్‌గారా !" సుజాత ఆశ్చర్యంగా అడిగింది.

"అవునండీ, రవిమోహన్‌గారు ఆ కన్పించే పచ్చమేడ పైభాగంలో ఉంటున్నారు అద్దె మూడు వందల యాభై."

"ఆయన ఒక్కరేనా, యింకెవరన్నా ఉన్నారా ?"

"ప్రస్తుతానికి ఒక్కాయనే ఉంటున్నారు. యింకా పెళ్ళిచేసుకోలేదుగా. అన్నట్టు అడగటం మరిచాను, అయ్యగారు మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటారని విన్నాను, నిజమేనండీ ?" వెంకన్న ఉత్సుకతతో అడిగాడు.

"లేదు వెంకన్నా. ఒకప్పుడనుకున్న మాట నిజమే. కాని యిప్పుడది జరగదు." సుజాత రుద్ధకంఠంతో చెప్పింది

"అలా అడిగినందుకు ఏమనుకోకండి. ఉండబట్టలేక అడిగాను. ఆయన కెక్కడ రాసిపెట్టి ఉందో, మీరే యింటికెళ్తారో ఎవరికి తెలుసు ?" వెంకన్న సుజాత ముఖం గంభీరంగా మారటం చూసి అన్నాడు

* * *

ఆ రోజు జరిగిన సంఘటన స్మృతిపథంలో మెదిలినప్పుడల్లా సుజాత హృదయం వాధగా మూల్గేది దైవకృపవలన పెద్దగండం గడిచింది. సమయానికి అన్నయ్య రాకపోతే, ఆ మధుగాడ పశుత్వానికి బలై తన జీవితం సర్వ నాశనమయి ఉండేది. లోకంలో యిలాటి రాక్షసులు వేనవేలు. ఒంటరిగా బ్రతకాలంటే చాలా కష్టం అడుగడుగునా అవాంతరాలే ఎదురౌతుంటాయి. యిప్పుడు అన్నయ్యకూడ దగ్గర లేడు అమ్మ ఉన్నా, ఆవిడ కూడ స్త్రీయే, పైగా అరవ పదిలో ఉంది ఆవిడ వలన తన కెలాటి రక్షణ లభించదు. కీడెంచి మేలెంచమని, ఆవిడ కాస్తా హరీమంటే, తను తోడు నీడ లేని ఒంటరి అది తలుచుకుంటే ఆమె దేహం భయంతో జలదరించింది

పెళ్ళి చేసుకోమని సుందరమ్మ అప్పుడప్పుడూ హెచ్చరిస్తున్నది ఎంతగా మరచిపోవాలనుకుంటే, రవి తన మనసులో అంతగా తిష్ట వేసుక్కూర్చున్నాడు. ఎప్పుడూ అతని గురించిన ఆలోచనలే వెన్నాడుతున్నాయి. యిదివరకు బాంక్‌లో కన్పించినపుడు రవిని చూడగానే గతం జ్ఞప్తికి వచ్చి హృదయంలో చెయ్యి పెట్టి దేవినట్టుండేది యిప్పుడు యింటివగ్గర ఉన్నా, పచ్చమేడ కన్పిస్తుంటే, రవిని చూసినప్పటి భావాలే కల్గుతున్నాయి. ఎంత వద్దనుకున్నా, తన కళ్ళు, అతని ప్రతి కదలికనూ గమనిస్తున్నాయి. మనసంతా రవి మయమై, ఊహా లోకంలో యిరువురూ ఏకమై, రవి తప్ప తనకీ జగతిలో మరేమీ అక్కర్లేదని పిస్తుంటే, అతనిని మరచిపోవటం ఎలా ? రవిమోహన్‌కు అర్పితమైన మనసు మరలిరాదు. జీవచ్ఛవంలా ఏన్నాళ్ళు జీవిస్తుంది ? మనసులేని మనువు చేసికోని, మరొకరికి అన్యాయం చేసి, జీవితాంతం నరకం అనుభవించలేదు.

రవి తనను కాదనటానికి కారణం ఏమిటో తను ఆయననే అడిగి ఉండ వలసింది. ఆయనకు కోపం వస్తే మాత్రం, తను మంచి మాటలతో శాంతపరచి, అసలు విషయం తెలిసికోవలసింది. తెలివి తక్కువగా మూతి ముడుచుకుని, కళ్ళలో నీళ్ళు నింపుకుని వచ్చేసి యిప్పుడింత క్షోభ అనుభవిస్తున్నది ఆయన అంతస్తెక్కడ, ఆర్డినరీ క్లర్క్ తనెక్కడ తన కోపమే తన శత్రువైంది. అనుకున్న ప్రకారం శ్రావణంలో తమ వివాహం జరిగివుంటే, యింత రసాభాస

జరిగేది కాదు. తనిలా అమ్మతో వేరు కాపరం పెట్టేది కాదు. హాయిగా భర్తతో కాపురంచేస్తూ ఉండవలసిన వయసులో ఈ విపరీతం. రవి కౌగిలిలో కరిగిపోయి కలలు కనవలసిన వెన్నెల రాత్రులు, వ్యధాపూరితమైన ఆలోచనలతో వృధా అవుతున్నవి. తనది శాపగ్రస్తమయిన, నిస్సారమయిన బ్రతుకు.

రవి తనను కాదన్నా, యింకెవ్వరినీ వివాహమాడలేదు. యిలాగే బాచిలర్‌గా ఉండిపోవాలనుకుంటున్నారా? ఏమో, ఆయనకు తనమీద చాలా ప్రేమ. ఎవరైనా లేనిపోనివి చెప్పి ఆయన మనసు పాడుచేశారేమో. యిప్పుడైనా ఆయనను అడిగి, తమ పెళ్ళి ఆగిపోవటానికి గల కారణమేమిటో తెలిసికోవాలి. తనవలన ఏదైనా పొరపాటు జరిగిఉంటే క్షమాపణ కోరుకోవాలి. సుజాత బేల హృదయం ఆక్రోశించేది. కాని రవి ఎదురుపడగానే స్వాభిమానం అడ్డువచ్చి, అతని ముఖంలోకి చూడలేకపోయేది,

ఒకరోజు ఉదయం ఎనిమిది గంటలవేళ, వైర్ మీద ఆరవేసిన టవల్ తియ్యటానికి వాకిట్లోకి వెళ్ళింది. అప్రయత్నంగా ఆమెకళ్ళు పచ్చమేడ మీదికి వెళ్ళాయి. రామభద్రయ్య మెట్లెక్కుతూ కన్పించాడు. ఆయన కన్పించగానే సుజాత గుండె దడదడలాడింది. ఇంత ఉదయాన ఆయన ఎందుకు వచ్చి ఉంటారు. రవికి సంబంధం కుదుర్చుకుని వచ్చారేమో. అలా జరిగితే రవి తనకు శాశ్వతంగా దూరమైనట్టే. యిలాటి ఊహలతో, సంశయాలతో ఆమె మనసంతా వికలమయింది. అంతలోనే ఆమె మనసు, నిన్ను తప్ప యింకెవరినీ రవి పెళ్ళాడడని తనకు రవిపైనగల ప్రగాఢ విశ్వాసాన్ని బయల్పరిచింది.

అది ఏప్రిల్ నెల ఆఖరువారం. ఎండలు విపరీతంగా కాస్తున్నవి. వడగాడ్పులు, జనాన్ని పగటివేళ బయటకు రాకుండా ఉండేలా భయపెడుతున్నవి. సుందరమ్మ లేవలేకపోతున్నది. సుజాతకు సమ్మర్‌లో ట్యూషన్ లేదు కనుక, ఉదయం సాయంత్రం వంట తనే చేస్తున్నది.

వసంత, వారంరోజులు లీవ్ పెట్టి, వాళ్ళ బంధువులింట్లో పెళ్ళికి బెంగుళూర్ వెళ్ళింది. బ్యాంక్‌కు వెళ్ళినా తనపని తను చేసుకోవటం, కామ్‌గా కూర్చోవటం బోర్ కొడుతున్నది. మిగతా స్టాఫ్, అందరూ మగవారే. లీజర్ టైమ్‌లో వాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ, సరదాగా నవ్వుతుంటే సుజాతకు ఒక్కదానికి ఏమీ తోచటంలేదు.

ఆ రోజు లంచ్ టైమ్‌లో కొంతమంది భోజనానికి యిళ్ళకు వెళ్ళారు. కొందరు కాఫీ త్రాగటానికి హోటల్స్‌కు వెళ్ళారు. సుజాత ప్యూన్‌ను పంపి, కాఫీ తెప్పించు

కుని త్రాగింది. ఒంటరిగా, తన సీట్లోనే బిక్కు బిక్కుమంటూ కూర్చుంది తన ప్రక్కసీట్లో కూర్చునే రాజారావు టేబిల్‌మీద ఏదో నవల ఉంటే తీసుకుంది చదువుదామని మొదలుపెట్టింది యాదృచ్ఛికంగా, చూపు అక్షరాల బారులవెంట నడుస్తున్నదేగాని, మనసక్కడ నిలవటంలేదు. ఉదయంకూడా టిఫిన్ తినలేదు. బయట ఎండ తీవ్రంగా ఉంది ఫ్యాన్‌గాలి వేడిగాఉంది. సుజాతకు విపరీతమైన ఆకలివేస్తోంది కాని లేచి, ఎక్కడికీ వెళ్ళే ఓపిక లేక అక్కడే కూర్చుంది. యింతలో వెంకన్న వచ్చి, "అయ్యగారు మిమ్మల్ని రమ్మంటున్నార"ని చెప్పాడు ఎందుకు రమ్మన్నారో? వాళ్ళ నాన్నగారు వచ్చి వారమయింది. రవికి మారేజ్ సెటిలయిందేమో ఆ విషయం చెప్పటానికే పిలిచారేమో. వేయి అనుమానాలతో, అంతకుమించిన ఆలోచనల్లతో బరువెక్కిన హృదయంతో, ఎలాటి విషయం వినవలసి వస్తుందోనని భయపడుతూ వెళ్ళింది సుజాత

"రండి. అలా కూర్చోండి." సుజాతను ద్వారందగ్గర చూడగానే, వచ్చి కూర్చోమని కుర్చీ చూపించాడు. రవి, తనను బహువచనంలో సంబోధించడం సుజాతకు అదోలా అన్పించింది. ఆమె కూర్చోలేదు. తలుపును ఆసరా చేసుకుని నిలబడింది.

"ఎందుకో పిల్చారట?" సుజాత, ముఖం ప్రశ్నార్థకంగా పెట్టి అడిగింది

"యిఫ్ యూ హావ్ నో అబ్జక్షన్, సిట్ యిన్‌ది ఛెయిర్" రవి సీరియస్‌గా అన్నాడు సుజాత, తప్పనిసరిగా ఛెయిర్‌లో కూర్చుంది.

"నా మారేజ్ సెటిలయింది" రవి ఎటో చూస్తూ చెప్పాడు.

"కంగ్రాచులేషన్స్" సు జా త వణుకుతున్న పెదాలతో, తడబడుతూ చెప్పింది ఆమె భయపడినట్టే జరిగింది. ఎలాటి విషయం వినవలసి వస్తుందో నని భయపడింది. ఆమెముఖం నల్లబడింది. వస్తున్న దుఃఖాన్ని బలవంతంగా ఆపటంవలన, ఆమె హృదయం వేగంగా కొట్టుకొంటున్నది ముక్కుపుటాలు ఎగిరిపడుతున్నాయి. అతనామె ముఖంలోని భావాలను చదవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఆమెచూపు ఎక్కడో ఉన్నది

"చూడండి. మీరు మరోవిధంగా అనుకోనంటే ఒకవిషయం అడగాలనుంది."

"అడగండి." సుజాత అయిష్టంగానే అంది

"మీ పర్సనల్ ఎఫెయిర్స్‌లో యింటర్‌ఫియరవుతున్నానని కోపగించకండి. మీరు మధును, అదే మీ అన్నయ్య బావమరిదిని ప్రేమించారట ఎప్పుడు పెళ్ళి చేసుకుంటారు?"

సుజాతకు, రవి మాటలు, సూటిగా హృదయానికి అశనిపాతంలా గ్రుచ్చుకున్నాయి ఆమెకు, అతనికేం రిప్లై యివ్వాలో అర్థంకాలేదు.

"నేనా!" ఆమె ఆశ్చర్యపోయింది

"అవును మీరే మీరు మౌనంగాఉంటే, మీకు నేనంటే యిష్టమని భ్రమపడ్డాను. మిమ్మల్ని నా జీవన భాగస్వామినిగా చేసుకోవాలనుకున్నాను పెళ్ళికి ముందే యీ విషయం తెలియటం కూడ మంచిదే అయింది మనసులేని మనువు చేసికొని జీవితాంతం బాధపడేదానివి మిస్ సుజాతా, మీ పెళ్ళికి మీ యింట్లో పెద్దవాళ్ళు ఒప్పుకోలేదా? నువ్వు ఊ, అంటే, మీ పెళ్ళి నేను దగ్గరుండి జరిపిస్తాను నీ మనసులో ," అతని మాటలు పూర్తికాకముందే సుజాత కుర్చీలో నుండి క్రిందపడిపోయింది రవి కంగారుగా లేచి ఆమెను పట్టుకున్నాడు. ఆమె స్పృహకోల్పోయింది శరీరమంతా చెమటతో తడిసి మంచుముద్దలా ఉంది. వెంకన్న గ్లాసుతో చన్నీళ్ళు తెచ్చాడు. రవి చేత్తో ఆమె ముఖంమీద చల్లేడు. రవి ఆమె తల తన ఒడిలో పెట్టుకుని కర్చీఫ్‌తో ముఖంమీద తడి తుడిచాడు ముంగురులు సవరించాడు. ఆమెకు స్పృహ వచ్చేవరకు అతని మనసు మనసులోలేదు ఆమె ఉద్దేశమేమిటో తెలియక, పరుషవాక్కులతో, ఆమె హృదయాన్ని గాయపరిచానని బాధపడసాగేడు.

"నీరసంగా ఉండారు. అమ్మగారికి తమరిమీద శానయిష్టం మొన్న ఆరింటికి ఎల్తే, మీ గురించి అడిగారు " వెంకన్న నెమ్మదిగా అన్నాడు.

"ఏమడిగారు? నువ్వేం చెప్పావ్?"రవి అడిగాడు.

"నేనే సుజాతమ్మగారూ మీరూ పెళ్ళి చేసుకోబోతున్నారా అని అడిగాను. అప్పుడనుకున్నాం, కాని యిప్పుడు అది జరగటంలేదని ఆమె బాధపడ్డారు తమరింట్లో ఒక్కరే ఉంటారా? యింకా ఎవరైనా ఉన్నారా? అని అడిగారు."

"వెంకన్నా, వాళ్ళింటికి నువ్వెందుకెళ్ళావ్?"

"తమరింటి దగ్గరనుండి వెళ్తుంటే సుజాతమ్మగారు కనబడితే ఎల్లాను మీ యింటి దగ్గరే, ఎదురుగా కనబడుతూనే ఉంటది వాళ్ళిల్లు. వాళ్ళమ్మగారూ, తనూ యిద్దరే ఉంటారు."

"అలాగా!" రవిమోహన్ ఆశ్చర్యంగా అన్నాడు.

చేతివాచీలో టైమ్ చూసుకుంటూ, ఆమెకు ఎప్పుడు స్పృహ వస్తుందా అని, ఆత్రంగా ఆమె ముఖంలోకి చూడసాగేడు. అరగంట తర్వాత సుజాత నెమ్మదిగా కళ్ళుతెరచి, రవి తన ముఖంలోకి చూస్తుంటే కంగారుపడి లేవబోయింది రవి, ఆమె భుజాలు రెండుచేతులతో నొక్కిపట్టి లేవనివ్వలేదు.




"నేనిప్పుడెక్కడున్నాను" తనలో తనే నెమ్మదిగా ప్రశ్నించుకుని కళ్ళతో పరిసరాలు అబ్జర్వ్ చెయ్యసాగింది వెంకన్న కాఫీ తీసుకువచ్చాడు.

"తర్వాత మాట్లాడుకోవచ్చు ముందు కాఫీ త్రాగు సుజా!" రవి గొంతు జాలిగా పలికింది సుజాత లేచి కూర్చుని కాఫీ త్రాగింది

"సుజా! నిన్ను మాటలతో బాధించానా?" రవి అనునయంగా అడిగాడు.

"నన్ను నమ్మండి. మధుగురించి నాకేమీ తెలియదు. అతనంటే నాకసహ్యం." సుజాత ఏడుస్తూ చెప్పింది

"నీ మాటలు నమ్ముతాను. అసలేంజరిగిందో చెప్పు సుజా." రవి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు ఆమె నెమ్మదిగా తనచేతిని విడిపించుకుని దూరంగా జరిగింది

"మీ పెద్దవాళ్ళకు మనపెళ్ళి యిష్టంలేదని, మీరిప్పుడే పెళ్ళిచేసుకోనన్నారని బాబాయి, మా అన్నయ్యతో చెప్పాడట నా బాడ్‌లక్ అని నాలో నేనే బాధపడ్డా అన్నయ్య వేరే సంబంధాలు చూస్తే పెళ్ళిచేసుకోనని చెప్పాను. అనాటినుండి మిమ్మల్నిమరచిపోలేక నాలో నేనే కుమిలిపోతున్నాను.

రెండు నెలల క్రితం ఒకనాటి రాత్రి ఎవరూలేని సమయంలో మధు నన్ను బలాత్కరించబోయాడు అతనిని బలంగా కొట్టి, కొరికి, గదిలోకి పారిపోయి తలుపేసుకున్నాను. కొంచెంసేపట్లో అన్నయ్యా, వదినా, సినిమాటికెట్స్ దొరకలేదని వచ్చేశారు జరిగినది విని, అన్నయ్య కోపంతో మధును చావుదెబ్బలు కొట్టాడు. ఆ రాత్రే మధు యిల్లు విడిచిపెట్టాడు ! ఆతర్వాత అన్నయ్యా,వదినా ఘర్షణపడ్డారు.

యింక అక్కడ ఉండటం యిష్టంలేక, వేరేయిల్లు అద్దెకు తీసికొని అమ్మా, నేనూ వచ్చేశాము." సుజాత చెప్పటం ఆపి రవి ముఖంలోకి చూసింది.

"మరి ఆ మాణిక్యాంబను ఎవరు పంపించారు?"

"ఏమో నాకు తెలియదు"

"మీ అన్నయ్య అత్తగారట ఆ మాణిక్యాంబ వచ్చి, నువ్వు నన్ను పెళ్ళిచేసుకోనని ఏడుస్తున్నావని, వాళ్ళబ్బాయి మధును ప్రేమించావని, మీ అమ్మగారూ, అన్నయ్య బాధపడుతున్నారని, నాకు వేరే సంబంధం చూసుకోమని తనను చెప్పమని పంపించారని చెప్పిందట. నా కీ విషయాలన్నీ మా నాన్నగారు లెటర్ రాశారు"

"నన్ను మధుకివ్వమని ఆవిడ, అన్నయ్యను అడిగితే యివ్వనన్నాడట. ఆ కోపం మనసులో ఉంచుకొని ఇంత సాహసాని కొడిగట్టి ఉంటుంది."

"మా నాన్నగారు నాకు వేరే సంబంధాలు చూస్తున్నారు. పదిరోజుల క్రితం వచ్చి సమ్మంధం చూశానని, పిల్ల బి ఎ చదివింది ఇరవై వేలు కట్నం, పెళ్ళి చూపులకు వెళ్దాం రమ్మన్నారు. నా మనసులో ఇంకా నీ మీద ఆశ చావలేదు. నిన్నుతప్ప వేరొకరిని పెళ్ళిచేసుకోనని, ఆయనను శ్రమపడి సమ్మంధాలు చూడవద్దని ఖచ్చితంగా చెప్పేశాను ఆయన అనుభవించు, నీ ఖర్మ అని కోపంగా వెళ్ళిపోయారు."

"మరి, మీ మారేజ్ సెటిలయిందన్నారు? సుజాత తన డౌట్‌ను వ్యక్త పరిచింది. రవి పకపక నవ్వి, నీ మనసులోని భావం ఏమిటో తెలిసికోవాలని అలా అన్నాను. తన స్థానంలో మరో స్త్రీ రావటాన్ని మీ ఆడవాళ్ళు సహించరు. నీకు కోపంవస్తే నామీద ఇష్టమున్నట్టు, లేకపోతే లేదని నిర్ణయించాలనుకున్నాను. నీవేమో అన్నిటికీ విరుద్ధంగా స్పృహ కోల్పోయావు" అని ఆమె ముఖాన్ని తన చేతులలోకి తీసుకొని కళ్ళలోకి ప్రేమగా చూసాడు

ఆమె కనురెప్పలు సిగ్గుతో వాలిపోయాయి. రవి ఆమెను తన హృదయానికి హత్తుకున్నాడు "సుజా, యిక ఎవరేమన్నా, ఎవరి కిష్టం లేకపోయినా నిన్ను నాదాన్ని చేసుకుంటాను పెద్ద ఆర్భాటం లేకుండా రిజిష్టర్ మారేజ్ చేసుకుందాము, ఏమంటావ్ ?" రవి ఆమెను అడిగాడు.

"మీ యిష్టం మీరెలా అంటే అలాగే." సుజాత తన అంగీకారాన్ని తెల్పింది.

"ఏమిటాలోచిస్తున్నావు సుజా ?"

"ఏమీలేదు. జరిగిన విషయాలన్నీ మా అన్నయ్యకు చెప్తే బాగుంటుందని."

"ఓస్ అంతేగా ! మీ అన్నయ్యతో అన్ని విషయాలూ చెప్పిన తర్వాతే మన మారేజ్ జరుగుతుంది ఓ.కే. ?"

"మీరు దైవసమానులు నా జీవితాన్ని పూజా సుమంగా మీ సేవకు అంకితంచేసి తరించాలని నా ఆశ." సుజాత ముఖం సంతోషంతో వెలిగి పోతున్నది.

"దేవీ, అభీష్ట సిద్ధిరస్తు." రవి నవ్వుతూ ఆమెను తన బాహుబంధంలో యిముడ్చుకున్నాడు అతని కౌగిలిలో ఆమె గువ్వలా యిమిడిపోయింది.

మధ్యాహ్నం సీ.యల్. తీసుకుని యింటికెళ్తానంది. రవి కార్లో తీసుకువెళ్ళి యింటి దగ్గర డ్రాప్‌చేసి వచ్చాడు.

## 14

గత రెండు నెలలలోనూ సుజాత అన్నగారింటికి ఒక్కసారి కూడా వెళ్ళ లేదు సుందరమ్మ మాత్రం అప్పుడప్పుడు బిస్కట్లు, చాక్‌లెట్లు తీసికెళ్ళి యిచ్చి మనవరాలిని కాసేపు ముద్దాడి వస్తున్నది. వసుంధరకు శ్రమ ఎక్కువైనా, ఎలాగో ఓపికపట్టి ఇంటిదగ్గర వంట, పాపపనులు చూసుకొని స్కూలుకు వెళ్తుండేది. యిప్పుడు స్కూలుకు శెలవులు కనుక యింటివగ్గరే ఉంటున్నది. పాపకు సంవత్సరం వెళ్ళింది. యిప్పుడిప్పుడే బుల్లిబుల్లి అడుగులేస్తున్నది. సుందరమ్మ వెళ్ళింతర్వాత, పాపను శ్రద్ధగా చూసేవాళ్ళు లేక చిక్కిపోయింది. కలర్‌కూడా కొంచెం తగ్గింది.

రెండు రోజులనుండి పాపకు జ్వరం. పాలు త్రాగటంలేదు. వసుంధరను అంటిపెట్టుకుని వదలటంలేదు. ఎప్పుడూ ఏడుస్తూ ఉంటుంది. అసలే ఎండలు మండిపోతున్నాయి. సుబ్బారావుకూడా కంగారుపడ్డాడు. బంతిలా ఉండే పాప పీలగా, నీరసంగా తయారైంది జ్వరం నూటనాల్గు ఉంటున్నది. వాంతులు, విరేచనాలు అవుతున్నాయి. కబురుచేస్తే సుందరమ్మ, సుజాత ఇద్దరూ వచ్చారు. పాప నీరసంగా పడుకుంది. సుందరమ్మ సలహాతో హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు. వసుంధర ఒకటే ఏడుపు. పాపకు బలమైన ఆహారం, టైమ్ ప్రకారం పాలు యివ్వకపోవటం వలన వీక్‌గా ఉందని డాక్టరు చెప్పింది డయేరియా అని చెప్పింది. ఇంజక్షన్ చేసింది సెలైన్ పెట్టారు. పాప చేతికి నీడిల్ గ్రుచ్చితే చూడలేనని సుందరమ్మ కళ్ళు తుడుచుకుంటూ బయటికి వచ్చేసింది.

సుబ్బారావు కావలసిన మందులు తెప్పించి, ఖర్చులకు వాడమని సుందరమ్మ

చేతికి వంద రూపాయలిచ్చి, సుజాతను తీసుకొని వెళ్ళిపోయాడు. సుజాత ఆ రోజు లీవ్ పెట్టి, యింటిదగ్గరే ఉండి వంటచేసి హాస్పిటల్ కు కారియర్ పంపించింది మధ్యాహ్నం రెండింటికి సెలైన్ ఎక్కించటం అయిపోయింది. సాయంత్రమయ్యేసరికి టెంపరేచర్ హండ్రెడ్ కు జారింది.

డాక్టరువచ్చి పాపను చూసితృప్తిగా నవ్వింది. వసుంధరను చూసి "పిల్లలను కనగానే సరికాదు. వాళ్ళను సక్రమంగా పెంచాలి. పాప ఆరోగ్యం ఏమీ బావుండలేదు ఎంతో జాగ్రత్తగా చూడాలి. రోజూ ఎగ్ బాయిల్ చేసి తినిపించండి. రెండుపూటలూ అన్నం తినిపించండి రోజుకు నాలుగుసార్లు మూడు గంటల కొకసారి పాలు పట్టండి. యీ టానిక్ రెండుపూటలూ రెండు చెంచాలు త్రాగించండి. సుందరమ్మగారూ, మీరుండీ పాపనిలా వదిలేశారేమిటి? సంవత్సరం నిండినా పాప బరువు యింకా నాల్గు కేజీ లే ఉంది వసుంధరా నిర్లక్ష్యంచేస్తే పాప దక్కటంకూడా కష్టమే తర్వాత బాధపడి చేసేదేమీలేదు. నీ హెల్త్ కూడా స్పాయిలవుతుంది రెస్ట్ లేకపోతే" అంటూ కొన్ని సలహాలూ, కొన్ని చివాట్లూ సమంగా రంగరించి డోస్ యిచ్చింది. సుందరమ్మ మౌనంగా ఊరుకుంది వసుంధర తలవంచుకుంది మర్నాటికి జ్వరం పూర్తిగా తగ్గింది పాప పాలుత్రాగి ఆడుకుంటున్నది సుందరమ్మ డాక్టరుకు బిల్లు పే చేసి కోడల్నీ, మనవరాల్నీ ఇంటికి తీసుకువచ్చింది.

రెండు రోజులుండి అమ్మాయి ఒంటరిగా ఉంది. యింక వెళ్తానని సుందరమ్మ కొడుకుతో, కోడలితో చెప్పి సుజాత దగ్గరకు వచ్చేసింది

మాణిక్యాంబకు, మధును వెళ్ళగొట్టారని, సుజాతను తన కోడలిగా చెయ్యలేదని, వసుంధరమీదా, సుబ్బారావుమీదా చాలా కోపంగా ఉంది. సమయం కోసం వేచివుంది సుందర్రామయ్య రిటైరయి రెండు నెలలయింది. యిల్లు గడవటంకూడా కష్టంగా ఉంది

వసుంధర శ్రీదేవికి సుస్తీగా ఉంది. వచ్చి చూచివెళ్ళమని లెటర్ రాసింది. లెటరందగానే మాణిక్యాంబ బట్టలు సర్దుకుని విజయవాడ వచ్చేసింది ఆమెను చూడగానే వసుంధరకు కొండంత ధైర్యం వచ్చింది ఆమె యిదివరకటిలా, దుర్బోధలు చెయ్యటంలేదు. పనిలో చేతనయిన సాయం చేస్తున్నది యింటి దగ్గర పూటగడవటం కష్టంగా ఉంది గనుక ఇక్కడే కొన్నాళ్ళపాటు ఉందామని ప్లాన్ వేసుకుంది వచ్చి యిరవై రోజులయినా వెళ్తానని అనటంలేదు. పనిలో చేతనయిన సాయం చేయటం, సుష్టుగా భోంచేసి ప్రక్కింటికో, ఎదురింటికో వెళ్ళి

కాలక్షేపంచేసి సాయంత్రానికి యిల్లు చేరుకునేది. ఆవిడ పద్ధతి వసుంధరక నచ్చకపోయినా ఏమీ అనలేకపోతున్నది

ఆ రోజు మధ్యాహ్నం సుబ్బారావు, వసుంధర భోంచేస్తున్నారు. మాణిక్యాం పాపను ఎత్తుకుని ప్రక్కింటికి వెళ్ళింది. యిదే సమయమని సుబ్బారావు భార్యన అడిగాడు

"మీ పిన్ని ఎప్పుడు వెళుతుంది ?"

"ఏమో నాకుమాత్రం ఏం తెలుసు ?" అంది వసుంధర

"వచ్చి యిరవై రోజులయింది వెళ్ళే సూచనలేమీ కన్పించటంలేదు.'

"అవునండీ తను వెళ్తాననటంలేదు వెళ్ళమని ఎలా చెప్పను !"

"ధరలు మండిపోతున్న యీ రోజుల్లో, యీవిడను కూర్చోబెట్టి ఎన్నాళ్ళు పెడతాము ? వెళ్ళమని చెప్పు "

"వెళ్ళమంటే ఏం బావుంటుందండీ? అదీగాక పాప్నెవరు చూస్తారు ! ఇప్పుడిప్పుడే పాప కాస్త కోలుకుంటున్నది."

"పాపను మా అమ్మదగ్గర కొన్నాళ్ళుంచుదాము."

"అదికాదండీ, అత్తయ్యను ఇక్కడికే వచ్చి ఉండమంటే బావుంటుందేమో!"

"మరి సుజాత ? ఒక్కతే ఎలా ఉంటుంది ?"

"యిద్దరినీ వచ్చెయ్యమనండి అందరం కలిసే ఉందాము."

"ఒకసారి నీ మాటలు నమ్మి, స్వగ్రామంనుండి వాళ్ళనిక్కడికి రప్పించాను. వాళ్ళను యింట్లోనుండి పంపించేవరకూ, నువ్వు నిద్రపోలేదు ఎక్కడో ఒకచోట హాయిగా ఉండనీ. మళ్ళీ వాళ్ళనిక్కడకు రమ్మనడం ఎందుకు?"

"మా పిన్ని మాటలు నమ్మి, మీ అమ్మగారినీ, చెల్లెల్నీ ద్వేషించాను వాళ్ళు వెళ్ళినప్పటినుండీ పశ్చాత్తాప పడుతూనే ఉన్నాను గొర్రె గొల్లవానిని నమ్మదు, కటికవాణ్ణి నమ్ముతుందన్నట్టు, ఆత్మీయులను దూరం చేసుకుని, మా పిన్నిని నమ్మినందుకు నన్ను క్షమించండి. మీ అమ్మగారినీ, సుజాతనూ తీసుకురండి." వసుంధర ప్రాధేయపడింది

"సుజాతకు ఆత్మాభిమానం, పట్టుదల, ఎక్కువ. మనం రమ్మంటే వస్తుందని నేననుకోను పాపనక్కడకు పంపిస్తే మనకు వచ్చేనష్టమేముంది?"

"మీరు నన్నర్థం చేసుకోవటంలేదు. మా పిన్ని మన యింట్లో ఉండి మనకే గోతులు త్రవ్వుతున్నది చాటుగా బియ్యం, పప్పులు, చిల్లరగా అమ్ముతున్న దట. ఇంటిగుట్టు వీధిన పడేస్తున్నది. నేను అత్తగారినీ, ఆడపడుచునూ

యింట్లోనుండి వెళ్ళగొట్టానని, పరమ గయ్యాళినని ప్రచారం చేస్తున్నదట. అందరూ నన్ను సూటి పోటి మాటలంటున్నారు "

"యిప్పటికైనా నిజం తెలుసుకున్నావన్నమాట. నీ కీ విషయాలన్నీ ఎవరు చెప్పారు?"

"మొన్నొక రోజు ప్రక్కింటివాళ్ళ పనిమనిషితో, పిన్ని పోట్లాడింది. మాటలనుబట్టి గ్రహించాను. తిన్న యింటి వాసాలు లెక్కపెట్టే రకం. ఎలాగైనా యీవిణ్ణి యింట్లోనుండి పంపించెయ్యాలి."

సుబ్బారావు చెయ్యికడుక్కుని లేచాడు. టవల్‌కు చెయ్యి తుడుచుకుంటూ ముందుగదిలోకి వచ్చేసరికి, పాప నెమ్మదిగా నడచి వస్తున్నది. మాణిక్యాంబ గోడప్రక్కగా నిలబడి ఉంది. సుబ్బారావామెను చూడగానే, ఆమె, తమ మాటలు వినే ఉంటుందనుకున్నాడు.

## 15

ఆ రాత్రి తల్లి దగ్గరకు వెళ్ళాక మాటల సందర్భంలో మాణిక్యాంబను గురించి వసుంధర చెప్పిన విషయాలు తల్లికీ, సుజాతకూ చెప్పాడు.

"అన్నయ్యా, ఆవిడ స్వభావం మొదటినుండీ అంతే. మనమంతగా పట్టించుకో లేదుగాని ఆవిడ పాపభీతిలేని మనిషి." సుజాత ఉద్రేకంగా అంది.

"మీ వదినకు, తనకే తెలిసిరావాలని అలా వదిలేశాను. ఆవిడమీద నా కెప్పుడూ సదభిప్రాయం లేదమ్మా." సుబ్బారావు తల్లివంక చూసాడు.

"ఆవిడ గొడవ మనకెందుకులే, పాప ఎలా ఉంది?" సుందరమ్మ అడిగింది.

"పాప యిప్పుడు కులాసాగానే ఉంది. ఫర్వాలేదు మీ కోడలు నిన్నూ, చెల్లినీ వచ్చెయ్యమనండి, అందరం కలిసే ఉందాం అంటున్నది. యిప్పటికి గ్రహణం విడిచింది, మామూలు మనిషయింది." సుబ్బారావుతో పాటు సుజాత కూడ నవ్వింది.

"అక్కడికెందుకన్నయ్యా? పాపను యిక్కడికే తీసుకురా అమ్మ, నేను జాగ్రత్తగా చూసుకుంటాము వదినను అప్పుడప్పుడు వచ్చి చూసి వెళ్ళమని చెప్పు." సుజాత స్థిరంగా పలికింది.

"అవును బాబూ, శ్రీదేవినినా దగ్గర వదలిపెట్టు, అదే బావుంటుంది." సుందరమ్మ కూడ అలా అనేసరికి సుబ్బారావు, వాళ్ళిద్దరినీ రమ్మని బలవంత పెట్టలేదు.

"అన్నయ్యా, రవిమోహన్‌గారు లేరూ."

సుబ్బారావు చెల్లెలి ముఖంలోకి చూసి, "నిన్నివ్వాలనుకున్నాము, లోగడ, ఆయనేనా?" అని అడిగాడు.

"ఆయనే, మా ఆఫీసర్ "

"అతనిక్కడే పనిచేస్తున్నాడా? నీతో మాట్లాడతాడా?"

"ఆఁ నేనాయనను పెళ్ళాడనని ఏడుస్తూ కూచున్నానట. మాణిక్యాంబ కొడుకు, మధుని ప్రేమించానట నువ్వా, అమ్మ, ఏమి చెయ్యాలో తోచక వేరే సంబంధం చూసుకోమని చెప్పమని, మాణిక్యాంబను, రామభద్రయ్యగారింటికి పంపించారట "

"చెల్లీ, యివన్నీ నీ కెవరు చెప్పారు?" సుబ్బారావు గొంతు కోపమూ, ఆశ్చర్యమూ మిళితం కాగా ఖంగున మ్రోగింది

"ఏమిటి నువ్ మాట్లాడేది సుజా" సుందరమ్మ ఆత్రంగా అడిగింది.

"ఈ విషయాలన్నీ, స్వయంగా, రవిగారే నాతో చెప్పారు." సుజాత సీరియస్‌గా చెప్పింది.

"ఆ మాణిక్యాంబ ఎంతకు తెగించింది? పాపాత్మురాలు." సుందరమ్మ ఆశ్చర్యపడింది

"బాబాయ్‌కి, అందుకే అంతకోపం వచ్చి ఉంటుంది. యిప్పుడే వెళ్ళి ఆ డెవిల్‌కి బుద్ధి చెబుతాను " సుబ్బారావు లేచాడు.

"అలా రాసిపెట్టి ఉంది ఆవిజ్ఞని ఏం ప్రయోజనం ముందు సుజాత పెళ్ళి ఎలా చెయ్యాలో ఆలోచించు " సుందరమ్మ, కొడుక్కి కర్తవ్యాన్ని ఉపదేశించింది.

"సుజా, ఆయన యింకేమన్నారు" సుబ్బారావు మళ్ళీ కూర్చుని అడిగాడు.

"ఏ ఆర్భాటాలూ లేకుండా, రిజిష్టర్ మారేజ్ చేసుకుందామన్నారన్నయ్యా." సుజాత తలవంచుకునే చెప్పింది

"మనకున్నంతలో పెళ్ళి ఘనంగా జరిపిస్తానమ్మా. ముందీ విషయం వాళ్ళ తల్లిదండ్రులకు తెలియపరచమని చెప్పాలి "

"అవన్నీ ఆయన చూసుకుంటారు జరిగిన విషయాలన్నీ నీతో చెప్పి, నీ అంగీకారంతోనే సింపుల్‌గా రిజిష్టర్ మారేజ్ చేసుకుందామన్నారు."

"అతని యిష్టప్రకారమే కానివ్వండి ముందీవిషయం మీ బాబాయికి తెలియ జెయ్యి బాబూ " సుందరమ్మ సుబ్బారావుతో చెప్పింది.

సుబ్బారావు వెళ్ళటానికి లేచాడు సుజాత, సుందరమ్మ, అతని వెనుక, గేటు వరకూ వచ్చారు

"రేపు సాయంత్రం ఒకసారి రా అన్నయ్యా నువ్వు వస్తానంటే రవిగారిని పిలిపిస్తాను. అన్ని విషయాలూ మాట్లాడుదురుగాని."

"అలాగేనమ్మా. పిలిపించు. రేపు సాయంత్రం అయిదింటికి తప్పకుండా వస్తాను."

"మీ అత్తగారినిగాని, కోడల్నిగాని ఏమీ అనకు. దేనికైనా కాలం కలిసి రావాలి నీ చెల్లెలు ఒక యింటిదవుతున్నందుకు సంతోషించు నాయనా." సుందరమ్మ కొడుకును శాంతపరిచింది.

సుబ్బారావు వడిగా నడుస్తూ వెళ్ళిపోయాడు. సుజాత, సుందరమ్మ గేటు మూసి లోపలికి వచ్చేశారు.

మరునాడు సుజాత లంచ్‌టైమ్‌లో, రవి ఆఫీస్ రూమ్‌కు వెళ్ళి, తన అన్నయ్య వస్తాడు, మాట్లాడటానికి, సాయంత్రం అయిదింటికి రమ్మని రిక్వెస్ట్ చేసింది. రవి ఓ కే. అన్నాడు

సుబ్బారావు నాల్గున్నరకే స్వీట్సూ, హాటూ, ఓ డజన్ చక్కెర కేళీలూ బాస్కెట్‌తో స్కూటర్ డిక్కీలో వేసి తీసుకువచ్చాడు.

సుజాత పర్పుల్ కలర్ అమెరికన్ జార్జెట్ చీర, మాచింగ్ బ్లౌజు ధరించింది. కుడివైపు పాపిడితీసి, తన ఒత్తైన నొక్కుల జుట్టు అందంగా దువ్వుకుని లూజ్‌గా జడ వేసుకుంది. కుడివైపు చెవికి కొంచెం క్రిందుగా, ఎర్రగులాబీ పువ్వొకటి పిన్‌తో అందంగా అమర్చుకుంది. ముఖానికి వానిషింగ్ క్రీమ్ రాసుకుని, లైట్‌గా పౌడర్ వేసుకుంది. కళ్ళకు కాటుక సన్నగా పెట్టుకుని ఐబ్రో పెన్సిల్‌తో కొసలు దిద్దుకుంది. నుదుట ఎర్రని తిలకం గుండ్రంగా కాస్త పెద్ద చుక్క దిద్దుకుంది. చెవులకు ఎర్రరాళ్ళ జూకాలు, మెడలో ఎర్రరాళ్ళ లాకెట్ కల్గిన సన్నని ఒంటిపేట గొలుసు. ఎడమచేతికి వాచీ, వ్రేలికి ఎర్రరాతి ఉంగరం, కుడిచేతికి నాల్గు బంగారు గాజుల మధ్య రెండు ఎర్రటి గ్లాస్ బాంగిల్స్‌తో సంధ్యాసుందరిలా తయారయింది. పచ్చని సుజాత దేహానికి ఆ అలంకరణ చాలా బాగా నప్పింది.

ముందుగది అంతా నీట్‌గా సర్దింది. టేబిల్‌మీద కొత్త టేబిల్ క్లాత్ పరచి దానిమీద ఫ్లవర్ వాజులో రంగురంగుల తాజా పూవులు అమర్చింది. రౌండ్‌గా కుర్చీలువేసి, మధ్యగా టీపాయ్ ఉంచింది.

సుందరమ్మ చక్కెర పొంగలి తయారుచేసింది. పకోడీలు చేద్దామనుకుంటుండగా సుబ్బారావు వచ్చాడు. సుజాతను చూసి, "ఎంత అందంగా ఉంది! దేవకన్యలా మెరిసిపోతున్నది. చెల్లి అందంచూసే, రవి, మనసు మార్చుకోలేకపోయాడు," అని తనలోనే అనుకున్నాడు. సుబ్బారావు స్కూటర్ లాక్ చేసి

వచ్చాడు అతని వెనుకనే పని కుర్రవాడు, బాస్కెట్, ఐస్ ముక్కలుంచిన ఫ్లాస్క్ తీసుకు వచ్చాడు

అయిదింటికి రవి వచ్చాడు అతని పంక్చువాలిటీని సుజాత మనసులోనే మెచ్చుకుంది. సుబ్బారావు, అతనిని నవ్వుతూ ఆహ్వానించాడు. అతను బ్లూ అండ్ వైట్ డ్రస్ వేసుకున్నాడు. ఫుల్‌బూట్, కూలింగ్ గ్లాసెస్‌తో, సంధ్యవేళ నీరెండలో హుందాగా నడచి వస్తుంటే, సుజాత డోర్ కర్టెన్ చాటునుండి చూసి, పేరు మాత్రం రవి గాని, మబ్బుల మాటున చందమామలా ఉన్నాడను కుంది. అతను లోపలికి రాగానే "గుడీవెనింగ్ సర్" అని విష్‌చేసింది అతను కూడ "వెరీ గుడీవెనింగ్," అంటూ కుర్చీలో కూర్చున్నాడు సుబ్బారావు తను కూడ అతని ప్రక్కనే కుర్చీలో కూర్చున్నాడు రవి, తలుపునానుకుని నిలబడిన సుజాతమీద నుండి దృష్టి మరల్చలేకపోయాడు తల్లి పిలవటంతో సుజాత లోపలికెళ్ళింది.

పనికుర్రాడు, ప్లేట్లలో, ప్లమ్‌కేక్సూ, లడ్డూలు, వేయించిన జీడిపప్పు, చక్కెరకేళీ తీసుకువచ్చి టీపాయ్‌మీద పెట్టాడు. రవి, సుబ్బారావు యిద్దరూ తింటుంటే, మరిరెండు ప్లేట్లతో చక్కెర పొంగలి తీసుకువచ్చాడు. కమ్మని నేతి వాసన ఘుమాయించుతుంటే స్పూన్‌తో యిద్దరూ చక్కెర పొంగలి తిని చల్లని మంచినీళ్ళు త్రాగారు ఇంతలో రెండుగ్లాసులతో ఐస్‌వాటర్‌లో ఆరంజ్ స్క్వాష్ కలిపినది తీసుకువచ్చి యిచ్చాడు. యిద్దరూ త్రాగి, గ్లాసులు టీపాయ్ మీద పెట్టేసరికి వక్కపొడి భరిణ తీసుకువచ్చి యిద్దరికీ యిచ్చాడు రవి ఏం చెప్తాడోనని అందరూ, అతని వైపు చూస్తున్నారు. రవి వక్కపొడి నములుతూ ఎక్కడ మొదలుపెట్టాలా, ఎలా చెప్పాలా అని ఆలోచిస్తున్నాడు.

"మా చెల్లి అన్ని విషయాలూ చెప్పింది. సుజాత చెప్పేవరకూ నాకీ విషయా లేవీ తెలియవు మీరు యిష్టం లేదన్నప్పుడు, వెంటపడటం ఎందుకని కామ్‌గా ఊరుకున్నాను," అన్నాడు సుబ్బారావు నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

రవి సుజాతవేపు కృతజ్ఞతగా చూసాడు. సుజాత, అంతవరకూ అతనినే చూస్తున్నదల్లా, అతనివంక సూటిగా చూడలేక, కనురెప్పలు బరువుగా వాల్చు కుంది. అతని చూపులు, మూసిన ఆమె కనురెప్పల కాటుకరేఖమీద ఒక్క క్షణం, ఆ తర్వాత సిగ్గుతో అరుణిమ దాల్చిన ఆమె నున్నని చెక్కిళ్ళమీద, మధురాధరాలమీద ఒక్కొక్క క్షణం నిలిచాయి.

రవి షర్ట్ పోకెట్‌లో నుండి లెటర్‌తీసి సుబ్బారావు కిచ్చి, "యిది చదవండి.

సుజాత చెప్పేవరకూ, యిందులోని విషయాలు తప్ప నా కేమీ తెలియదు," అన్నాడు.

సుబ్బారావు లెటర్ ఆసాంతం చదివాడు. అది రవికి, తండ్రి, అగష్టు ఒకటవ తేదీన రాసిన లెటరు. మాణిక్యాంబ చెప్పిన ఫాల్స్ ఇన్ఫర్మేషన్ అంతా వివరంగా రాసి, సుజాతను మరచిపొమ్మని, మరో సంబంధం చూస్తామని రాశారు. సుబ్బారావు ముఖం కోపంతో ఎర్రబడింది.

"మీరు యిప్పటికైనా బయటపెట్టబట్టి మాకు నిజం తెలిసింది. ఆ మాణిక్యాంబతో మీకు నిజం చెప్పిస్తాను. నా చెల్లెలిమీద వేసిన అభాండాలకు మీ ఎదుట క్షమాపణ చెప్పిస్తా.ను"

"మీరింకేమీ చెయ్యనవసరంలేదు. నేను సుజాత మాటలను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను. మీరూ, మీ అమ్మగారూ యాక్సెప్ట్ చేస్తే సుజాతను నా లైఫ్ పార్ట్నర్‌గా స్వీకరిస్తాను."

"మీది చాలా మంచి మనసు. ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో అర్థంకావటం లేదు." సుబ్బారావు రవి రెండుచేతులూ పట్టుకున్నాడు. రవి సుజాతవైపు చూసాడు. ఆమె సిగ్గుతో గులాబీ మొగ్గలా ముడుచుకుపోయింది.

"యింతకాలం జాప్యంచేసి, యిప్పుడు మీ చెల్లెలినివ్వమని అడిగితే కాదన నందుకు నేను మీకు కృతజ్ఞతలు చెప్పాలి." రవి నవ్వుతూ అన్నాడు

"మీ యిద్దరికీ ఘనంగా పెళ్ళి జరిపిస్తాను యీ జన్మలో సుజాత, మరొకరిని పెళ్ళాడుతుందనుకోలేదు. రవీ, మా హృదయాలలో క్రమ్మిన బాధలనే కారు మేఘాలను, శాంతికిరణాలను ప్రసరింపజేసి, మా జీవితాలలో ఆనందమనే వెల్గును ప్రసాదించారు. మీకు నా కృతజ్ఞతలు." సుబ్బారావు రవి కళ్ళలోకి కృతజ్ఞతగా చూసాడు.

"మీరు నన్ను ఆకాశానికెత్తేస్తున్నారు. నాదొక చిన్న రిక్వెస్ట్. కట్నాలూ, కానుకలూ, లాంఛనాలూ, మంత్రాలూ, మేళ తాళాలూ, యివేమీ పెట్టుకోవద్దు. వచ్చే శుక్రవారం, రిజిష్ట్రారాఫీస్‌లో పెళ్ళి చేసుకుంటాము. మీరు అన్యధా భావించ వద్దు."

"మీ యిష్టప్రకారమే కానివ్వండి. ఆ రోజు సాయంత్రం రిసెప్షన్ ఎరేంజ్ చేద్దాం. ఏమంటారు?" సుబ్బారావడిగాడు.

"ఓ.కే ఐ హేవ్ నో అబ్జక్షన్." రవి అంగీకారాన్ని తెలిపాడు.

రవి యింక వెళ్తానని లేచాడు. సుబ్బారావు వీధి చివరివరకూ పంపించి శెలవు తీసుకున్నాడు




# 16

సుబ్బారావు యీ శుభవార్త భార్యచెవిని వేద్దామని త్వరగా యింటికి వెళ్ళాడు. అతను వెళ్ళేసరికి వసుంధర పాపను ఒళ్ళోపెట్టుకుని కుర్చీలో కూర్చుంది. సుబ్బారావు దగ్గరగా వెళ్ళాడు ఆమె రెండు చెంపలమీద నుండి కన్నీరు ధారగా కారుతున్నది సుబ్బారావు దగ్గరకు వెళ్ళి, ఒక చెయ్యి కుర్చీ మీదవేసి, ఆమెమీదకు వంగి అడిగాడు.

"ఎందుకు వసూ, ఏడుస్తున్నావ్? నిన్ను ఎవరేమన్నారు? మీ పిన్ని ఏది?"

"గాజులు కన్పించటం లేదండీ" వసుంధర ఏడుస్తూ చెప్పింది.

"రెండు వేలు పెట్టి మొన్ననేకదా చేయించింది. సంవత్సరం కూడా సరిగా పెట్టుకోలేదు. అంత అజాగ్రత్తగా ఎక్కడ పడేశావ్?"

"స్నానానికి వెళ్తూ, తీసి డ్రాయర్ సొరుగులో పెట్టాను స్నానంచేసి, వచ్చి చూస్తే లేవు."

"మనింటికి ఎవరైనా వచ్చారా?"

"ఎవరూ రాలేదండి. నేను పెట్టినప్పుడు మా పిన్ని మాత్రమే ఉంది"

"ఆవిడ ఎక్కడుంది? ఎవరింటికైనా వెళ్ళిందా?"

"నేను బాత్‌రూమ్ నుండి వచ్చేసరికే లేదు. ఎక్కడి కెళ్ళిందో తెలియదు"

సుబ్బారావు స్కూటర్ స్టార్ట్ చేశాడు. స్పీడ్‌గా పోనిచ్చి అయిదు నిమిషాలలో బస్టాండు చేరుకున్నాడు స్కూటర్ లాక్‌చేసి, లోపలికెళ్ళాడు. ఉయ్యూరు,

పామర్రు మీదుగా గుడివాడ వెళ్ళేబస్సు, ఆరవ నంబరు ప్లాట్‌ఫారం మీద కదలటానికి సిద్ధంగా ఉంది. సుబ్బారావు పరిగెత్తి బస్సెక్కాడు మాణిక్యాంబ ఫ్రంట్ సీట్లో కూర్చుని ఉంది

"వెళ్దాం రండి యింటికి" మాణిక్యాంబ సీటు దగ్గర నిలబడి అన్నాడు

"నేను రాను మీ మామగారు ఎలా ఉన్నారో, పిల్లలు ఏం బెంగపెట్టుకున్నారో నేను వెళ్ళాలి"

"అవన్నీ తర్వాత రేపుదయం వెళ్ళొచ్చు. ముందు బస్ దిగండి"

"నేను రానంటుంటే ఏమిటా పట్టుదల, నేను వెళ్ళాలి మళ్ళీ వారంరోజుల్లో వస్తాలే" మాణిక్యాంబ నిర్లక్ష్యంగా జవాబు చెప్పింది

"మర్యాదగా వస్తావా? లేక పోలీస్ రిపోర్ట్ యివ్వమంటావా?"

ఆ మాటతో మాణిక్యాంబ కంగారుపడింది కంగారు తనలోనే దాచుకుని పైకి గంభీరంగా, "రిపోర్టిస్తావా? యివ్వు. నేను నీ సొమ్మేమీ ఎత్తుకుపోవటం లేదు. నీ బెదిరింపులకు నేను లొంగేదాన్ని కాను," అంది

"ఎత్తుకుపోతున్నదీ, లేనిదీ, నీకూ, నాకూ తెలుసు ముందు దిగుతావా? బలవంతంగా దించెయ్యమంటావా?" మాణిక్యాంబ చేతిలోని సంచీ లాక్కున్నాడు

మాణిక్యాంబ తప్పనిసరిగా బస్ దిగి అతనివెనక నడిచి బస్టాండ్ బయటకు వచ్చింది రిక్షా మాట్లాడి ఆమెను ఎక్కించి, సంచీని స్కూటర్ డిక్కీలో వేసి యింటి తీసుకువచ్చాడు రిక్షా దిగి లోనికి వస్తూనే మాణిక్యాంబ శోకాలుపెట్టింది "అమ్మా, కష్టంలో ఉన్నావని ఆదుకుందామని వచ్చాను కూతురి సొమ్ము తింటానా? ఆఖరికి మీ ఆయన నాకు దొంగతనం అంటగట్టాడు నీ గాజులు నేను తీశానట. నా మీద నింద వేశాడమ్మా."

"తీస్తే తీశావ్‌లే పిన్నీ. మర్యాదగా నా గాజులు నాకిచ్చి వెళ్ళు యింక జన్మలో నా గడప త్రొక్కకు" వసుంధర, మాణిక్యాంబకు దూరంగా జరిగి అంది

"నీ గాజులు నాకేం తెలుసమ్మా మీ అత్త తీసిందేమో, మీ ఆడబడుచు కివ్వటానికి వాళ్ళు దొంగలు. దొంగతనం నా మీదకు నెడుతున్నారే తల్లీ" వసుంధర చేతులు పట్టుకుంటుంటే విడిపించుకుని దూరంగా జరిగింది

"నువ్వే తీశావని తేలిపోయింది నువ్వు తియ్యకపోతే, గాజులు పోయాయని నీ కెలా తెలుసు నేను నీ కే విషయాలూ చెప్పలేదే" అని సుబ్బారావు ఆమె

సంచీలోని బట్టలన్నీ తీశాడు. చీర మడతలలో రెండు వందరూపాయల నోట్లు, వసుంధర గాజులు, కన్పించాయి అది చూసి మాణిక్యాంబ తెల్లముఖం వేసింది ఆ తర్వాత తలొంచుకుంది. సుబ్బారావు డబ్బు తన జేబులో పెట్టుకుని, గాజులు వసుంధర కిచ్చాడు. ఆమె ముఖం సంతోషంతో వెలిగింది మాణిక్యాంబ ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు నీరసంగా గోడకు జారగిలబడింది.

"నీకు మేం చేసిన అపకారమేమిటి ? మా మీద ఎందుకు పగబట్టావ్? సుజాత పెళ్ళిసంబంధం ఎందుకు చెడగొట్టావ్? లేనిపోనివి చెప్పి వసూ మనసెందుకు పాడుచేశావ్? మా మీద నీకెందుకింత కక్ష? నా భార్యను గురించి దుష్ప్రచారం ఎందుకు చేశావో చెప్పు లేకపోతే నీ ప్రాణాలు దక్కవు జాగ్రత్త," అని సుబ్బారావు గుడ్లురిమాడు.

"నీవు చిన్నవాడివి ఇవి చేతులుకావు కాళ్ళనుకో నన్ను క్షమించమని అర్థిస్తున్నాను. సుజాతను మధుకివ్వనన్నారని యీ పాపాలన్నీ చేశాను నువ్వు క్షమించానంటే యీ రాత్రికే వెళ్ళిపోతాను. లేదంటే కృష్ణలో పడి ప్రాణాలు పోగొట్టుకుంటాను," అంటూ సుబ్బారావు రెండు చేతులూ పట్టుకుని ఏడ్చింది.

"వయసులో నాకంటే చాలా పెద్దదానివి. నా భార్యకు తల్లిలాంటి దానివి. అంతేకాదు, భర్త, కొడుకులూ ఎవరూ దగ్గరలేని, ఒంటరిగా ఉన్న ఆడదానివి. అందుకే నిన్ను క్షమించి విడిచిపెడుతున్నాను మామగారి ముఖంచూచి విడిచి పెడుతున్నాననే విషయం మరచిపోవద్దు యీ రాత్రికే వెళ్ళిపోయి, రేపు రామభద్రయ్య గారింటికెళ్ళి తప్పు ఒప్పుకొని క్షమాపణ వేడుకో. యింక నువ్వెళ్ళొచ్చు" సుబ్బారావు ముఖం వాచేలా, చీవాట్లు పెట్టాడు ఆ రాత్రే మాణిక్యాంబ వెళ్ళిపోయింది

భర్తతో జరిగిన విషయాలు కొన్ని కొన్ని చెప్పింది సుందరామయ్య "పాపిష్టిదానా! నీ ముఖం చూడరాదు ఆ రామభద్రయ్యను క్షమించమని అడుగు, వెళ్ళు," అని భార్యను ఆజ్ఞాపించాడు. మాణిక్యాంబ ఏడుస్తూ కూర్చుంది. కాని కదల్లేదు నువ్వు కూర్చుంటే నాకెలా తప్పుతుంది? అని, అప్పటికప్పుడే వెళ్ళటానికి బస్ లేక, మర్నాటి ఉదయం వెళ్ళాడు.

సుందరామయ్యగారు చెప్పిన విషయాలు విన్న రామభద్రయ్యగారికి ఆనందమూ, ఆశ్చర్యమూ కలిగాయి "ఎప్పుడో పది నెలల క్రితం జరగవలసిన వివాహం యిన్నాళ్ళూ వాయిదా పడింది ఎన్ని సంబంధాలు చూసినా, మావాడు

ససేమిరా చేసుకోనన్నాడు. అసలీ జన్మలో వాడికి పెళ్ళవుతుందనుకోలేదు. విధి బలీయం," అన్నారు

"ఆ అమ్మాయిని చూసినప్పుడే అనుకున్నాను. కట్నానికేమొచ్చిందిలే సాంప్రదాయమైన కుటుంబం. చదువూ, సంస్కారం, అందం, వినయ విధేయతలు గల పిల్ల, భార్యకావటం మన రవి అదృష్టమని. మీరిప్పుడే వెళ్ళి, అబ్బాయితో అన్ని విషయాలూ చెప్పండి." భర్తతో అంది శకుంతల.

"యింత ఘోరమైన అపచారంచేసి, మిమ్మల్ని క్షమించమని అడగటానికి ముఖం చెల్లక ఏడుస్తూ కూర్చుంది నా భార్య తరపున మిమ్మల్ని క్షమాపణ కోరడానికి వచ్చాను జరిగినది పీడకలగా మరచిపోయి, నా స్నేహితుడు రాఘవరావు కూతురు, సుగుణసుందరి అయిన చిరంజీవి సౌభాగ్యవతి సుజాతను మీ కోడలిగా స్వీకరించమని అర్థిస్తున్నాను" సుందరామయ్య కంఠం రుద్ధమయింది.

"మీరేమీ బాధపడకండి అంతా దైవలీల దేనికైనా టైమ్‌రావాలి. సూర్యోదయం కాగానే మబ్బుతెరలు వాటంతటవే తొలగిపోతాయి. సుజాత మా కోడలయినట్టే. మీరింకే సందేహాలూ పెట్టుకోవద్దు ఒకరిని క్షమించే హక్కు మానవ మాత్రుడనైన నాకెక్కడిది? అందరినీ క్షమించేవాడు, తప్పొప్పులను సమంగా చూడగలవాడు ఆ సర్వాంతర్యామి ఒక్కడే." రామభద్రయ్య ఆవేశంగా అన్నారు.

శకుంతల యిద్దరికీ కాఫీ పంపించింది. కాఫీ త్రాగి సుందరామయ్యగారు వెళ్ళిపోయారు.

రామభద్రయ్యగారు, శకుంతల చాలాసేపు వరండాలోనే కూర్చున్నారు. వారి మనసులు ప్రశాంతంగా ఉన్నాయి యిన్నాళ్ళకు రవి ఒక యింటివాడవుతున్నాడు తమ బాధ్యత నెరవేరబోతున్నదని వారికి మహదానందంగా ఉన్నది. బాలభానుని బంగారు కిరణాలు, జగత్తులోని చీకటులను పారద్రోలి, నూత్న కాంతులతో ప్రజ్వలింప జేస్తున్నాయి. రోజూ చూచేవే అయినా యీ రోజు, ఆయేడూ వారికి శాంతికిరణాలుగా తోస్తున్నాయి.

"అబ్బాయి దగ్గరకు యీ రోజే వెళ్ళి, వాళ్ళతోకూడ మాట్లాడి ముహూర్తం పెట్టించండి." శకుంతల భర్తకు సలహా యిచ్చింది.

"మీ ఆడవాళ్ళకు అంతా తొందర. ఈ రోజు షుగర్ ఫాక్టరీ బోర్డ్‌మీటింగ్. నాకు వెళ్ళటానికి కుదరదు రేపు కూడా వీలుపడదు రెండురోజులాగి వెళ్తాలే.




అయినా, ఆడపిల్లవాళ్ళు వాళ్ళు, వాళ్ళకులేని తొందర మనకు దేనికి?" రామభద్రయ్య, భార్య ఏమంటుందోనని అన్నాడు.

"మీ పట్టుదలలు కట్టిపెట్టండి. యిన్నాళ్ళ జాప్యం చాలు. రవి బ్రహ్మచారిగా ఉండిపోతాడేమోనని ఎంత భయపడ్డానో మీకేం తెలుసు?"

"నువ్వేమంటావోనని అలా అన్నానుగాని, నీకే గాని నాకు లేదూ బాధ. వీలు చూసుకొని వెళ్తాలేవోయ్ భార్యామణీ." రామభద్రయ్యగారు నవ్వేరు.

బుధవారంనాడు రవి దగ్గరనుండి లెటరు వచ్చింది రామభద్రయ్యగారు, కొడుకు ఏం రాశాడోనని ఆత్రంగా విప్పి చదివారు.

విజయవాడ
మే 7

ప్రియమైన నాన్నగారికి-

రవి నమస్కరించి వ్రాయునది. నేనిక్కడ క్షేమంగా ఉన్నాను. అమ్మా, మీరూ క్షేమమని విశ్వసిస్తాను. యింటికి వద్దామంటే వీలుపడలేదు. మీరు, అమ్మ, శుక్రవారం, పదవతేదీ, ఉదయం ఫస్ట్‌బస్‌కు బయల్దేరి రండి. మీతో చెప్పవలసిన విషయాలు చాలా ఉన్నాయి. అమ్మకు నమస్కారాలు. మీకోసం ఎదురు చూస్తుంటాను తప్పక రాగలరు అశ్రద్ధ చేయవద్దు

ఇక ఉంటాను,
మీ ప్రియమైన కుమారుడు,
రవిమోహన్.

లెటర్ చదవటం పూర్తిచేసి రామభద్రయ్యగారు, భార్యను పిలిచి చూపించారు

"యింకా రెండు ర్రోజులేగా. ఈవేళ ఎనిమిది. శుక్రవారమే వెళదాం. ఏమంటావ్?" భార్యనడిగారు

"నేనేమంటాను? అంతా మీ యిష్టం శుక్రవారమే వెళదాంలెండి రమ్మని మరీ మరీ రాశాడుగా ఆ రోజు దశమి, నేను వెళ్ళి, సుందరమ్మగారితోను, సుజాత తోను మాట్లాడివస్తాను వెంకట్రామయ్య అన్నయ్యగారిని పిలిపించండి. ఆయనను కూడ తీసికెళ్దాము"

"నిజమే మనం వెళ్ళి అడిగేకంటే, ఆయనను పంపిస్తే బావుంటుంది." రామభద్రయ్యగారు చీటి వ్రాసి యిచ్చి వెంకట్రామయ్యగారి కోసం నౌకరును పంపించారు.

* * *

శుక్రవారం ఉదయం తొమ్మిది గంటలకు ఆటో దిగిన తల్లిదండ్రులను, వెంకట్రామయ్యగారిని, రవి సాదరంగా ఆహ్వానించాడు. శకుంతల ఆ యిల్లు చూచి, యింత యింట్లో ఒక్కడూ ఉంటున్నాడు ఎన్ని ఉన్నా, ఆడ దక్షత లేక పోతే యింటికి కళ ఉండదు. పెళ్ళిచేసుకుని బిడ్డా పాపలతో కళకళలాడవలసింది, యిలా ఉన్నాడు భగవంతుని దయవలన యిప్పటికైనా ఒక యింటివాడయితే తనకదే పదివేలు. రవి ఏమంటాడో! యిలా ఆలోచించసాగింది యింతలో నౌకరు బాత్‌రూమ్‌లో వేడినీళ్ళు పెడుతుంటే, మగవాళ్ళిద్దరూ స్నానాలుచేశారు. "నీళ్ళు పెట్టానమ్మగారూ, స్నానంచేయండి," అన్న పిలుపుతో శకుంతల ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టి స్నానానికి వెళ్ళింది

హోటల్‌నుండి కాఫీ, టిఫిన్ తెప్పించి ముగ్గురికీ పెట్టించాడు తను డ్రెస్సప్పయి, కాసేపు రెస్ట్ తీసుకోండి, యిప్పుడే వస్తానని చెప్పి రవి కార్లో వెళ్ళిపోయాడు.

పది నిముషాల్లో మళ్ళీ వచ్చాడు అతని వెనుక, సుబ్బారావు, వసుంధర ఉన్నారు. వాళ్ళను చూడగానే, అంతా అర్థమయినట్టు రామభద్రయ్యగారు, "రావోయ్, బహుకాలదర్శనం అంతా కులాసా." అని కుశలప్రశ్న లడిగారు. సుబ్బారావు ఆయనకు నమస్కరించాడు.

వసుంధర, శకుంతల దగ్గరకు వెళ్ళింది "మా పిన్ని ఆడిన నాటకం వలన విడిపోవలసిన సంబంధం దైవికంగా, మళ్ళీ కలవబోతున్నాము. ఈ శుభ




సమయంలో ఆమె తరపున మిమ్మల్ని క్షమాపణ కోరుతున్నానండీ," అని వసుంధర శకుంతల రెండు చేతులూ పట్టుకుంది

"యిందులో క్షమించటానికేముందమ్మా. సూర్యోదయమయింది, మబ్బులు విడిపోయాయి అంతే" శకుంతల హాస్యంగా అంది.

"నిన్ను సంప్రదించకుండా, మీ అత్తగారి మాటలు నమ్మి, ఒ[illegible] పెటిలయిన మారేజ్ కాన్సిల్ చేశాను. సుందర్రామయ్యగారు వచ్చి నిజం చెప్పినప్పటినుండీ, రావాలనుకుంటున్నాను. వచ్చి నీతో జరిగిన విషయాలు చెప్పి, ముహూర్తం పెట్టించాలనుకున్నాను." రామభద్రయ్య సుబ్బారావుతో అన్నారు.

"నేనే మీకు కబురు చేద్దామనుకున్నాను రవిగారు అవన్నీ నేను చూచుకుంటాను అనడంతో ఆగిపోయాను. పెళ్ళి ఘనంగా జరిపిస్తానంటే ఒప్పుకోవటంలేదు" సుబ్బారావు తన తప్పేమీ లేదని తేల్చిచెప్పాడు.

"అవును నాన్నగారూ ఈరోజే రిజిష్టర్ మారేజ్, సింపుల్‌గా జరిగిపోవాలి. దీనికి మీరు అనుమతించండి." రవి వినయంగా అడిగాడు.

"అంతా నిర్ణయమయింతర్వాత కాదనే ప్రసక్తేలేదు. నీ యిష్టమే నా యిష్టం." రామభద్రయ్యగారు తమ పెద్దరికాన్ని నిలబెట్టుకోవాలని అన్నారు.

"మొత్తంమీద గట్టివాడివోయ్, అల్లుడూ. చేజారిందనుకున్న రత్నాన్ని చేజిక్కించుకున్నావ్, శుభస్య శీఘ్రమ్." వెంకట్రామయ్య రవి భుజం తట్టి నవ్వేడు.

రామభద్రయ్య, వెంకట్రామయ్య, రవి, సుబ్బారావు కార్లో బయల్దేరి, దార్లో సుజాతను ఎక్కించుకుని రిజిష్ట్రాఫీస్‌కు వెళ్ళారు. శకుంతల, వసుంధరను తీసి కొని షాపుకు వెళ్ళి మంగళసూత్రాలు, నల్లపూసలు, మెట్టెలు కొని తెచ్చింది.

పదకొండు గంటలకు రిజిష్ట్రాఫీస్‌లో రవి, సుజాత సంతకాలు చేశారు. సుబ్బారావు పూలదండలు యిద్దరిచేత మార్పించాడు. కార్లో సరాసరి రవి యింటికి వెళ్ళారు

తెల్లని బెనారస్ పట్టుచీరలో, నుదుట కల్యాణ తిలకంతో, మెడలో పూల దండతో, ఎడమబుగ్గన కాటుక చుక్కతో సుజాత మెరిసిపోతున్నది ఆమె ప్రక్కన రవి వైట్ డ్రస్‌తో, పూలదండ ధరించి హుందాగా నిలబడ్డాడు. గుమ్మందగ్గర నిలబడిన నవదంపతులకు శకుంతల హారతి యిచ్చి లోపలికి తీసి కెళ్ళి సీతారాముల పటం దగ్గర నిలబెట్టింది రవి చేతికి మంగళసూత్రాలూ, నల్ల పూసలూ యిచ్చి సుజాత మెడలో కట్టించింది కోడలి కాలికి వెండిమట్టెలు స్వయంగా తొడిగింది రవి, సుజాత మొదట పటానికి నమస్కరించారు. ఆ తర్వాత శకుంతలా రామభద్రయ్యగార్లకు పాదాభివందనం చేశారు. వాళ్ళు పుత్ర పౌత్రాభి వృద్ధిరస్తు అని దీవించారు తర్వాత, వసుంధర, సుబ్బారావు లకు, తర్వాత వెంకట్రామయ్యగారికీ నమస్కరించి దీవెనలందుకున్నారు.

ఆ తర్వాత సుబ్బారావు యింటిదగ్గర డిన్నర్ ఏర్పాటు చేశాడు. శకుంతల కొడుకునూ కోడల్నీ ప్రక్కప్రక్కన కూర్చోబెట్టి స్పెషల్‌గా వడ్డించింది. సుజాత సిగ్గుపడుతూ కూర్చుంది రవి అన్నం కలిపి తినబోతుంటే, "ఆగు రవీ, తినకు, సుజాతకు ఒక ముద్ద పెట్టు," అని శకుంతల చెప్పింది రవి మనసులో, ఏమిటీ చాదస్తం అనుకుని, ముద్దచేసి సుజాతకు పెట్టబోయాడు. ఆమె తల వంచుకునే కూర్చుంది చెయ్యి ముందుకు చాపలేదు.

"ఏమ్మా! తినిపించమంటావా?" అని తల్లివైపు చూచి నవ్వేడు. అంతపనీ చేస్తాడేమోనని భయపడి సుజాత చెయ్యి ముందుకు చాపింది. రవి ఆమె చేతిలో ముద్ద ఉంచాడు సుజాత కళ్ళు కద్దుకుని కొంచెం కొంచెం తినసాగింది.

శకుంతల కొడుకునూ కోడల్ని చూసి సీతారాముల్లా ఉన్నారని మురిసి పోయింది.

రాత్రి ఏడుగంటలకు సుబ్బారావు హోటల్ నటరాజ్‌లో రిసెప్షన్ గ్రాండ్‌గా ఎరేంజ్ చేశాడు అఫీస్ స్టాఫ్, ఫ్రెండ్స్, యింకా తెలిసినవారు చాలామంది ఎటెండయ్యారు తమ శుభాకాంక్షలు వధూవరులకు తెల్పి, ఎవరికి తోచినవి






వారు ప్రజెంట్ చేశారు. రవి, రిసెప్షన్, డిన్నర్ అయిన తరువాత, ఆన్ బిహాఫ్ ఆఫ్ ది న్యూలీ మారీడ్ కపుల్, ఆహూతులందరికీ థాంక్స్ చెప్పాడు.

రాత్రి పదిన్నరకు రామభద్రయ్య దంపతులు, వధూవరులను తీసికొని కార్లో రవి యింటికి వచ్చారు. వాళ్ళు వెళ్తుంటే సుజాతను, సుందరమ్మ, సుబ్బారావు శకుంతలకు, రవికి అప్పగింతలు పెట్టారు.

శకుంతల రవి పడుకునే గదిని సర్వాంగసుందరంగా అలంకరించింది. యూఫోం బెడ్ మీద తెల్లని పాలనురగలాటి దుప్పటి పరచి, పక్కనిండా మల్లె పూలు చల్లింది. టేబిల్‌మీద రాధాకృష్ణ విగ్రహం, అగరువత్తుల స్టాండు అమర్చింది. టీపాయ్‌మీద ప్లేట్లలో ఫలహారాలు, ద్రాక్షపళ్ళు, తాంబూలాలు ఉంచింది. సుజాత చేతికి పాలగ్లాసు యిచ్చి గదిలోకి పంపించింది. రవి అప్పటికే పాన్పుమీద పడుకుని చేతివాచీలో టైమ్ చూసుకుంటూ, అప్పుడే పదకొండుంబావయింది. అమ్మదంతా చాదస్తం. యివాళ ఎంతసేపు అలంకరిస్తుందో అనుకుంటూ, సుజాత వస్తున్నదేమోనని మాటిమాటికి గుమ్మంవైపు చూస్తూ, క్షణాలు యుగాలుగా గడుపుతున్నాడు.

సుజాత గదిలో అడుగుపెట్టింది. శకుంతల బయట గొళ్ళెం పెట్టింది. సుజాత తలవంచుకుని తలుపు దగ్గరే నిలబడింది. రవి నెమ్మదిగా లేచివచ్చి, ఆమె దగ్గరగా నిలబడ్డాడు. ఆమె కనురెప్పలు సిగ్గు బరువుతో వాలిపోయాయి. ఆమె

నడుంచుట్టూ చెయ్యి వేసి, నెమ్మదిగా నడిపించుకుంటూ మంచం దగ్గరకు తీసుకు వెళ్ళాడు. ఆమెకు అతి దగ్గరగా ఆనుకుని కూర్చున్నాడు. ఆమె ముఖాన్ని తనవైపు త్రిప్పుకుని, ఆమె చెంపకు చెంప ఆనించి చెవిలో చెబుతున్నట్టుగా పిలిచాడు మత్తుగా.

"సుజా."

"ఊఁ."

"యీ క్షణంలో నీకేమనిపిస్తుంది?" అనురాగపూరితమైన గొంతుతో నెమ్మదిగా అడిగాడు రవి. సుజాత సమాధానంగా తన కాటుకకళ్ళు ఒక్కసారి విప్పి అతనివైపు చూచి మళ్ళీ వాల్చుకుంది.

"నా కేమనిపిస్తుందో చెప్పనా! యీ క్షణం శాశ్వతం కావాలని, జన్మ జన్మలకూ మన మిలాగే ఉండిపోవాలని, నీ హృదయంలో నా రూపం నిండి పోవాలని, యింకా ఏవేవో మాటలలో చెప్పలేని స్వీట్ థాట్స్. నీకూ అలాగే అనిపిస్తున్నదా?" రవి ఆమె పెదాలపై ముద్దుపెట్టుకున్నాడు.

"నీకు మాటలు రావా? సిగ్గుపడుతూ ఎంత అందంగా వున్నావో తెలుసా! నీకోసమే యీ రవి యిన్నాళ్ళూ నిరీక్షించాడు. నీ కేంకావాలో, యీ శుభ సమయంలో కోరుకో సుజా," అంటూ లైటాఫ్ చేశాడు.

సుజాత అతని హృదయంమీద వాలి, "నా కోరిక యిదే. ఎప్పుడూ మీ హృదయంలో నిలిచిపోవాలని. మీ సన్నిధిలో నా జీవితంలో చీకట్లు క్రమ్మ గూడదని. మీరు నావారయ్యారు. నా మనసంతా రవి రూపమే నిండిపోయింది. జగమంతా మీరే కన్పిస్తుంటే, మీలో సగభాగాన్ని నేనైతే, యింకా కోరవలసిన దేమిటో తెలియటంలేదు." నెమ్మదిగా అంది.

"సుజా, నీ దేహం ఎంత సుందరమో, నీ మనసంత సుకుమారం. నిన్ను పొందిన నేను చాలా అదృష్టవంతుణ్ణి. యీ బ్రహ్మచారిని గృహస్థుగా మార్చావు. నిన్నభినందిస్తున్నాను."

"నా మనసులో శాంతికిరణాలను ప్రసరించి, నన్ను ధన్యురాలిని చేసిన దైవం మీరు. మీ సన్నిధిలో నా జన్మ చరితార్థమవుతున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది రవీ."

"నా వలపులరాణివి, నా జీవనజ్యోతివి, నన్ను సక్రమమార్గంలో నడిపించాలి. మన సంసారం నాల్గుకాలాలపాటు చల్లగా ఉండాలి," అంటూ సుజాతను మీదకు లాక్కున్నాడు.

---




ప్రసాద్ పెదివి కొరుకుతూ నిలబడి పోయాడు. ఆ క్షణంలో అతని మనసు అతని వశంలోలేదు. వెంటనే లోపలికి వెళ్ళి శారదని పట్టుకుని, బలంగా గుండెలకి హత్తుకోవాలని అనిపిస్తుంది. శారదకు తను పడుతున్న బాధ వినిపి చాలని, తనని కరుణించమని వేడుకోవాలని ఎంతగానో అన్పిస్తోంది! కాని అతని ఉద్రేకాన్ని, చిత్రమైన శక్తి ఏదో బలంగా చేయిపట్టి ఆపేస్తోంది! 'ఆ విధంగా నువ్వు చేస్తే శారద నిన్ను క్షమించదు. అసలు నీతో యిక మాట్లాడదు సుమా, అని హెచ్చరించసాగింది.

అతనికి లోపలికి వెళ్ళాలని ఎంతగా ఉందో, వద్దనికూడా అంతగానూ వుంది.

శారద మనసులో తనకి ఎలాటిస్థానం వుంది? ఇంట్లోకి వెళ్ళిన శారద తిరిగి తన దగ్గరికి వస్తే శారద మనసులో తనకి ఒక స్థానం వున్నట్టే! ఏ భావమూ లేకపోతే రాదు! శారద వస్తే తనకి చాలా సంతోషం! ఒకవేళ - ఒకవేళ - రాకపోతే, ఈ క్షణంనుంచీ శారద గురించి ఆలోచిస్తాడే తప్ప శారద తనకి కావాలని కోరుకోడు. ఇటునుంచి యిటే యింటికి వెళ్ళిపోతాడు. శారదకి యిక కనిపించదు.

అతను వరండాలోకి వచ్చి అక్కడున్న స్తంభానికి ఆనుకుని నిలబడ్డాడు. అక్కడనుంచి చూస్తే దూరంగా వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్తూ, వస్తూన్న మనుష్యులు కన్పిస్తున్నారు.

క్షణాలు భారంగా గడిచినాయి. నిముషాలు ఎంతో కష్టంగా దొర్లినాయి! పావుగంట అయింది. అరగంట గడిచింది! ప్రసాద్ స్తంభానికి ఆనుకుని, ఆలోచనలో మునిగిపోయినట్టుగా కళ్ళ మీద వేళ్ళతో నలుపుతూ నిలబడి వున్నాడు. ఈ రోజు తన భవిష్యత్తుకి భగవంతుడు తీర్పు చెబుతాడు! ఈ తీర్పు ఎలాటిదైనా స్వీకరించటానికి అతను సిద్ధంగా వున్నాడు. అరగంట పైగా అయింది! పాదాల అలికిడి వినరాలేదు! గాజుల చప్పుడు వినిపించలేదు!

అతను తలెత్తాడు! అతని ముఖం భారంగావుంది! శారద రాలేదు! భగవంతుడికి తనమీద ఎందుకింత కక్ష! తనేం పాపంచేశాడు! ఉహూ! ఈ పాప పుణ్యాల బేరీజు ఏమిటో తనకు తెలియదు ఈ జీవితం శాపగ్రస్థం అయే పనులు తను ఏ జన్మలో చేశాడో అసలే తెలియదు!

అతను వెళ్ళిపోవటానికి వెనక్కి తిరిగాడు. ఒక అడుగు ముందుకువేసి వచ్చాడు. ముందుకు వెళ్ళబోతున్న అతను హఠాత్తుగా ఆగిపోయాడు. శారద ఎప్పుడు వచ్చిందో, అక్కడ చీకటిలో వున్న మరో స్తంభానికి ఆనుకుని నిలబడి వుంది! అతనికి సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అయినట్టు అయింది!

"శారదా!" అస్పష్టంగా అన్నాడు.

శారద మాట్లాడలేదు. అతనివైపే చూస్తోంది.

ఆ క్షణంలో అతనికి శారద కరుణించిన దేవతలా వుంది! పాలరాతి బొమ్మలావున్న శారద ఎంతో అపురూపంగా అనిపించింది! చెయ్యి చాచి ముట్టుకుంటే కరిగిపోయే కలయేమో నన్నంత జంకుగా అనిపించింది! అతను దగ్గరగా వెళ్ళటానికికూడా భయపడ్డాడు.

"శారదా!" అస్పష్టంగా మరోసారి అన్నాడు. ఆ పేరు ఎన్నిసార్లు పిలిచినా అతనికి తనివి తీరదేమో అన్పిస్తోంది.

"మీకు - మీకు - నా మీద కోపం వచ్చిందేమో కదూ ?"

శారద తగ్గుస్వరంతో అన్నా, ఆ మాటలు స్పష్టంగా వున్నాయి.

"కోపమా! నీ మీదనా? ఎందుకు?"

"మీరు — మీరు యిచ్చిన వుంగరం తిప్పి పంపించేశానని."

"అదా! అవును! అక్కయ్య అది తిప్పి తీసుకురాగానే నాకు కోపం వచ్చిన మాట నిజమే! కానీ ఆ కోపం ఎక్కువసేపు నిలవలేదు!"

"ఎందుకని ?"

"ఆ మాత్రం నేను అర్థం చేసుకోలేనా? కనకమణిగారూ, మా అక్కయ్యా

నీచేత బలవంతంగా ఆ పని చేయించి వుంటారు."

శారద జవాబు చెప్పలేదు.

"నేను అనుకున్నది నిజమేనని నాకు తెలుసు." అతను గర్వంగా అన్నాడు.

"కాదు. కాదు. మీరు పొరబడుతున్నారు. ఆ వుంగరం నా చేత బలవంతంగా ఎవ్వరూ పంపించలేదు. నేనే ఆ నిర్ణయానికి వచ్చాను."

"నువ్వా!" అతను ఆశ్చర్యంగా చూసాడు.

శారద తలూపింది.

"అవును. నేనే!"

"నువ్వా! నువ్వెందుకు అలా చేస్తావు?"

"మొట్టమొదట నా మనసు ఈ పెళ్లి వైపు ఎలాంటి ఆలోచనా లేకుండా మొగ్గినమాట వాస్తవమే! ఆ భ్రమలోనే మీ వుంగరం స్వీకరించాను! అందరి ఆడపిల్లల్లాగానే నేనూ పెళ్లి, భర్త, యిల్లు, పిల్లలు అంటూ కలలు కన్నాను! నాలో మంచితనం, విశాలత్వం పోయినాయి! స్వార్థం అనే దెయ్యం నా తలమీదకి ఎక్కింది! కానీ కొద్ది రోజులకి నా ఒంటిమీదకి తెలివి వచ్చింది! చిన్నప్పటినుంచీ నేను ఆ సేవాసదనంలో పెరిగాను! చిన్నప్పటినుంచీ నాకు, నాతోటివారికి నాకు చాతనైనంత సహాయంచేయాలని వుండేది! మీరు — మీరు — పరిచయం కాకముందు నా ఊహాలే వేరుగా వుండేవి!"

"శారదా!" అస్పష్టంగా అన్నాడతను.

"మీ ఉత్తరం పదిసార్లు చదువుకున్నాను! మీరు యోగ్యులని నాకు తెలుసు! మీ మీద నాకు సానుభూతి వుంది! మీ జీవితంలోకి వచ్చి మిమ్మల్ని అలా సేదదీర్చి, మీకు అపురూపమైన వ్యక్తిగా మిగలటం నాకు అదృష్టమే! కానీ మీ పరిచయం కాకముందే నా హృదయం యింకొకరికి అంకితం అయింది!"

అతను తుళ్ళిపడ్డట్టుగా చూశాడు. "నిజంగానా?"

శారద అవునన్నట్టు తల ఊపింది.

"ఎవరు? ఆ వ్యక్తి ఇప్పుడున్నాడా?" అతని ముఖంలో ఈర్ష్య చూసి శారద నవ్వింది. ఆ నవ్వు ఎంతో మనోహరంగా వుంది!

"ఆ యింకోరు యింకే వ్యక్తీ కాదు! సేవాసదనం! నేను సేవాసదనాన్ని, మిమ్మల్ని పెట్టి నా మనసు అనే తులాదండంలో తూచి చూసుకున్నాను! హృదయం అనే ఆ ముల్లు సేవాసదనం వైపే మొగ్గింది! "శారద కంఠంలో నవ్వు మాయమై హఠాత్తుగా గంభీరత నిండుకుంది.

"ఆ సేవాసదనం అనేది నా జీవిత ధ్యేయం! అది నేను విస్మరించకూడదు. మీరు డబ్బున్నవారు! నేను కాకపోతే మరోవ్యక్తి మీ జీవితంలో నిండుదనం

తెస్తుంది! కానీ ఈ సేవాసదనం అలా కాదు! దానికి నా అవసరం యెంతో వుంది! చిన్నప్పటినుంచి నా స్వభావం అంతే! ఎక్కడ నా అవసరం వుంటుందో అక్కడ నా మనసు మొగ్గుతుంది! భగవంతుడు నన్ను అలా ఎందుకు పుట్టించాడో నాకే అర్థంగాదు! మీరు - మీరు నన్ను యిప్పటికైనా అర్థంచేసుకుంటారని ఆశిస్తాను!" చివర ఎందుకోగాని శారద కంఠం కంపించింది! ప్రసాద్ శారదని రెప్పవేయడం మర్చిపోయినట్టుగా చూస్తున్నాడు. డబ్బుపట్ల ఎలాటి ప్రలోభంలేని శారద, తన స్వసుఖం కంటే, యితరుల క్షేమం కాంక్షించే శారద ఆ క్షణంలో, అతనికి యింకా యింకా అపురూపంగా అనిపిస్తోంది!

శారద తనని తిరస్కరించినందుకు అతనికి బాధగానే వుంది! అయినా ఆ క్షణంలో శారద తనకి కావాలనే ఆకాంక్ష యింకా కోటిరెట్లు పెరిగిపోతున్నట్లుగా వుంది!

"మీరు నన్ను అర్థంచేసుకున్నారుగా?"

అతను తల ఊపాడు.

"నా మీద కోపం లేదన్నమాటేగా?"

అతను యాంత్రికంగా తల ఊపాడు. ఆ క్షణంలో ఆమె ఏమి అడుగుతుందో, తనేం చెబుతున్నాడో అతనికి ధ్యాసే లేదు.

"మీరు పెళ్లిచేసుకొని సుఖంగావుంటే నా కెంతో ఆనందంగా వుంటుంది! త్వరలో పెళ్లి చేసుకుంటారుగా?"

అతను తల ఊపాడు మళ్ళీ.

"నిజమేనా!"

'నిజమే' నన్నట్టు చూచాడు. శారద చేయి చాచింది. అతను ఆమె మాటను అమలుపరుస్తానన్నట్టుగా వాగ్దానం యిస్తున్నట్టుగా ఆమె చేతిలో చేయి వుంచాడు.

"థ్యాంక్ యూ!" శారద చాలా అస్పష్టంగా అంది. నోటిలో మాట సొంతం కాకముందే అతని చెయ్యి వదిలేసి గిరుక్కున వెనక్కు తిరిగి యింట్లోకి వెళ్ళిపోయింది.

ప్రసాద్ చాలాసేపు అక్కడే నిలబడిపోయాడు. ఆ తర్వాత అతను మెల్లగా మెట్లవైపు నడిచాడు. మధ్యలో ఒకసారి ఆగి లోపలికి వెళ్ళే గుమ్మంవైపు చూసాడు. అక్కడ శారద కనిపించలేదు. లోపలికి వెళ్ళి శారదకి చెబుదామా అని క్షణంసేపు తటపటాయించాడు. మళ్ళీ అంతలోనే ఆ ఆలోచన నిరుపయోగం అని భావించినవాడిలా మెట్లవైపు వెళ్లాడు.

అతను ఒక్కొక్క మెట్టే దిగుతున్నాడు. అతని మనసులో పదే పదే యిదే గుర్తుకు వస్తోంది! తనకి శారద కావాలి! శారదకి సేవాసదనం కావాలి! శారదకి సేవాసదనమే ప్రాణం! ఇక్కడ

కూడా అదృష్టం తనని చూసి నవ్వుకుం టోంది.

గదిలో కిటికీదగ్గర నిలబడిన శారద అతను వెళ్ళిపోవటం చూస్తూనేవుంది. అతను మెట్లుదిగి వీధిలోకి వచ్చాడు. జనంలో కలిసిపోయాడు. శారద శక్తి కూడదీసుకుంటోంది.జీవితంలో అదృష్టం ఒకే ఒకసారి వచ్చి తలుపు తడుతుంది. తలుపు తీయడం ఆలస్యంచేస్తే ఆ దేవత వెళ్ళిపోతుంది. తను యిప్పుడు యేం చేసింది? అదృష్టదేవత లోపలికి వస్తా నని అంటే, రానవసరంలేదని తలుపులు మూసేసింది!

శారద కళ్ళు మూసుకుంది! కను కొలకుల్లోకి రాబోతున్న నీళ్ళని బలవం తంగా నిగ్రహించుకుంది. "భగవం తుడా! నా యీ నిర్ణయానికి నే నెన్నడూ పశ్చాత్తాపపడకుండా నన్ను ఆశీర్వదించు" అనుకోసాగింది.

*         *         *

"మే ఐ కమిన్!"

టేబిల్ దగ్గర కూర్చుని వ్రాసు కుంటున్న కనకమణి తలెత్తి చూసింది. ప్రసాద్ గుమ్మంలో నిలబడి వున్నాడు. అతన్ని చూడగానే ఆవిడ ముఖం చిరాకుగా అయింది! కనుబొమలు ముడి పడినాయి. ప్రసాద్ లోపలికి వచ్చాడు! కనకమణి చివాల్న కుర్చీలోనుంచి లేచింది. "నీకు లక్షసార్లు చెప్పాను. శారద యిక్కడ లేదని, శారద జోలికి రావద్దని."

ఆవిడ ఆగ్రహానికి అతను కించిత్తు కూడా తికమకపడలేదు. "నేను శారద కోసం రాలేదు. మీతో రెండు నిముషాలు మాట్లాడటానికి వచ్చాను. భయపడకండి. కూర్చోండి. నేను మిమ్మల్ని యిబ్బంది పెట్టటానికి రాలేదు." తాపీగా అంటూ వచ్చి కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

అతని చొరవకి, ధైర్యానికి విస్తు పోతున్నదానిలా చూస్తూ, కనకమణి కూర్చుంది.

ప్రసాద్ చేతిలోవున్న కాగితాలు కనకమణి ముందు పడేసాడు.

"ఒక్కసారి వీటిని చదివి చూడండి."

"ఏమిటవి?"

"చదవండి. మీకే తెలుస్తుంది."

కనకమణి కళ్ళజోడు సరిచేసుకుని వాటిని శ్రద్ధగా చదవసాగింది. చదువు తున్న కొద్దీ, ఆమె ముఖంలో చిరాకు మాయమై దాని స్థానంలోకి, సంభ్రమం, పట్టశక్యంగాని ఆశ్చర్యం ముప్పిరికొన సాగినాయి! చదవటం పూర్తికాగానే, పట్టరాని ఆనందంతో, ఆ కాగితాలవైపు, ప్రసాద్‌వైపు మార్చి మార్చి చూసింది. ప్రసాద్ మాత్రం ఆవిడ ఆశ్చర్యాన్ని గమనించే స్థితిలో లేడు! టేబిల్‌మీద పేపర్ వెయిట్‌ని చేతితో తిప్పుతూ, పరధ్యానగా ఆలోచిస్తున్నాడు.

"ఈ దస్తావేజు చూస్తే నా మతి పోతోంది! నీ ఆస్థినంతా మా సేవా సదనానికి వ్రాస్తే, మీ వాళ్ళు వూరు

కుంటారా? నీ పిల్లలు ఏమైపోతారు?" అంది.

"వాళ్ళకి చేయాల్సిన ఏర్పాట్లు చేసాను!"

"మీ అక్కయ్య -"

"ఇది నా ఆస్థి! నా యిష్టం! ఇందులో ఎవరి పెత్తనమూ లేదు."

"నీ కసలు యీ ఆలోచన ఎందుకు వచ్చింది?"

"ఆ డబ్బు నా దగ్గరకంటే, సేవా సదనంలో వుంటే, పదిమంది అనాధలకి వుపయోగపడుతుంది కదా అనిపించింది!"

"నీ దెంత గొప్ప మనసు! ప్రసాద్! నిన్ను నేను అర్థం చేసుకోలేకపోయాను! ఏదేదో అన్నాను. నేను నీ కంటె పెద్ద దాన్ని! నిన్ను క్షమార్పణ కోరకూడదు. ఇది సంతకం పెట్టి, రిజిష్టర్ చేయించే వెయ్యి. కొంతమంది నీ పేరు చెప్పుకుని కమ్మగా భోజనం చేస్తారు! అసలు నన్నడిగితే, యిలాటి సేవాసదనాలకి, గవర్నమెంట్ కంటే, మీలాటి ప్రయివేట్ వ్యక్తులే ఎక్కువ చేయూత యివ్వాలి! సంఘంలో మిగతా డబ్బున్నవాళ్ళకి నువ్వు ఆదర్శం కావాలని కోరుకుంటున్నాను?" ఆవిడ అలవాటు చొప్పున వుపన్యాసధోరణిలో మాట్లాడేస్తోంది।

ప్రసాద్ పేపర్ వెయిట్ చూస్తూ నిదానంగా స్పష్టంగా చెప్పాడు.

"ఆ కాగితాలమీద, యిప్పుడే, మీ ముందే సంతకం పెడతాను! రేపే నా ఆస్థినంతా అందులో వ్రాసిన విధంగా యీ సేవాసదనానికి రిజిష్టర్ చేస్తాను! కానీ ఒక్క షరతు."

"చెప్పు! ఏమిటది?"

అతను ఆవిడవైపు నిశితంగా చూస్తూ చెప్పాడు. "నేను శారదని పెళ్ళి చేసుకోవాలి! శారదతోపాటు నేను కూడా నా శాయశక్తులా యీ సేవా సదనానికి సేవచేస్తాను। ఈ పెళ్ళి అయినప్పటినుంచీ, దీని బాధ్యతని, శారదతోపాటు నేను కూడా సమంగా పంచుకుంటాను! మీరు సెక్రటరీగా వుండండి! నాకేం అభ్యంతరంలేదు!"

కనకమణికి మొట్టమొదట అతను చెబుతున్నదేమిటో అర్థంగా లేదు! తర్వాత-తర్వాత-ఆవిడకి అర్థమైంది! అర్థమైనకొద్దీ, యింకో విషయం కూడా, ఆవిడకి సుస్పష్టంగా తెలిసిరాసాగింది! ప్రసాద్ శారదని పెళ్ళి చేసుకోవటానికే, యీ మార్గం ఎన్నుకున్నాడు! ఆ అమ్మాయికి చేరువ అవటంకోసం, తనకి వున్నదంతా, వదులుకుంటున్నాడు! ఆవిడ చెప్పింది. "ప్రసాద్! నువ్వు శారద కోసం ఆస్థిని పోగొట్టుకోవటం నాకేం బాగాలేదు. నీ ఆలోచన సరైనది కాదని హెచ్చరించే చనువు, అధికారం నాకు వున్నాయి అనుకుంటాను."

అతను నవ్వాడు. "ఆస్థి పోగొట్టుకుంటున్నానని మీరు అనుకుంటున్నారు. కానీ, నేను పొందుతున్నది ఎంత

విలువైనదో మీకు చెప్పినా అర్థం గాదు!"

"నువ్వు బాగా ఆలోచించుకున్నట్టేనా "

"బాగా ఆలోచించాను!"

"అక్కకి తెలుసా?"

"తెలియదు! శారదతో నా పెళ్ళి అయేవరకూ ఇది, మీకు, నాకు, శారదకి తప్ప యింకెవ్వరికీ తెలియకూడదు అనుకున్నాను!"

కనకమణి తల పంకించింది! అనసూయమ్మగార్కి తెలిస్తే యీ పని సానుకూలపడదని ఆవిడకి బాగా తెలుసు! ప్రసాద్ ఏ కారణంగా, యీ పనిచేసినా, దీనిద్వారా, యీ సేవాసదనానికి చాలా లాభం కలుగుతోంది అది ఆవిడకి ఆనందదాయకమైంది!

"ఒక్క నిముషం వుండు! శారద లోపల వుంది! పిలుచుకుని వస్తాను," అంటూ లోపలకి వెళ్ళింది

క్షణం క్రితం, శారద లేదు అన్న పెద్దమనిషి! ఇప్పుడు ఆ మాటే గుర్తు లేనట్టుంది!

అరగంట తర్వాత ఆవిడ తిరిగి వచ్చింది "లోపలకి వెళ్ళు! శారదతో నీకు టీ యివ్వమని చెప్పాను! ఇక్కడ ఎవరైనా వస్తారు," అంది

ప్రసాద్ లేచి, కనకమణి వెళ్ళమని చెప్పిన గుమ్మంద్వారా లోపలికి వచ్చాడు

శారద అక్కడ నిలబడివుంది!

అతను శారదవైపు వచ్చాడు! శారద అతన్నే చూస్తోంది! శారదకి కనకమణి అంతా చెప్పినట్టుంది! ఆ కళ్ళలో నమ్మశక్యంగాని, ఆశ్చర్యం కన్పిస్తోంది

"శారదా!" పిలిచాడతను

శారద యింకా అలాగే చూస్తోంది.

అతను నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు "నువ్వు నా దగ్గరకి రానన్నావు! అందుకే నేను నీ దగ్గరకి వచ్చాను నీకు పెళ్ళి చేసుకుంటానని వాగ్దానం యిచ్చానుగా! అందుకే పెళ్ళి చేసుకుంటున్నాను! చెప్పు! ఇప్పటికైనా, నీ మీద నాకెంత గౌరవం వుందో నీకు తెలుస్తుందా?"

అతను చేయి చాచాడు

శారద మంత్రముగ్ధలా, అతనికి దగ్గరగా వచ్చింది! రెండు చేతులతో అతని చేతిని పట్టుకుంది! శారదని అతను దగ్గరకు లాక్కుని గుండెలకి అదుముకున్నాడు! "సేవాసదనం కోసం నన్ను త్యాగం చేయటానికి సిద్ధపడ్డావు కదూ!" అన్నాడు శారద హఠాత్తుగా, అతని గుండెలకి తల ఆనించి ఏడవ సాగింది! నిస్సహాయంగా నున్న ఆ ఏడుపులో అతనికి కావాల్సిన జవాబు దొరికింది! శారద తల నిమురుతూ అన్నాడు, "కనకమణి నేను ఆస్థి పోగొట్టుకుంటున్నానని, నన్ను పిచ్చి వాడినని అనుకుంటోంది! ఆవిడకేం తెలుసు, ఈ పెళ్ళిద్వారా నేనెంత

పొందుతున్నానో! నీ పక్కనవుండి, యీ అనాధలకి, నాకు చేతనైనంత సాయం చేయటంలో, నా జీవితానికి ఒక అర్థం, పరమార్థం ఏర్పడతాయి అని భావిస్తున్నాను!"

శారద మాట్లాడలేకపోయింది! ఆ క్షణాలలో యీ లోకం ఎంతో అందంగా, అద్భుతంగా, కనిపించింది!

* * *

ప్రసాద్‌కి శారదతో పెళ్ళి స్థిరపడిం దనగానే, అనసూయమ్మగారు శివం ఎత్తిన మనిషిలా అయింది! ప్రసాద్ ఆవిడకి ఒకే ఒక మాట చెప్పాడు "అక్కయ్యా! నేను శారదని చేసు కోవాలనుకున్నాను! చేసుకుంటాను! నువ్వు ఏ గొడవ చేసినా యీ పెళ్ళి మాత్రం ఆగదు!" అనసూయమ్మగారు ఏడవసాగింది "నిన్ను అప్పుడే ఆ పిచ్చాసుపత్రిలో వదిలేస్తే పీడా పోయేది! నాకీ బాధలేవీ వుండేవికావు!" ఆవిడ తిట్లు, శాపనార్థాలు అన్నింటినీ అతను మౌనంగా భరించాడు!

అనసూయమ్మగారు, వూరినుంచి వెంకట్రామయ్యని పిలిపించింది! ఆయన ప్రసాద్‌ని ఛడామడా తిట్టాడు నీకు పెళ్ళి చేసుకోవాలని వుంటే, ఆడపిల్లలే కరువు అయ్యారా! ఆ దిక్కూ మొక్కూ లేనిదే కావాల్సి వచ్చిందా? అది ఎన్ని చేతులు మారిన రకమో " ఆయన నోటి మాట పూర్తి కానే లేదు, దవడ ఎముక విరిగేట్టుగా, ప్రసాద్ చేయివచ్చి ఛెళ్ళున తగిలింది "మాటలు మర్యాదగా రానీయండి! నోరువుంది కదా అని తెలిసీ తెలియకుండా వాగవద్దు" అన్నాడు వెంకట్రామయ్య కళ్ళు నిప్పులు చెరిగాయి "నన్నే కొట్టేంత మొనగాడివి అయ్యావట్రా! అసలు యీ పెళ్ళి ఎలా జరుగుతుందో నేను చూస్తా! నీ మక్కెలు విరగతన్ని, హాస్పిటల్లో పడేయిస్తా" అంటూ మీదకి వెళ్ళాడు అనసూయమ్మగారు ఆయన్ని చేయిపట్టి వెనక్కి లాగింది "మీరెందుకు హైరానాపడతారు! వీడి కసలు మతి లేదు! మళ్ళీ త్వరలోనే పిచ్చాసుపత్రికి వెళ్తాడు లెండి! ఈ లక్షణాలన్నీ ఆ రకమే!"

ప్రసాద్ అతికష్టంమీద కోపం నిగ్రహించుకున్నాడు "ఇన్నాళ్ళూ, వాణ్ణి అన్నివిధాలా కనిపెట్టిచూసినదాన్ని, నేనే ఏమీ చెయ్యలేకుండా వున్నాను!" అంది

"నువ్వు వూరుకుంటే, నేనెలా వూరు కుంటానమ్మా! నా చెల్లెలి పిల్లలు లేరూ! వాళ్ళకి వీడెలాటి గతి పట్టిస్తాడో!"

"అందుకే, మీకు వుత్తరం వ్రాసి పిలిపించి, నా బాధ్యత నేను తీర్చు కున్నాను" అంది ఆవిడ

ప్రసాద్ వాళ్ళనే చూస్తున్నాడు. ఇదివరకు, అక్కకి, ఆయనకి ఒక్క

క్షణం పడేదికాదు! బద్ధశత్రువుల్లా పోట్లాడుకునేవారు! ఇప్పుడెలా యిద్దరూ ఒక్కటయి, తనమీద దండయాత్ర చేస్తున్నారో!

ఇదివరలో జయ, తనతో అలా ప్రవర్తించినప్పుడు, వీరి చుట్టరికాలు, పెద్దరికాలు ఏమయిపోయినాయి! ఈ యిద్దరిలో ఒక్కరుకూడా, జయని ఎందుకు మందలించలేదు? మంచి మార్గాన పెట్టలేదు! జయతో తను అన్ని బాధలు పడ్డప్పుడు, తనని చూసి అవహేళన చేసారే తప్ప, ఒకమాట సానుభూతిగా మాట్లాడారా? ఛీ ఛీ! ఏం మనుషులు?

వెంకట్రామయ్య పైపంచ తీసి దులుపుతూ అన్నాడు "సరే! ఆ పెళ్లేదో ఏడిస్తే ఏడవమను! కానీ, దానితో పిల్లలు కనకూడదు! పెళ్ళికి ముందే ఆపరేషన్ చేయించుకోవాలి నువ్వు"

ప్రసాద్ ముఖం ఎర్రబడింది

"షటప్" కొట్టినట్టే అన్నాడు

"నువ్వు ఆపరేషన్ చేయించుకోకపోతే, యీ పెళ్ళి జరగనీయను నేను! ముందే చెబుతున్నాను! నువ్వు ఎవరితోనైనా కులుకు! నాకు కావాల్సిందల్లా, నా చెల్లెలి పిల్లలకి అన్యాయం జరగకుండా వుండటం!"

"అదీ ఒక మాటే! నువ్వు దానికి ఒప్పుకోవాలిరా, ప్రసాదు," అంది అనసూయమ్మగారు. ఆవిడ యీ మాట అనియింకా నిప్పు వెలిగిస్తోందని ప్రసాద్ గ్రహించాడు

వెంకట్రామయ్య వెళ్ళి కనకమణితో కూడా చెప్పాడు. "అదంతా అతని యిష్టం," అంది ఆవిడ

ప్రసాద్ శారద దగ్గరకి వచ్చాడు! అతన్ని చూస్తే శారదకి జాలేసింది! అదేం ఖర్మో! అతని జీవితం అడుగడుక్కీ ఘర్షణమయమే! "శారదా! కనకమణిగారితో చెప్పాను! గురువారంనాడు బాగుందిట! లగ్నం నిశ్చయం చేయించమని చెప్తాను!" అన్నాడు

"మరి వాళ్ళు అడిగిన సంగతి?"

"ఏ సంగతి?"

"వెంకట్రామయ్యగారు" శారద ఆపైన చెప్పలేనట్టు ఆగింది

ప్రసాద్ ముఖం కందిపోయింది. "ఈ విషయం నీ వరకూ వచ్చిందన్న మాట!"

"కనకమణిగారు చెప్పారు"

ప్రసాద్ మాట్లాడలేదు శారద అనునయంగా అంది "మీరు సందేహించకండి! మీరు నా వారు అయినప్పుడు మీ పిల్లలు నా వాళ్ళు కారా! వారు అడిగింది చేస్తే యీ పెళ్ళికి అడ్డురారు! మనకి పిల్లలకంటే, మనం కలిసి వుండటం ముఖ్యం కాదా!"

"శారదా!"

"మీరు ఆపరేషన్ చేయించుకోండి."

అతను హఠాత్తుగా శారదని దగ్గరకు తీసుకుని, మెడ ఒంపులో ముఖం దాచుకున్నాడు "శారదా! ప్లీజ్! ఆ మాట మాత్రం అనకు! నువ్వు కనకమణిగారి దృష్టిలో అందరి ఆడపిల్లలాటిదానివి కాకపోవచ్చు! కానీ, నా దృష్టిలో మాత్రం అందరి ఆడపిల్లలాటిదానివే! ప్రతి ఆడపిల్లా ఏం కోరుకుంటుంది! పెళ్ళి అంటూ జరిగితే, తన రక్తం పంచుకుని పుట్టే పిల్లలు తనవాళ్ళు తనకి కావాలని అనుకుంటుంది! ఆ ఆనందం నీకు యివ్వలేకపోతే, నేను నిన్ను పెళ్ళి చేసుకోవటమే అనవసరం! వాళ్ళు పెట్టిన షరతు ఒప్పుకునేకంటే, నిన్ను పెళ్ళి చేసుకోకుండా తిరస్కరించటమే నాకు సులభం!"

"నేనేం చెయ్యను! మీతో జరగబోయే పెళ్ళి నాకు ఎండమావి అవుతుందేమోనని భయం వేస్తోంది!"

"అలాటి భయం నీకేమీ వద్దు! నువ్వు నిశ్చింతగా వుండు!" అన్నాడు అతను

* * *

శారద పెళ్ళి ప్రసాద్‌తో, ఆ సేవాసదనంలోనే, క్లుప్తంగా జరిగింది! శారద తోటిపిల్లల ఆనందం చెప్పనలవి కాదు! కావాల్సినంత సందడి చేసారు! కనకమణి చివాట్లుపెడా వాళ్ళు లక్ష్యపెట్టలేదు ప్రసాద్, శారద వాళ్ళందరికీ కొత్తబట్టలు యిచ్చారు!

పెళ్ళి రెండు రోజులుందనగానె వెంకట్రామయ్య, పిల్లల్ని తీసుకుని పల్లెటూరు వెళ్ళిపోయాడు! పెళ్ళికి కనకమణి ఆహ్వానంమీద అనసూయమ్మగారు వచ్చింది పెళ్ళి జరగగానే, పురోహితుడు, సేవాసదనానికి, ప్రసాద్ యిచ్చిన కానుకగా, ఆస్థి వివరాలు చదువుతుండగా విని, మూర్ఛపోయినంత పనైంది కనకమణితో, "కనీసం నువ్వయినా నాకు చెప్పలేదు ఇదంతా నువ్వాడిన నాటకమే!" అని నాలుగూ దులిపి, పిల్లలు కాఫీ తాగండని అందిస్తున్నా, వినకుండా, లేచి వెళ్ళిపోయింది!

శారద కనకమణికి వచ్చి నమస్కరించింది ఆవిడ శారదని లేవనెత్తుతూ, "శారదా! ప్రసాద్‌ని భర్తగా పొందగలిగిన నువ్వు చాలా అదృష్టవంతురాలివి! మీ యిద్దరినీ, యీ సేవాసదనానికి ఆత్మీయులుగా పొందుతున్న యీ పిల్లలు యింకా అదృష్టవంతులు! ఈనాటికి నా కల నెరవేరింది! ఈనాటి నుంచీ దీని బాధ్యత అంతా నీకప్పగిస్తున్నాను," అంది ఆ రోజంతా అక్కడ ఒక పండగలా జరిగిపోయింది!

రాత్రి అయింది!

గడియారం 11 గంటలు కొట్టింది!

శారద, ప్రసాద్ పక్కన సొమ్మసిల్లినట్టుగా పడుకుని వుంది! ప్రసాద్ చేతులు శారద జుట్టుని నిమురుతున్నాయి!




ఇద్దరి మనసులూ శాంతి తీరం చేరు కున్నంత హాయిగా, నిశ్చింతగా, ప్రశాంతంగా వున్నాయి। ఇక్కడ వీళ్ళు పొందిన ఆనందం అనిర్వచనీయమైనది। అపురూపమైనది। శారద తలఎత్తి గుండెలమీద ఆనించుకున్నాడతను "శారదా। నాకు పునర్జన్మ ఎత్తినట్టుగా వుంది।" అన్నాడు "నాక్కూడా।" శారద కళ్ళు చూస్తుండగానే, చెమ్మగిల్లి నాయి అతనివైపు చూస్తూ అంది "మిమ్మల్ని పెళ్ళి చేసుకోకపోయినా ఫర్వాలేదు అనుకున్నాను। అది ఎంత తెలివితక్కువ, అమాయకమైనఆలోచన। మిమ్మల్ని పెళ్ళి చేసుకోకుండా వుంటే, నేను ఎంత విలువైనదాన్ని పోగొట్టు కునేదాన్నో యిప్పుడు అర్థం అవుతుంది।" అంది అతను శారద తలని గుండెలకి అదుముకున్నాడు

ఇంతలో కాలింగ్‌బెల్ గణగణ లాడుతూ వినిపించింది అతను లైట్ చూసాడు "ఇంత రాత్రివేళ ఎవరై వుంటారు?" అన్నాడు

"ఏమో। ఎవరో వచ్చినవాళ్ళు మాత్రం ఏదో అవసరంతోనే వచ్చి వుంటారు।" శారద అతని చేతులను విడిపించుకుని లేచింది శారద వెళ్ళింది దూరంగా, గడియ తీయటం, శారద ఏదో అనటం లీలగా విన్పిస్తోంది।

పదినిముషాల్లో శారద తిరిగివచ్చింది

"మీరు ఒక్కసారి అర్జంట్‌గా లేచి రావాలి।"

"నేనా। ఎందుకు?"

"రండి రమ్మంటున్నానుగా।" కళ్ళ తోనే అర్థించింది

ప్రసాద్ లేచి వచ్చాడు

"ఎవరు వచ్చారో చూడండి," అంది దారితీస్తూ

అతను ముందు గదిలోకి వచ్చాడు

అక్కడ ప్రసాద్ పిల్లలు నిలబడి వున్నారు? వాళ్ళు వూరునుంచి వచ్చి నట్టున్నారు। తలలు రేగి వున్నాయి। ముఖాలు అలసటగా వున్నాయి। కళ్ళలో భయాందోళనలు కన్పిస్తున్నాయి।

పెద్దపాప అంటోంది "శారదా। మేం అనాథలం।"

చిన్నపాప చెప్పింది "మాకు అమ్మ లేదు చచ్చిపోయింది। మా నాన్న రెండో పెళ్ళి చేసుకున్నాడు"

"మమ్మల్ని తీసుకువెళ్ళిన మామయ్య మంచివాడు కాదు మమ్మల్ని కొడతాడు।" చంటి అంది

"ఇక్కడ ఎవ్వరూ దిక్కు లేనివారిని చేర్చుకుంటారని చెప్పావుగా। అందుకే యిక్కడకు పారిపోయి వచ్చాం।" అంది పెద్దపాప

శారద ప్రసాద్ సమాధానం కోసం గాని, పురమాయింపుల కోసంగానీ చూడలేదు "మీరు చాలా మంచిపని చేసారు," అంటూ వాళ్ళని దగ్గరకు తీసుకుంది

శారద వాళ్ళని లోపలికి తీసుకు వచ్చింది భోజనం తినిపించి, పక్కలు వేసి పడుకోబెట్టి తిరిగివచ్చేసరికి, ప్రసాద్ టేబిల్ దగ్గర కూర్చుని ఏదో వ్రాస్తున్నాడు

"ఏమిటిది?" అంది

"రిజిష్టర్‌లో పేర్లు"

"ఎవరివి?"

"ఇప్పుడు వచ్చిన వాళ్ళవి।" అతను వ్రాయటం పూర్తిచేసి, తన కుర్చీ వెనకగా వచ్చి నిలబడిన శారదవైపు తలెత్తి చూసాడు "ఇది చాలా బాగుంది కదూ। నా పిల్లలకి ఆశ్రయం యివ్వటంతో యీ సేవాసదనంలో నా కార్యక్రమం ప్రారంభమౌతోందన్న మాట।" శారద అతని వైపు క్షణంసేపు తదేకంగా చూసింది అతని నుదురుమీద ముద్దు పెట్టుకుంటూ, "ఈ ప్రపంచంలో ఆశ్రయంలేని పిల్లలందరూ మనపిల్లలే। అంది

"నిజం శారదా। నిజం।" అన్నాడు అతను

(సమాప్తం)

*పెళ్ళి విషయంలో తొందరపడి సరియైన భార్యను ఎన్నుకోలేక జీవితంలో నలిబిలి అయే యువకులకు,*

*సానుభూతితో*

*రచయిత్రి*

# స్టేటస్ సింబల్స్

అది మూడంకెల జీతగాళ్ళ కాలనీ!

కానీ, అందులో కొన్నిళ్లు పైకి నాలుగంకెల స్థాయికి ఎదిగి పోయినట్టు కనిపిస్తున్నయ్!

అందులో ఒక యిల్లు — దాని డ్రాయింగ్ రూము—కలర్ హిందీ సినిమా సెట్టులా వుంది

ఆ డ్రాయింగ్ రూమ్‌లో—ఈజిప్టు మహారాణిలా అందంగా అప్పుడే 'బ్యూటీ క్వీన్ కంటెస్ట్'లో పాల్గొనబోయే పద హారేళ్ళ పడుచులా వుండే—శైలజ కళ్లు, ఆ పూట ఎందుకో కంగారుగా—గోడగడియారం వైపు, తలుపు వైపు అసహనంగా చూస్తున్నయ్!

ఏదో పెద్ద ప్రేలుడుకు ముందుండే భయంకర నిశ్శబ్దత ఆవరించి వుంది ఆ గదిలో!

బేటరీతో నడిచే గోడగడియారపు ముల్లు—ధనిక, పేదవర్గాల ప్రతీకలుగా—ఒకదాని కొకటి—దూరం—దూరంగా—కదులుతున్నయ్!

ఆ రెండు ముళ్ళ మధ్యా—అందంగా రంగురంగుల్లో వున్న ఒక పక్షిబొమ్మ - ప్రాణం వున్నట్టు—ముందు వెనకలకి వూగిసలాడుతోంది.

ఇంతలో "అమ్మగారూ!" అన్న రహస్యపు పిలుపుతో శైలజ కంగారుగా సోఫామీదనుంచి లేచింది

"లక్ష్మి! ముందు నువు లోపలికొచ్చి, ఆ తలుపు గడియ వేసెయ్!" అంది శైలజ మాట వినిపించీ వినపడనట్టు.

అప్పటికే ముఖంమీద పట్టిన చెమటను అనేకసార్లు తుడుచుకుంది శైలజ

"ఏం లక్ష్మి! నా పేరు యెక్కడా బయటికి రాలేదుగా ?" అడిగింది శైలజ మెల్లిగా, కంగారుగా

"మీ పేరు ఎలా రానిస్తానమ్మగారూ! మీరు చెప్పారుగా ?" అంది పని మనిషి లక్ష్మి అభయం యిస్తున్నట్టు!

ఈసారి శైలజే వెళ్ళి కిటికీ రెక్కలు వేసొచ్చింది గోడకు చెవులుంటాయన్న విషయం ఆమెకు నమ్మకం లేదుగాని, గోడకు, తలుపులూ, కిటికీలూ వుంటా యని, 'నోరు దాటినమాట వూరు దాటు తుందని' ఆమె భయం

"ఏందో అమ్మగారూ! ఈళ్ళ

---

ఎమ్ డి సౌజన్య

జిమ్మడ....పుతుకుపడని కొత్త వాయలు చీరెగందా....అయినా పాతికా, ఇరవైకీ అడిగి నచ్చారు ?" అంది బాధగా.

పనిమనిషి లక్ష్మిమాటల్లో ధ్వనిస్తున్న బాధ, సానుభూతికి శైలజ ఒక పక్క చలించిపోతూంది.

అయితే కొత్త వాయలుచీరె వంద రూపాయలది మరీ అంత అన్యాయంగా అడిగారని తెలిసి, ఏదో నిస్సత్తువ ఆమె నరనరాల్లో ప్రాకినట్టు, ఏదో తెలియని భయం, ఆమె వెన్నుపాములో ఆవరించినట్లనిపించింది.

"అక్కడికీ చెప్పానమ్మా ! ఒక్క పుతుకూ పడలేదని—వెలసిపోయే రంగు కాదనీ, మడత మాత్రం ఒక్కసారి విప్పి కట్టిందని-'ఏం పుతుకు పడకపోయినా కొత్తదేం కాదుగదా' అని కొందరూ, 'ఈ చీరె నీ కెక్కడిది? కొత్త చీరె ఎవరైనా అమ్ముతారా, ఇలాటి దొంగ వస్తువులకు ఆశపడితే నీతోపాటు మాకూ మూడుతుంది' అని కొందరు - నానా మాటలూ అన్నారమ్మా?" అంది లక్ష్మి.

"పోనీ క నీ స ం ఓ నలభైకైనా ఎలాగో వదిలించలేకపోయావా ?" అంది శైలజ ఎంతో దీనంగా.

"అయ్యోరాత ! నేనే ఏదొంగతనమో చేసి, చా టు గా డబ్బుచేసుకోటానికి కక్కుర్తిపడుతున్నానని నన్నే మింగేసేటట్టు చూశారమ్మా!" అంది లక్ష్మి తానూ ఎంతో బాధపడిపోతూ.

"అయితే చీరె ఎవరూ కొనలేదా ?" అంది శైలజ కంగారు కంగారుగా.

"మీరేమో డబ్బవసర మంటిరిగదా ! అందుకే యిరవైకి ఎట్టాగో తెగనమ్మా!" అంది చావుకబురు చల్లగా చెబుతున్నట్టు.

"ఏమిటీ ! వంద రూపాయల చీరె, యిరవై రూపాయలకా అన్న శైలజ బాధను అర్థంచేసుకున్న లక్ష్మి -

"మీరు యీ డబ్బొద్దంటే మీ చీరె మీకిత్తారమ్మా ! ఆ మాట మరీ మరీ సెప్పే తెచ్చాను ?" అంది లక్ష్మి రెండు మడతపెట్టిన పది రూపాయల కాగితాలు శైలజ చేతిలో పెడుతూ.

శైలజకు ఆ యిరవై రూపాయలూ చేతిలోకి తీసుకోటానికి ఓ రకం వణుకు పుట్టినా, డబ్బు సమయానికి చేతికందడంతో వెయ్యేనుగుల బలం వచ్చింది.

కాని ఒక్కసారి గతంలో ఆ చీరెకు సంబంధించిన సంఘటన గుర్తుకు రావడంతో, శైలజ కళ్ళలో ఒక్కసారి నీళ్ళుబికాయి.

* * *

"ఇదుగో శైలూ ! నీకోసం ప్రెజెంట్ ఏం తె చ్చా నో చెప్పుకో చూద్దాం !" అన్నాడు శేఖర్ ! శైలజ భర్త శేఖర్ ! చేసేది పెద్ద ప్రైవేటు కంపెనీలో చిన్న గుమాస్తా ఉద్యోగం.

నెలకొచ్చే ఏదొందలూ తప్ప వెనక ఏ స్థి ర చ రా స్థు లు లేని వుద్యోగం శేఖర్ది !



అయితే శైలజ కాస్త తెలివైంది। చన్నీళ్ళకు వేణ్ణీళ్ళు గా 'నెహ్రూ ఇంగ్లీషు మీడియం సెంటర్ అనే ఓ బోర్డుపెట్టి, ఆ కాలనీలో పిల్లలకి ఒకటి నుంచి అయిదు వరకు చెప్పే 'ప్రైవేటు స్కూలు, ప్రారంభించింది

అయిదారు వందల కుటుంబాలున్న ఆ కాలనీలో మొదటి రెండు మూడేళ్ళు పట్టుమని పదిమంది పిల్లలు లేకపోయినా శైలజ శ్రద్ధవల్ల మహిళామండలి ఒకటి ప్రారంభించి శైలజే దానికి సెక్రటరీ అయి కాలనీలోని మహిళలందరితో పరిచయం పెరగడంతో, శైలజ నడిపే ఇంగ్లీషు మీడియం స్కూలు దోస పాదులా పిల్లలతో కలకలలాడసాగింది।

తరువాత మరో ఇద్దరు టీచర్సుకూడా అవసరం కావటంతో శైలజ హెడ్ మిస్ట్రెస్ అయిపోయింది। యిద్దరు టీచర్సుకు జీతాలు పోను - శైలజ వంతు ఓ రెండొందలు మిగులుతుండేవి।

హెడ్‌మిస్ట్రెస్ అన్న హోదా రావటంతో, ఆ స్టేటస్ మెయింటెయిన్ చేసుకోవటానికి శైలజ నానా యాతనా పడాల్సివచ్చింది దీనికితోడు మహిళా మండలి కార్యక్రమాలకి ప్రతిసారీ వందా యాభై ఆమె చేతివి పడడం ప్రారంభమయ్యాయి। ఇక ప్రతిసారీ రకరకాల చందాలు

హెడ్‌మిస్ట్రెస్ అవటంతో ముప్పయి నలభై రూపాయల చీరెల స్థానే వందా నూటయాభై రూపాయల నైలాన్, క్రేప్ సిల్క్ చీరెలు అవసరమయ్యాయి ఇక వాటికి తగినట్టే, గోల్డుచెయిన్ రిష్టువాచీ, ఫేషన్‌గా వుండే లాకెట్, ఇంగ్లీషు మాగజైన్స్, అదేవిధంగా పిల్లలూను

మహిళామండలి సెక్రటరీ, హెడ్

మిస్ట్రెస్ అన్న హోదాలతో తనకంటే ఎంతో సాంఘిక స్థాయిలో ఎదిగిన భార్యతో సరితూగటానికి, శేఖరమూ ఎంతో మారవలసి వచ్చింది

అతనూ కాటన్ పాంటూ, షర్టుస్థానే టెర్లిన్, టెరీన్-బెల్‌బాటమ్ ప్యాంట్లు, గ్యాలియర్, రేయాన్ కోట్లు తొడగడం సాగించాడు

ఇంత హైక్లాస్ డ్రెస్‌కు తగ్గట్టు హైహీల్డు పాయింటెడ్ షూస్, సీకో వాచ్, హిప్పీ హెయిర్ స్టయిల్‌కి మారవలసి వచ్చింది

ఇక మిగిలింది ఓ వెహికిల్

సిటీలో అదొక స్టేటస్ సింబల్

"ఇంట్లో ఏం తిన్నదీ ఎవరు చూశారు! నలుగురిలో బయటికి వచ్చేప్పుడు కాస్త రీకు రాకుగా, పిల్ల జమీందారులా కన బడాలి 'వెస్పా' లాంటి వెహికిల్ మనం ఎటూ కొనలేం! ఓ సెకండ్ హాండ్ లాంబ్రెట్టా చూడండి రోజూ కాస్త షికారుకి ఈవెనింగ్స్ షాపింగ్స్‌కి వెళ తుండవచ్చు!" అంటూ ప్రోత్సహించింది శైలజ

అప్పటికే ఇన్‌స్టాల్‌మెంటు సిస్టంలో చిన్న ఫ్రిజ్, రేడియోగ్రాం, టేప్ రికార్డర్, సీలింగ్ ఫాన్, సన్‌గ్లాస్ డైనింగ్ టేబుల్, సోఫాసెట్టు శైలజ సమకూర్చుకుంది

తరువాత పనిమనిషిగా లక్ష్మి కూడా అవసరమొచ్చింది లక్ష్మికీ - రెండు పూటలా టిఫిను, ఒకపూట భోజనంతో నెలకో ముప్పయి

తల్లితండ్రుల అలవాట్లే పిల్లలకూ వస్తాయంటారు అరుణకు, రవికి-తల్లి తండ్రుల అలవాట్లే వచ్చాయి ఇదివరకు పాసుతో సిటీబస్‌లో వెళ్ళేపిల్లలుఇప్పుడు ప్రత్యేకంగా రిక్షాలో వెళ్ళటం అలవాటు పడ్డారు అయిదూ పది పైసల ఐస్ ఫ్రూట్లు కొనుక్కునేవాళ్ళు, ఫ్రూట్ సలాడ్‌లాంటి ఖరీదైన తిండ్లకి అలవాటు పడ్డారు

ఫలితంగా ఫ్యామిలీ బడ్జెట్ మునగటానికి సిద్ధంగా వున్న పడవలా తయారయింది

ఆ రోజు పదిహేడు వందలకు చౌకగా వచ్చిందని శేఖర్, సెకండ్‌హాండ్ ల్యాంబ్రెట్టా తెచ్చాడు

అందుకే 'శైలూ! నీకోసం ప్రెజెంటు ఏం తెచ్చానో చెప్పుకో చూద్దాం?' అన్నప్పుడు శైలజకు భర్త తెచ్చిందేమిటో, ముందు వూహించుకోలేక పోయింది.

భార్య ఎంతసేపటికీ ఏమీ చెప్పలేక పోవటంతో "డియర్ శైలూ! నువ్వు ఓడిపోయావు! 'సీయింగ్ యీజ్ బిలీవింగ్, బయట ఏముందో వెళ్ళి చూడో సారి!" అన్నాడు జడపట్టి లాగి

పంచకళ్యాణి గుర్రంలా స్టాండ్‌వేసి వున్న లైట్ బ్లూ కలర్ లాంబ్రెట్టా, చూసి-తన కళ్ళను తనే నమ్మలేక పోయింది శైలజ

"ఇది కలా నిజమా?!?!" అనే విషయం ఎటూ తేల్చుకోలేక వెళ్ళి చేతితో తాకి చూసింది శైలజ.



"ఆహా! ఈ కాలనీలో వెహికిల్ వున్నది మా ఫామిలీకే! ఇకనుంచి హాయిగా ప్రతివారం ఓ పిక్‌నిక్, ప్రతి సాయంత్రం షాపింగ్, ప్రతి ఉదయం ఓ చిన్న షికారు! ఈ వెహికిల్ రావటంతో నా ఫామిలీ స్టేటస్ ఎంత పెరిగిపోయిందో!" అని శైలజ, మబ్బుల్లో విహరించసాగింది

కాని ఆ పదిహేడు వందలు, నూటికి అయిదు రూపాయలు కాబూలీ వడ్డీకి అప్పుపుచ్చుకున్నట్టు తెలియగానే భయంతో తొట్రుపడిపోయింది శైలజ

"ఇప్పటికే ఎల్ ఐ సీ లోను, ప్రావిడెంట్ ఫండ్ లోను, ఫ్రిజ్‌కి, రేడియోగ్రామ్‌కి కట్టవలసిన ఇన్‌స్టాల్‌మెంట్సు కట్టలేక కటకట పడిపోతున్నాం! ఇప్పుడీ లాంబ్రెట్టా ఎందుకు అప్పుచేసి కొన్నారు?" అని చెబుదామనుకుంది శైలజ!

కాని తనేగా "స్టేటస్ సింబల్! స్టేటస్ సింబల్!" అంటూ భర్తను వెహికిల్ కొనమని ప్రోత్సహించింది

అక్కడికీ శేఖర్ "శైలూ! మా కొలీగ్ ఒకడు 'వెస్పా' వెహికిల్ కొనటానికి యీ లాంబ్రెట్టాని అర్జంటుగా తెగనమ్ముతుంటే తెలిసి నేనే కొనేశాను! పద ఈ శుభసమయంలో నీకో మంచి చీరె ప్రెజెంటు చేయాలి!" అంటూ బయలుదేరాడు

భర్త అంత సంబర పడుతుంటే శైలజ కాదనలేకపోయింది

"నెల చివరి రోజులు! యిప్పుడు కొనబోయే చీరెకూడా, అప్పులో భాగమేగా!" అని శైలజ లోలోపల బాధ పడుతూంది

అయితే జానపద చిత్రాలలో యువరాజుతో పంచకళ్యాణి గుర్రమెక్కిన యువరాణిలా, శేఖర్‌తో లాంబ్రెట్టా

ఎక్కిన శైలజ, తమ బాకీల బాధ, భయం కాసేపు మరచిపోగలిగింది!

"శ్యారీస్ సెంటర్ దగ్గర దిగిన శేఖర్-శైలజల జంటను షాప్ ప్రొప్రయిటర్ స్వయంగా ఆహ్వానించటం, గోల్డ్ స్పాట్ యివ్వటం, షాపులో గుమస్తాలు అత్యంత భక్తిశ్రద్ధలు కనబరచటం చూస్తుంటే శైలజ తను ఎక్కడుందో మరచే పోయింది.

ఐతే ఆమెలో ఆమెకు తెలియకుండా వచ్చిన మార్పుకు శేఖర్ కంటే, శైలజకే ఎక్కువ ఆశ్చర్యం అనిపించింది!

ఇదివరకు శైలజ ప్రతి వస్తువూ గీచి గీచి బేరమాడేది. కొనేది-ఒకటీ అరా చీరలైనా అన్ని షాపులూ తిరిగి తిరిగి ధరలు కనుక్కునేది! కిందపెట్టి మీదపెట్టి షాపువాణ్ణి వేధించి, యెంతో కొంత కన్సెషన్ ధరలో రాబట్టేది.

శైలజకి ఇవ్వాళ లాంబ్రెట్టామీద రావటంతో జరిగిన గౌరవ మర్యాదలకు బేరంచేయటం నామోషీ అనిపించసాగింది. అలాగే రోడ్డుప్రక్కన నాలుగు చక్రాల సైకిల్ బండ్లమీద అమ్మే వస్తువులు కొనడం చిన్నతనంగా అనిపించింది.

క్రమేపీ అనేక మార్పులు జరిగి పోయాయి. శైలజ ఒకసారి పనిమనిషి లక్ష్మితో "చూడు లక్ష్మీ! నువ్విలా చింపిరి తలతో, నూలు బట్టలతో మా యింటికి పనికి వస్తూండటం చూస్తే, ముందు మాకే నామోషీగా వుంది! నా పాత చీరెలు రెండిస్తాను. ఇకనుండి మా యింటికి వచ్చేప్పుడు అవే కట్టుకొస్తుండు!" అంది.

తరువాత లక్ష్మికూడా శైలజ అడుగు జాడల్లో నడుచుకోక తప్పింది కాదు.

దానికి సద్దన్నానికి బదులు కాఫీ, టిఫిను, నూలు బట్టలబదులు నైలాను, టెర్లిను; పచ్చడి మెతుకులకు బదులు పసందైన కూరలు అలవాటు పడ్డాయి.

లక్ష్మిని చూసిన వాళ్ళెవరూ, ఇప్పుడు పనిమనిషి, అంట్లు తోముకునేది అను కోరు!

కాలం ఒకరీతిగా గడవదంటారు.

అప్పటికే రకరకాల అప్పులతో 'మునగానాం,' 'తేలానాం'గా వున్న శైలజ కుటుంబ పరిస్థితి, ఒక్కసారి యిరుకున పడింది!

ల్యాంబ్రెట్టా వుండటంతో పావు గంటలో ఆఫీసుకు చేరుకోవచ్చన్న ధీమాతో, నేలమీద పైరు ఆననంత వేగంగా ల్యాంబ్రెట్టా మీద దూసుకు పోతున్న శేఖర్‌ని ఓ బెంజిలారి గుద్దేసింది.

ఫలితంగా కుడిచేయి, కుడికాలు పోయి-చావుతప్పి ప్రాణాలు దక్కించు కున్నాడు శేఖర్.

అయితే గవర్నమెంటు హాస్పిటల్ నుంచి బయటపడటానికి తొమ్మిదినెలలు పట్టింది.

ఒకప్రక్క ఉద్యోగం పోవటం, మరోప్రక్క 'సోషల్ స్టేటస్'! 'సోషల్ స్టేటస్' అంటూ చేసిన అప్పులతో ఒక్కో

వస్తువు - సగానికి సగంకంటే తక్కువ ధరకి అమ్మాల్సి వచ్చింది! నానా గడ్డి కరిచి కొన్న వస్తువులు అమ్మాల్సివచ్చి ఒకప్రక్క బాధ, మరో ప్రక్క అవి అమ్ముకుంటున్నట్టు తెలిస్తే ఎంత తల వంపులో అన్న భావన, భయం మరో ప్రక్క, శైలజ సతమత మవసాగింది

ఇలా అన్నీ అమ్ముకుని చివరికి ఖరీదైన చీరెలూ అమ్మ కొని, భర్త ల్యాంబ్రెట్టా కొన్నరోజు యిప్పించిన వాయిలు చీరె, రెండో కంటికి తెలియకుండా అమ్మే బాధ్యత నమ్మకంగా లక్ష్మి మీద పెట్టింది శైలజ

అప్పటికే లక్ష్మి శైలజ అమ్మే అనేక వస్తువుల అమ్మకంలో ఎంతగానో సాయపడింది!

శైలజ చివరికో రోజు "లక్ష్మి! ఇక నీకు మేము పనియిచ్చే స్థితిలోలేము! ఇప్పటికే నీకు నాలుగునెలల జీతం నూటయిరవైదాక యివ్వాల్సి వుంది! యిదుగో యీ సోఫా కం బెడ్ అమ్మి- ఎంత దబ్బొస్తే అది నువ్వు తీసుకో! రేపు తెల్లవారు ఝామున మీ ఆయన లాగుడు బండి తెచ్చి—యీ సోఫా కం బెడ్ తీసికెళ్ళు!" అంది రహస్యంగా

శైలజ మాటలకు లక్ష్మికి కళ్ళవెంట నీళ్ళొచ్చాయి! అయినా ఎలాగో నిగ్రహించుకొని వెళ్ళిపోయింది

శైలజ చెప్పినట్లు - లక్ష్మి భర్తతో, రెండోరోజు తెల్లవారు ఝామున వచ్చి లాగుడు బండిలో సోఫా కం బెడ్ తీసు కెళ్ళింది!

చూస్తూ వుండగానే ఒక సంవత్సరం యిలాగే దొర్లిపోయింది.

ఇల్లు గడవటానికి మరో మార్గంలేక శైలజ అంగవైకల్యం సంప్రాప్తించిన భర్త శేఖరానికి తను యిన్నాళ్ళూ పెంచి పోషించిన, 'ఇంగ్లీషు మీడియం స్కూలు అప్పగించింది!

శైలజ ఒక 'టాయిలెట్ కంపెనీ' వస్తువుల్ని యిళ్ళకు తిరిగి అమ్మే 'సేల్స్ వుమన్' వుద్యోగం సంపాదించింది! నెలకో నూటయాభై జీతం, షుమారుగా అంతకు తగ్గని కమీషను - ఆమెకు ప్రోత్సాహకరంగానే వున్నాయని పించింది

ఓ రోజు శైలజ తన టాయిలెట్ సేల్స్‌చేసే హేండ్‌బాగ్‌తో యిళ్ళు తిరుగుతున్నది

ఇంతలో మొలచుట్టూ చిన్న నిక్కరున్న పిల్లవాడు "అమ్మాయ్! నీ దగ్గర మంచి సెంటు వుందిట! నిన్న ఆ ఇంట్లో అమ్మింది నువ్వేగా! మా అమ్మ కొంటుందిట! అదే మా యిల్లు! రా! అన్నాడు

శైలజ సంతోషంగా ఆ పిల్లవాడి వెంట ఓ పూరిగుడిసెలోకి నడిచింది ఆ పూరిగుడిసెలో - ఓ సోఫా కం బెడ్ మీద సుతారంగా పడుకొని ఉన్న ఆడ మనిషి అదాటున లేస్తూ "శైలజమ్మగారూ! మీరా!" అంది, గుర్తుపట్టి వాయిలు చీరె కుచ్చిళ్ళు సర్దుకుంటూ

— —

# కళ్ళు

'మీకు టెలిపతీమీద నమ్మకం వుందా?'
వొంగుని జబ్బలో ఇంజక్షన్ ఇస్తున్న వాడిని ఉలిక్కిపడ్డాను ఆ ప్రశ్నకి నా మనసులో భావాలు చదివిగానీ ఈ ప్రశ్న వేయలేదుకదా! క్రింది పెదివిని పై పంటితో నొక్కిపట్టి ఆ ప్రశ్న విననట్టే ఇంజక్షన్ ఇచ్చేశాను

క్షణకాలం మూలిగి అంతలోనే ఎప్పటిలాగే ముఖంనిండా నవ్వు పులుముకుంది అమృత ఆ నవ్వే అదే నవ్వు నన్ను చిత్తు చేస్తుంది

'అమృతా' ఆమె మాటలకి అంతరాయం కలిగించాను

ప్రతిరోజూ అదే సమయంలో ఆ బెడ్ దగ్గర హఠాత్తుగా నా కాళ్ళు ఆగిపోతుంటాయి నాకు తెలుసు చుట్టూ వున్న ఈ జనానికి నా రాక, యిక్కడ ఆగి ఈ పేషెంట్ తో మాట్లాడడం సందడిని కలిగిస్తాయని ఎప్పటికప్పుడే 'వీల్లేదు' రేపట్నుంచి నన్ను నేను పరిధిలో బిగించుకోవాలి అనుకుంటూనే బలహీనతకు లొంగిపోతున్నాను. తొమ్మిది గంటలలోగా రోజూ ఎదురుచూసే ఆ సమయం నాకు ఎంత అమూల్యమైనదో తెలుసును అయినా నేనూ సామాన్యుడినే అందుకే ఆ బెడ్ దగ్గర అమృతతో మాట్లాడుతూ ఆగిపోయాను

'మీకో చిన్న ఉపమానం చెబుతాను. గలగలా ప్రవహించే నది. దానికో వారధి. ఇవతలి ఒడ్డున పుట్టుక అతవల వైపు మృత్యువు ప్రతి మనిషీ ఆ వారధిమీదే పయనించాలి అది నియమం తన గమ్యం మరణం అని తెలుసు అయినా వారధి చివరికంటా నడవడానికి ప్రయత్నిస్తాడు మార్గం మధ్యలో ప్రమాదవశాత్తూ జారి నదిలో పడేవాళ్ళ సంఖ్య కొంచెం ఎక్కువ ఉంటుంది. అవే అర్ధాంతరం చావులు యాక్సిడెంట్స్ వల్ల, రోగాలవల్ల సంభవించేవి

ఇకపోతే డాక్టర్స్ యీ బ్రిడ్జికి రైలింగ్స్ వంటివాళ్లు యీ అర్ధాంతరపు చావులని ఆపటానికి

నా వాక్ప్రవాహానికి అడ్డు కలిగిస్తూ అంది

'భలేవారే మొత్తానికి రచయితనని పించారు' అమృత నవ్వింది! చిన్న మాటని పట్టుకొని పెద్ద ఉపన్యాసం దంచారు

చిన్నగా నవ్వి అక్కడనుంచి బైట పడ్డాను కానీ నాతోపాటు వచ్చే ఆలోచనల్ని ఎక్కడికి తరమను?

టెలిపతీ పంచేంద్రియాలలో కాక

జి ఎస్. ఆర్. మూర్తి (మెడికో)



మనిషి ఇంకో మనిషితో సంభాషించడం దీనినే సిక్త్సెన్స్ అంటారు

ఆమె ఈ వార్డుకు వచ్చినప్పటినుంచీ నేను ఆమె గురించి ఆలోచించని క్షణం లేదేమో?

తెలిసి తెలిసి మనసు పారేసుకున్న మనిషిని నేను.

ఆమె నాకేకాదు ఎవరికీ దక్కదని తెలుసు అయినప్పటికీ ఆమె పట్ల ఎందుకు ఆకర్షితుడి నయ్యానో ఆ భగవంతుడికే తెలియాలి.

ఆలోచనల్లో వున్న నేను వులిక్కి పడ్డాను 'సార్ ఇరవయ్యో నెంబర్ బెడ్ మీద వున్నతనిని ఒకసారి చూడాలి మీరు' అటెండర్ చెప్పింది.

పరుగులాంటి నడకతో ఆ బెడ్ కి చేరుకున్నాను

* * *

అర్ధరాత్రి హఠాత్తుగా మెలుకువ వచ్చింది

ఎంత పీడకల?

అమృత ఏమైనా అయిపోయి వుండదుకదా.

మంటలు, మంటలు, మంటలు నా చుట్టూ లేచి ఆ మంటలు నన్నెందుకింత భయభ్రాంతుడిని చేస్తున్నాయి. మన స్ఫూర్తిగా 'నా అమృతా' అని ఎలుగెత్తి పిలవాలని వుంది. అయినా నా గొంతు సంస్కరణ పేర ఏ అదృశ్య శక్తో పీక నులిమి నా గది గడప దాటనీయడంలేదు. అప్పటికప్పుడు హాస్పిటల్ కి వెళ్లాలన్న కోరికని బలవంతంగా అదిమిపెట్టాను.

ఆ రాత్రి అంతా కలత నిద్రతో తెల్లవారింది. రోజూకంటే తొందరగా బయలుదేరి వెళ్ళాను హాస్పిటల్ కి ఇంజక్షన్ లోడ్ చేసి ఒక్కొక్కరికీ యిచ్చి చివరి బెడ్ కి చేరుకున్నాను.

'హలో ' అమృత పలకరించింది.

నేను నిజానికి అక్కడికే త్వరగా రావాలి కానీ అమృత బెడ్ దగ్గరికి వెళ్లడం నలుగురికీ నేనూ ఆమే ఎగ్జిబిట్స్

కావటం నాకు యిష్టంలేదు ఆమె పలకరింపుకి నా మొహంలో వెలుగు లాంటిది కలిగివుంటుంది బహుశా

'నిన్నటి ప్రశ్నకు జవాబు యివ్వనే లేదు మీరు!' నిష్ఠూరంగా అంది

ఆమె ప్రక్కన మాగ జైన్స్ యింగ్లీషువే ఎక్కువగా వున్నాయి

'మీకు లిటరేచర్ అంటే యిష్టంలా వుంది'

'మీరు మాట మరిపిస్తున్నారు'

'అహ! అదేంలేదు మీరు నిన్న అడిగిన ప్రశ్న మరచిపోయాను ఏమన్నాడు టెలిపతీ మీద నమ్మకమా, అని కదూ అడిగారు!'

'ఆ!'

'వుంది' అంతలోనే గంభీరంగా మారిపోయాను

'ఒకో్క వ్యక్తిని మొదటిసారి చూస్తున్నా అకారణంగా చిరాకు, ఇంకో వ్యక్తిని చూస్తే ప్రేమ యివన్నీ దాని వల్లే అని నా నమ్మకం అలాగే ఒకో్క మనిషితో మనం మాట్లాడకపోయినా మనకి తెలుస్తుంది, అతనికి మనమంటే విపరీతమైన ద్వేషమైనా, యిష్టమైనా వుంటే నేను చదువుకునే రోజుల్లో ఒకతను అంటే నాకు విపరీతమైన ఇష్టంవుండేది ఎందుకో గానీ'

'అతను నాతోపాటు బస్సులో వచ్చే వాడు అతను నాకు దరిదాపుల్లో ఎక్కడ వున్నా నాకు తెలిసేది,' అనేసి! 'మీకు రాత్రి నిద్రలేదు కదూ', అని సంభాషణ కావాలనే మార్చేశాను

అమృత నవ్వాలని ప్రయత్నం చేసింది 'లేదు రాత్రంతా కలలతో అలజడితో నిద్రపట్టలేదు ఏవో పీడ కలలు'

కుతూహలంగా ముందుకు జరిగాను.

'మంటలు నన్ను చుట్టుముట్టి కబళించేసే మంటలు కెవ్వున అరవాలను కుంటాను కానీ అరవలేను'

నా ఆశ్చర్యం నేను వ్యక్తపరచ లేదు ఆమె బ్రతుకు నాకు తెలుసు. మనిషికి ఆశ పెంచడం నాకు యిష్టం లేదు ఆమెమీద వున్న నా యిష్టాన్ని నేనే సమాధి చేసుకుంటున్నాను

* * *

ఆ రోజు అవుట్ పేషెంట్స్‌ని చూసేరోజు కనుక అమృత దగ్గరకు వెళ్ళేసరికి ఆలస్యం అయింది

మధ్యలో కొంచెం తీరిక వున్నా ఆమెతో గడిపేయటం అలవాటయింది.

ఆమెలో నన్ను బాగా ఆకర్షించినవి ఆమె కళ్ళు అసలు పేషెంట్సు కళ్ళు జీవంలేనట్లు వుంటాయి కానీ అదేమి విచిత్రమో ఆమె కళ్ళుమాత్రం మిల మిల మెరుస్తూ వుంటాయి అల్చిప్ప ల్లాంటి కళ్ళు ఆమె మౌనంగావున్నా కబుర్లు చెబుతున్నట్లే టపటప లాడుతూ వుంటాయి విపి చూసి కేస్‌షీట్ చేతి లోకి తీసుకుంటూ అడిగాను




'ఇన్ని యేళ్లూ ఎందుకు అశ్రద్ధచేశావ్ అమృతా ?'

'ఇప్పుడైనా వచ్చేదానినికాను కానీ ఓ కోరిక పుట్టింది చరమాంకం హాస్పిటల్‌లో గడపాలని '

'అమృతా ' నాకు తెలియకుండా గద్గదికంగా వచ్చింది ఆ పిలుపు

'సారీ డాక్టర్ ' దెబ్బతిన్నదానిలా చూడడం ఆమెవంతు అయింది ఈసారి

నేను ఆమెవైపు చూశాను

అమృతి కళ్ళు వాల్చుకుంది

'ఎవరున్నారు అని వస్తాను డాక్టర్ అదేమి అదృష్టమో అందరూ వుండీ అనాథను అయాను కట్నం లేకుండా చేసుకున్నాడు అతను ఈ అందం అతని విశాల హృదయాన్ని పాపం ఆకట్టుకుంది

'చివరికి ఈ అందమే నాకు శత్రువై నన్ను కాటేసింది బయట నిల్చుంటే అనుమానం అతనికి కూర్చుంటే అనుమానం పోస్టుమాన్ దగ్గర్నుంచి ఎలక్ట్రిక్ బిల్ చూసే అతనివరకూ నాతో సంబంధం పెట్టుకున్నట్లే ప్రచారం చేశాడు వీలుదొరికితే చావబాది తృప్తి పడేవాడు '

'ఒక మాటలో చెప్పాలంటే నా కలలో కనబడ్డ మనిషితో నాకు సంబంధం అంటగట్టి మీకు అర్థంకాదు పోనియ్యండి.'

ముఖం అటు తిప్పుకుంది

నేను అక్కడ్నుంచి ముందుకు అడుగువేశాను

అయితే అమృతకు పెళ్ళి అయిందా? ఆమె మెళ్ళో వాటి తాలూకు చిహ్నాలే లేవే? అతనులేడేమో! మరి ఆ బొట్టు ప్రేమ గుడ్డిదేకాదు చెవిటిదికూడానేమో? అందుకే నా ఈ గుండె అమృతకోసం

పరితపిస్తోంది. ప్రపంచంలో అందని వాటికి విలువలు ఎక్కువగా వుంటాయి. మమకారం వాటిమీదే వుంటుంది.

రేపో మాపో రాలిపోతుందని తెలిసినా అమృతమీద నాకింత అనురాగం దేనికి? బహుశః నిమిషమాత్రం వుండే పారిజాతం పరిమళంలా అమృత ప్రేమ ఈ జీవిత కాలానికి సరిపోతుంది నాకు!

* * *

ఆ రోజు

'డాక్టర్!' అమృత పిలుపు నన్ను పక్కనేవున్న స్టూల్ మీద కూర్చోబెట్టింది.

'చెప్పు?'

'మిమ్మల్ని పెలిపతీ గురించి అడిగాను గుర్తుందా! చెబితే పిచ్చిదానిని అనుకుంటారేమో డాక్టర్. నాకు చెప్పుకుందుకు ఎవరూలేరు. ఎవరో ఒక యువకుడు బహుశః ముప్పై ఏళ్ళు వుండివుంటాయి. అతని రూపురేఖలు స్పష్టంగా కనబడతాయి. రోజూ నేను పడుకున్న సమయానికి లీలగా ప్రత్యక్షం అవుతాడు!'

'ఒకటీ రెండూకాదు పదేళ్ళనుంచీ చూస్తున్నాను అతనిని! కల అనుకుంటే రోజూ అదే కల రావటం ఏమిటి?'

'వూఁ' నాకు యింకా వినాలనివుంది.

'ఏదో అభ్యర్థిస్తున్నట్లు వుంటాయి అతని చేష్టలు! అతను విచిత్రంగా నడుస్తాడు. తడుముకుంటూ నడిచినట్లు నడుస్తాడు. అతను ఎవరై వుంటాడు?'

'అతను ఎవరై వుంటాడు?' నేనామె వైపు చూశాను.

తల అడ్డంగా తిప్పింది అమృత. 'తెలియదు. నేను యింతకు ముందెన్నడూ చూడలేదు.'

'ఇప్పుడు కూడా నా?' ముందుకు వొంగాను.

'వుహూఁ'.

'ఎవరైనా ప్రేమభిక్ష అర్థిస్తున్నారేమో!' కవ్వింపుగా అన్నాను!

'మగబుద్ధి.'

'అత నెవరన్న ప్రశ్న మా ఆయన్ని అడిగితే ఆవగింజ అంత అతనికి అనుమానం మహావృక్షం అయింది. అది భరించలేకనే నేను తెగతెంపులు చేసుకున్నది' అంది.

సడన్‌గా నాకో అయిడియా తట్టింది.

'పోనీ అతని చిత్రం గీసి పైర్చి చేయరాదా?'

'అయిడియా బాగుంది. కానీ నాకు బొమ్మలు వేయడం రాదే! పిల్లి వేయమంటే కోతి వేసే రకాన్ని.'

'ప్రయత్నించండి. పదేళ్ళనుంచీ చూస్తున్న ముఖంకదా!' అనేసి వెళ్ళిపోయాను.

మర్నాడు నేను వెళ్ళేసరికి అమృత బెడ్‌మీద కుప్పలు కుప్పలుగా కాగితాలు వున్నాయి. స్కెచ్ పెన్‌తో కాగితం మీద గీస్తూవున్న ఆమె నా రాకను గమనించలేదు.



'ఈసారి ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో మీ చిత్రాలని ప్రదర్శించవచ్చును.'

వులిక్కిపడింది అమృత.

మాట్లాడకుండా ఓ ఐదారు కాగితాలు తీసి చేతిలో పెట్టింది.

ఒక్క చిత్రమూ సరిగా లేదు.

తను గీస్తున్న చిత్రం చూశాను. ఎవరో యువకుడు. నొక్కుల జుట్టు. పెదవులమీద సన్నటి నవ్వు. చెంపల వరకూ జుట్టూ. సన్నగా, పొడుగ్గా వున్న ముక్కు, ఆ కళ్ళు....వులిక్కిపడ్డాను.

ఆ కళ్ళల్లో జీవంలేదు.

'ఎంతో ప్రయత్నించాను. కానీ నా వల్లకాదు బాబు యింతకంటే బాగా రాదు. ఆ కళ్ళు గీయటం మాత్రం రావడం లేదు. ఏదో వొణుకు; యితనే నాకు పదేళ్ళనుంచీ కల్లో కన్పిస్తున్నది.'

నా కళ్లు యింకా ఆ చిత్రాన్నే పరిశీలిస్తున్నాయి.

'కావాలంటే నా కళ్లు పీకి పెడతాను ఆ బొమ్మకి.'

నా చేతిలోంచి కాగితం జారిపడింది.

'అలా అనకు అమృతా.'

'చూడండి డాక్టర్ మనిషికి చాలా స్వార్థం. తను వెళ్ళిపోయినా తన గుర్తుగా ఏవో మిగిల్చి వెళ్ళాలి అనుకుంటాడు. ఆస్తిపరుడు ఆస్తి వదలి వెళ్తాడు.'

'మీరు రచయితలు. మీరు పోయిన తరువాత మీ రచనల వల్ల కీర్తి వుంటుంది'

'యింక నాలాంటి సామాన్యురాలు ఏం మిగల్చగలదు, కళ్లు, గుండె తప్ప?'

'నా గుండె రోగాలపుట్ట అందుకే కళ్లు యిస్తాను. నేను పోయిన తర్వాత నైనా ఈ లోకాన్ని చూడగల్గుతాను.' క్షణం ఆగి తనలో తాను అనుకుంటు న్నట్లుగా అంది. ఇప్పుడిప్పుడే జీవితం మీద ఆశ చిగురిస్తోంది డాక్టర్! ఒక మనిషికోసం బ్రతకాలనుంది. కానీ ఇప్పటికే చాలా ఆలస్యం అయింది.

'అమృతా!'

నేను యింకా ఏదో చెప్పేలోపల ఛీఫ్ అర్జంటుగా రమ్మన్నాడని కబురు వచ్చింది. అసలే చండశాసనుడు. క్షణం అక్కడ నిలవకుండా వెళ్ళాను.

* * *

మర్నాడు వార్డుకు వెళ్ళిన నాకు అమృత బెడ్‌చుట్టూ ఆకుపచ్చని స్క్రీన్ కనిపించింది.

ఎన్నో ఆశలతో, నన్ను నేను వంచించుకుంటూ వచ్చిన నాకు ఆ క్షణాన దేవుడు నవ్వుతూ 'నేనే గెలిచానోయ్ పిచ్చి మొహమా!' అన్నట్లుంది. శిలలా నిలబడిపోయాను.

అమృత యింకలేదు. నా గుండెల్లోంచి ఈ మాటలు యిప్పటివరకూ ఎవరూ వినలేదు. వొంటరిగా ఏడవడం కూడా వరం అయితే నాకు ఆ అదృష్టం కూడా లేదు

'సార్ ఆ పేషెంట్ మీకిది యివ్వమంది'

ఎవరిచ్చారో చూడనవసరం లేదు. అమృత యిచ్చి వుంటుందని గ్రహించాను.

రాధాకృష్ణా (సారీ డాక్టర్)!

బ్రతకాలనే అనుకున్నాను, నీ కోసం. బలీయమైన శక్తి నన్ను ఓడించి తను గెల్చింది.

దీనితోపాటు వున్న చిత్రం నువ్వు కోరితే నేను గీసింది కనుక వుంచుకోవూ.

మరి సెలవ్.

—అమృత

* * *

ఐదేళ్ళు గడిచిపోయాయి. నేను హాస్పిటల్‌నుంచి రిజైన్‌చేసి ఓ పల్లెటూరులో ప్రాక్టీస్ పెట్టాను. ఇదివరకంత బాధించడంలేదు అమృత జ్ఞాపకాలు.

నా కన్సల్టింగ్ రూమ్‌లోని డ్రాలో అమృత గీసిన చిత్రం యిప్పటికీ వుంది. దాన్ని చూస్తూ అమృతని తలుచుకుంటాను.

పుస్తకాలతో, పేషెంట్స్‌తో నాకు రోజులు గడుస్తున్నాయి. రోజూకన్న యివాళ అమృత నన్ను వెన్నాడుతోంది. నా ఎదుట నిల్చుని 'పెలిపతీమీద నమ్మకం వుందా?' అని అమృత అడుగుతున్నట్టు వుంది మనసేమీ బాగులేదు

పేషెంట్స్ అందరూ వెళ్ళిపోయారు. కాంపౌండర్‌ని కూడా వెళ్ళనిచ్చి నేను

తలుపులు వేయబోతున్నాను. హఠా వుడిగా లోపలికి వచ్చాడు అతను.

'మీరేనాండి డాక్టర్ రాధాకృష్ణ'.

'వూఁ.' తల భుజంమీదుగా తిప్పి ఆ వైపు చూశాను.

నొక్కుల జుట్టు, కూలింగ్ గ్లాసెస్ పెట్టుకున్న అతను పొడుగ్గా సన్నగా వున్నాడు.

నాకు రాత్రిపూట కూలింగ్ గ్లాసెస్ పెట్టేవాళ్ళు అంటే చిరాకు.

'నా పేరు భార్గవ. ఓ పేషెంట్ గురించి అడగటానికి మీ దగ్గరకి వచ్చాను.'

'చెప్పండి.' కుర్చీ చూపించి అతన్ని కూర్చోమని నేనూ కూర్చున్నాను.

ఐదేళ్ళక్రితం మీరు ఉస్మానియాలో పనిచేసేటప్పుడు ఓ పేషెంట్ వుండేది. పేరు అమృత! మీకు గుర్తుందా?' అతను ఆతృతగా, ఎప్పుడెప్పుడు విష యాలన్నీ విందామా అన్నట్లున్నాడు. కొద్దిగా ముందుకి జరిగి ఆసక్తిగా నా వైపు చూశాడు.

'నన్ను నేను మరిచిపోతేకదా అమృ తని మరిచిపోయేది?' సమాధానంగా తల వూపాను.

'ఆమె పుణ్యమా అని నేను ఇవాళ లోకాన్ని చూడగల్గుతున్నాను అతి ప్రయత్నంమీద ఆమె పేరూ ఆమెవున్న హాస్పటల్ తెలుసుకుని అక్కడికి వెడితే వాళ్ళు మీపేరు చెప్పారు. మీరు ఆమెతో ....అతను నాలుక కరుచుకుని తిరిగి మొదలు పెట్టాడు.

'ఆమె మీతో చనువుగా వుండే వారట కదా డాక్టర్! ఆమె ఫొటో-కనీసం ఆమె గుర్తులు ఏవివున్నా ఓ సారి ఇస్తారా? నేను ఈ లోకం అంతా చూసినా ఆమెను చూడనంత కాలం అంధుడినే! అతను ఎవరో తరుముకుని వచ్చినట్లు వాగుతున్నాడు.

అతనివైపు జాలిగా చూశాను. కృతజ్ఞత యీ రూపంలో యీ రాత్రి వెతుక్కుంటూ వచ్చింది అనిపించింది.

డ్రాయరు తీసిన నేను వులిక్కి పడ్డాను.

'అమృత గీసిన చిత్రం.'

'ఇతను' మార్చి మార్చి చూస్తూండి పోయాను. అతని చిత్రం అమృత ఎందుకు గీసింది? ఎలా గీసింది?

'ఏం డాక్టర్?' అతను కళ్ళద్దాలు తీసి కర్చీఫ్ తో తుడుచుకుంటూ నా వైపు చూశాడు. ఆ 'కళ్ళు'....అతని కళ్ళ ల్లోంచి అమృత నవ్వి సమాధానం చెప్పి నట్లు అయింది.

అంతే—



సి.యస్.రావు సీరియల్

# కాంచన కుటీరం



## 12

రాజశేఖరం నెలరోజుల పసికందును తీసుకొని ఓనాటి సాయంకాలం కాంచన కుటీరంలోకి అడుగు పెట్టాడు ఆయన వెనకనే ఓ పనివాడి చేతుల్లో వున్న పసి బిడ్డను రాఘవయ్యా, దివాణంలోని పని వారూ 'ఎవరు ?' అన్నట్టు ఆశ్చర్యంతో చూశారు కాని ఆ పసిపాప ఎవరు అని ఎవ్వరూ అడగలేదు

రాజశేఖరం రాజీ ఆయాను పిల్చాడు. పనివాడి చేతుల్లోని పసిపాపను ఆవిడకు చూపిస్తూ, "ఈ పాపను మన రాజేష్, చైతన్యలతో పాటే జాగ్రత్తగా పెంచాలి ఆయా," అన్నాడు

ఆ పసిపాపను తన ఒళ్లోకి తీసుకుంటూ -"చిత్తం అలాగే" అంది రాజీ ఆయా

రాఘవయ్య అంతా గమనిస్తూనే వున్నాడు

ఆ పసిపాప ఎవరూ, ఏమిటి? అని ఆయన అడగలేదు అడగదగినవాడూ, అడగగలిగినవాడూ ఆయనొక్కడే, ఆయనే అడగనప్పుడు ఆ కాంచన కుటీరంలో మరెవ్వరూ అడగరు ఆ పసిపాప ఎవరో తెల్సుకోవాలన్న కుతూహలం రాఘవయ్యకూ ఉంది, దివాణంలోని అందరికీ వుంది కాని రాజశేఖరం, చెబితేనేగానీ ఎవ్వరికీ నిజం తెలియదు అంతవరకూ వూహలు మాత్రమే మిగులుతాయి

రాజశేఖరం ఏకాంతంగా తన గదిలో విశ్రాంతి తీసుకుంటున్నాడు

శ్రావణి దగ్గర్నుంచి ఆ పసిపాపను తీసుకొచ్చి రాజీ ఆయాకు అప్పగించిన తర్వాత ఓ పెద్ద బాధ్యత తీరిపోయినట్లు అనిపించింది అతనికి కాని రాజేశ్వరమ్మ పోయినప్పట్నుంచీ శ్రావణితో చే ఎక్కువ కాలం గడపటంతో ఆమెను గురించి ఆలోచించకుండా వుండలేక పోతున్నాడు ఎంత వద్దనుకున్నా శ్రావణి ఆ పసికందును తన చేతుల్లో పెట్టిన ఘడియలు అతను మర్చిపోలేక పోతున్నాడు శ్రావణి తన సుఖాన్నే కోరుకొని కన్నబిడ్డను ఏ అనాధాశ్రమం లోనో విడిచి తనవెంట కాంచన కుటీరానికి రావడానికి అంగీకరించలేదు ఆమె తన బిడ్డ సుఖాన్నే కోరుకుంది అమ్మగానే ప్రవర్తించిందిగానీ వయస్సులో వున్న ఆడదానిగా ప్రవర్తించలేదు అందుకే ఆమె అంటే రాజశేఖరానికి మరింత గౌరవం పెరిగింది ఆమె అంటే గౌరవం, ప్రేమ ఉన్నా తన వంశ గౌరవం కోసం, ఆమెను దూరంచేసుకోక తప్పలేదు అతనికి ఆ పసిపాపను తన చేతుల్లో పెడుతూ - "మీరు బయటికి చెప్పకపోయినా ఇకనుంచీ ఈ పాపకు అమ్మా, నాన్నా మీరే!" అని శ్రావణి అన్న మాటలు అతనికి పదే పదే గుర్తుకువస్తూనే వున్నాయి తాను ఆమెకు డబ్బు యిచ్చినప్పుడు ఆమె వొద్దని వారిస్తూ, మీ పరిచయంలేని క్రితం నాకు డబ్బులేదు ఈ కొండలోయల్లో ఈ పండ్లతోటల్లో, ఈ పడవల మధ్య డబ్బు లేకుండానే బతికాను ఇప్పుడూ అలాగే బతుకుతాను కాని ఇప్పుడు వున్నదీ, ఇదివరకు నాకు లేనిదీ ఒకటుంది" అంది తలవంచుకొని శ్రావణి

"ఏమిటది?" అన్నాడు రాజశేఖరం.

"మీ జ్ఞాపకం అమ్మనయ్యాననే తృప్తి, ఒంటరినైపోయాననే అసంతృప్తి చూశారా చిత్రం! మీ పరిచయం కలగని క్రితం వొంటరిదాన్నే అయినా ఎప్పుడూ ఒంటరిదాన్నని అనిపించలేదు మీతో పరిచయం అయిన

తర్వాత నా అన్నవాళ్లు నా కెంతో మంది వచ్చారనుకున్నాను మీవల్ల అమ్మనై ఓ పాపను కని, ఆ పాపను మీ కప్పగించి, పాపకూ మీకూ కూడా దూరమై ఇప్పుడు నిజంగా వొంటరిదాన్ని అనుకుంటున్నాను," అంది శ్రావణి

అప్పుడు రాజశేఖరం మాటిచ్చాడు "ఏటా ఒక్కసారైనా వస్తాను నిన్ను చూస్తాను నువ్వు కాంచన కుటీరానికి రాకూడదన్నానుగానీ, నేను కాశ్మీర్ కు రానసలేదుగా!" అని.

అలా శ్రావణిని ఒంటరిదాన్నిచేసి రాజశేఖరం పసిపాపను తీసుకొని కాంచన కుటీరానికి వచ్చిన రోజు — ఏనాడూ మరిచిపోలేదు

రాజీ ఆయా ఆ పసిపాపను ఎంతో ఆప్యాయంగానే పెంచుతోంది రాజేష్, చైతన్య ఆ పసిపాపను చూసి 'పాపః పాపః' అంటూ ముచ్చటపడసాగారు

ఆ పాప కాంచన కుటీరానికొచ్చి రెండు మాసాలు కావస్తోంది ఎప్పటి కప్పుడే జరిగిందంతా రాఘవయ్యతో చెప్పాలని అనుకొనేవాడు రాజశేఖరం కాని చెప్పలేకపోయేవాడు అలాగే రాఘవయ్యా అడగాలనుకొనేవాడు అడిగితే రాజశేఖరం నొచ్చుకుంటాడేమోనని అడగలేకపోయాడు ఈ దివాణంలో ఎంతోమంది బ్రతుకుతున్నారు ఆ పసిపాప ఒక్కత్తే బరువా! అని సరిపెట్టుకున్నాడు రాఘవయ్య

పాపకు పాకే వయసొచ్చింది.

రాజీ ఆయా ఎంత కట్టుళ్లలో పెట్టినా, ఎక్కువసేపు తన చంకన వుంచుకున్నా ఏదో సమయంలో చంకదిగి, ఆమె వొడిలోంచి తప్పించుకొని పాకడానికి ప్రయత్నించేది పాప చాల చలాకీగా వుండేది

ఒకనాడు రాజశేఖరమూ, రాఘవయ్యా హాల్లో మాట్లాడుకుంటూ వుండగా పాప పాకుతూ వాళ్లిద్దరి మధ్య కొచ్చింది. రాఘవయ్య ఆ పాపను ఎత్తుకొని, ముద్దాడుతూ — "పాప మన దివాణాని కొచ్చి ఆర్నెల్లు కావస్తోంది అంతా 'పాపః పాపః' అనే పిలుస్తున్నారు. నామకరణం చేస్తే బావుంటుందిగా," అన్నాడు

రాజశేఖరం ఒక్కసారి పాపను కళ్లారా చూసి, బుగ్గమీద చిటికెవేసి — "నీకు నచ్చిన పేరూ, పాపకు తగిన పేరూ ఆలోచించి, నువ్వే పెట్టు" అన్నాడు

"ఏమిటో ఈ ఋణానుబంధం. ఎక్కడ పుట్టిందో, ఎవరికి పుట్టిందో — తమ పిల్లలతోపాటు కాంచన కుటీరంలో పెరుగుతూంది కన్నతల్లిచేతా, తండ్రి చేతా పేరు పెట్టించుకోవల్సింది, నాచేత పెట్టించుకుంటోంది" అన్నాడు రాఘవయ్య

ఆ మాటలకు రాజశేఖరం కాస్త ఇబ్బందిలో పడ్డాడు.

"సరే, దానిదేముంది? పుట్టడానికి అమ్మా నాన్నా కావాలి పెరగడానికి ఎక్కడైనా, ఎలాగైనా పెరగొచ్చు ఈ విషయాలు మనం తర్వాత మాట్లాడు కుందాం ముందు పాపకు ఓ పేరు ఆలోచించు," అన్నాడు రాజశేఖరం

"ఆలోచించడానికేముంది! రాజేశ్వ రమ్మగారికి నచ్చిన రాగం, మీకు నచ్చిన రాగం 'కల్యాణి' గదా! పాపకు 'కల్యాణి' అని నామకరణం చేద్దాం," అన్నాడు రాఘవయ్య

"బావుంది చాలా బావుంది నువ్వు పెట్టిన పేరుతో ఈ కల్యాణి గొప్ప గాయని అవుతుందేమో!" అన్నాడు రాజశేఖరం నవ్వుతూ

"కాంచనకుటీరం ఆదినుంచీ కళలకూ, సాహిత్యానికీ పుట్టినిల్లు రాజేశ్వరమ్మగారు వీణను చేపడితే సరస్వతినే మరిపించేవారు ఆమె చెలికత్తెగా వచ్చిన శ్రావణి కూడా అంత గొప్పగానూ వీణపై ఆలపించలిగేది ఈ దివాణంలోకి పసిపాపగా వచ్చిన కల్యాణి అంతటిది కాకూడదనేదేముంది!"

"అవును నేను అడగటమే మర్చాను శ్రావణి వాళ్ల దేశం వెళ్లిపోయిందా? లేక మీరే పంపించేశారా?" అన్నాడు రాఘవయ్య

"ఆ విషయమే నేనూ చెప్పాలను కున్నాను రండి" అంటూ రాఘవయ్యను తన గదిలోకి తీసుకెళ్లాడు రాజశేఖరం

రాజశేఖరం శ్రావణి గురించి ఏం చెబుతాడోనని రాఘవయ్య ఎదురుచూస్తు న్నాడు

"శ్రావణి ప్రకృతిలో ప్రకృతిలా చాల స్వేచ్ఛగా తిరిగిన పిల్ల మేం ఇద్దరం కాశ్మీర్ వెళ్లాం కొన్ని రోజులు గడిపాం ఒక రోజున 'ఇక మనం కాంచన కుటీరానికి బయల్దేరదామా?' అన్నాను 'నాకు ఇక్కడే బావుంది ఇక్కడే వుండిపోదాం' అంది శ్రావణి కాంచన కుటీరాన్ని వొదిలి నేను ఎలా వుండగలను చెప్పు రాఘవయ్యా! కాంచన కుటీరాన్ని వొదిలి నేను వుండలే నప్పుడు కాశ్మీర్‌ను వొదిలి శ్రావణిని మనతో వుండమనే హక్కు మన కేముంది? ఎవరి జన్మస్థలంమీద వారికి మమకారం వుండటం సహజం అందుకే డబ్బిస్తాను తీసుకోమన్నాను అక్కర్లే దంది ఆమెను కాశ్మీర్‌లోనే వొదిలి నేను వచ్చేశాను," అని వివరించాడు రాజశేఖరం శ్రావణిని గురించి

"మరి యీ పాప?" అన్నాడు రాఘవయ్య

ఆ ప్రశ్న రాఘవయ్య వేస్తాడని ముందే వూహించిన రాజశేఖరం చిరునవ్వు నవ్వి, "ఈ పాపకూ శ్రావణికీ ఏం సంబంధంలేదు," అన్నాడు

"సంబంధం వుందని నేను అనలేదు, అనుకోనూలేదు ఎవరికి తెలియక పోయినా ఈ పాప ఎవరో నాకైనా

తెలియడం మంచిదిగదా!" అన్నాడు రాఘవయ్య

"తప్పకుండా రాఘవయ్యా! నన్ను పూర్తిగా ఎరిగినవాడివి నా గురించీ, నేను తెచ్చిన యీ పాప గురించీ, పాపకూ నాకూ మధ్య వున్న అనుబంధం గురించీ నీకు తెలియాలి పాప ఈ ఇంటి ఆడబడుచుకాకపోయినా నా బిడ్డ లాంటిది నా ఆత్మీయుల సంతతి నా కప్పగించారు రాజేష్, చైతన్యలతో సమంగా చూసుకుంటానని మాటిచ్చాను" అన్నాడు రాజశేఖరం

రాజశేఖరం మాటల ధోరణి చూస్తే కల్యాణి గురించి అంతకంటే విపులంగా చెప్పే ఉద్దేశం లేనట్టు కనిపించింది రాఘవయ్యకు

"ఎవరి బిడ్డ అయితేనేం లెండి! మన దివాణానికొచ్చింది మీ ఆశ్రయాన్ని పొందగలిగింది మన రాజేష్‌కూ, చైతన్యకూ తోబుట్టువు లేకపోయినా తోడుగా వుంటుంది లక్షణమైన పిల్ల ఎంతటి పెద్ద దివాణమైనా నట్టింట ఆడపిల్ల మసులుతూంటేనే గదా అందం లేకపోతే సిరి లేని వైకుంఠంలా వెల వెలా పోతుంది," అన్నాడు రాఘవయ్య

"అందుకేనేమో ఆడపిల్ల లక్ష్మితో సమానమంటారు," అన్నాడు రాజశేఖరం

అలా శ్రావణి గురించి, శ్రావణికీ తనకూ పుట్టిన కల్యాణి గురించీ నిజాన్ని తన గుండెల్లోనే దాచుకొన్నాడు రాజశేఖరం

ప్రస్తుతం రాజశేఖరం గతించిన రాజేశ్వరమ్మ ఎడబాటు గురించిగానీ తాను దూరం చేసుకున్న శ్రావణి గురించిగానీ ఎక్కువగా ఆలోచించడంలేదు. ధర్మకార్యాలతోనూ, దైవధ్యానంతోనూ, కావ్యపఠనంతోనూ కాలాన్ని గడుపుతున్నాడు రాజశేఖరం అతనిలో ఏదో చిత్రమైన మార్పు వొచ్చింది ఒక విధమైన వైరాగ్యం ఏర్పడింది

రాజేష్, చైతన్యా, కల్యాణి పెద్ద వాళ్ళు అవుతున్నారు కలిసి మెలిసి ఆడుకుంటున్నారు

రాజేష్, చైతన్యా రాజశేఖరాన్ని 'నాన్నగారూ!' అని పిలుస్తారు కల్యాణి మాత్రం 'బాపూజీ' అని పిలుస్తుంది రాజశేఖరాన్ని అలా పిలవమని నేర్పినది రాజీ ఆయాయే

ముగ్గురు పిల్లల్లో రాజేష్ పన్నెండేళ్ళ వాడయ్యాడు చైతన్యకు పదేళ్ళు, కల్యాణికి ఎనిమిదేళ్ళు వచ్చాయి ముగ్గురికీ కాంచన కుటీరంలోనే చదువులు చెప్పిస్తున్నాడు రాఘవయ్య రాజేష్ అంత చురుకైనవాడు కాదు కాస్త మందకొడిగా వుంటాడు ఎప్పుడూ వొంటరిగా కూర్చుని కాగితంమీద ఏవేవో పిచ్చిగీతలు గీస్తూ వుండేవాడు మితభాషి చైతన్య అలా కాదు తాను అనుకొన్నది చేస్తాడు ధైర్యంగా



తండ్రినో, రాఘవయ్యనో కావాల్సింది అడుగుతాడు. ఆటల్లో, పాటల్లో కల్యాణిని ఏడిపిస్తూ వుంటాడు. అందుకే కల్యాణి ఎక్కువగా రాజేష్‌కే చేరువుగా ఉండేది. అతను కాగితాలమీద గీసిన గీతల్నీ, బొమ్మల్నీ బావున్నాయని మెచ్చుకొనేది. అలా రాజేష్, కల్యాణీ ఒక జట్టుగానూ, చైతన్య ఒక్కడూ విడిగానూ ఉండే వారు. రాజేష్‌కు బొమ్మలు గీయడమంటే సరదా అని గ్రహించిన రాఘవయ్య బొంబాయి నుంచి ఒక చిత్రకారుణ్ణి పిలి పించి, చిత్రలేఖనం నేర్పిస్తున్నాడు. చైతన్య స్కూల్లో చేరి చదువుకుంటానని మారాం చేస్తే, వూర్లోవున్న హైస్కూల్లోనే చేర్పించాడు. దివాణంలోని ఆడ వారు బయటకు వెళ్ళే అచారం లేదు కాబట్టి కల్యాణికి దివాణంలోనే చదువూ, సంగీతం నేర్పిస్తున్నాడు. అలా ముగ్గురు పిల్లలు పెరుగుతున్నారు.

ఒకనాడు కల్యాణి "బాపూజీ!" అంటూ రాజశేఖరం గదిలోకి వెళ్ళింది. పట్టుపరికిణీ, పట్టుజాకెట్టు, పాదాలకు బంగారు హంసమంజీరాలు, బంగారిపు బొమ్మలాంటి అందం, తీయని స్వరం గల కల్యాణిని దివాణంలోని అందరూ అల్లారుముద్దుగా చూసుకుంటున్నారు. రాజశేఖరానికి కూడా కల్యాణంటే గారా బమే. కల్యాణి అతని గదిలోకి వెళ్ళే సరికి రాజశేఖరం గదిలో లేడు. బాలీసు మీద వున్న వీణ దగ్గరకు వెళ్ళింది కల్యాణి. వీణమీద కప్పివున్న ముఖ్మల్ గుడ్డకప్పును తీసి శుభ్రంచేసి వీణకు శ్రుతి చేసింది. నెమ్మదిగా మీటసాగింది. అంతలో రాజశేఖరం గదిలో కొచ్చాడు. ఆ పిల్లకు తెలియకుండానే నెమ్మదిగా, చేరువుగా వెళ్ళి పక్కనే కూర్చున్నాడు.

స్వరాలు ఆలపించసాగింది కల్యాణి. రాజశేఖరం కళ్ళు ఏదో ఆనందంతో మెరిసిపోతున్నాయి. అనుకోకుండా కల్యాణి తలను ఆప్యాయంగా నిమిరాడు. కళ్యాణి వులిక్కిపడింది. వీణ పక్కకు పెట్టింది.

రాజశేఖరం నవ్వుకొని, "వీణకూడా నేర్చుకున్నావన్నమాట!" అన్నాడు.

"అంత బాగారాదు బాపూజీ!" అంది కళ్యాణి వినయంగా.

"ఇంకా చిన్నదానవు కదమ్మా! కొన్నాళ్ళుపోతే ఇంకా బాగా వస్తుంది" అన్నాడు రాజశేఖరం.

"నాకు వీణ కావాలి బాపూజీ" అంది కళ్యాణి.

"ఈ వీణ నీదేనమ్మా!" అన్నాడు రాజశేఖరం.

ఇంతలో ఏదో అలికిడి కావడంతో కల్యాణి పక్కనే కూర్చున్న రాజశేఖరం లేచి, "నువ్వు ఎప్పుడు కావాలంటే అప్పుడొచ్చి ఈ వీణమీద సాధన చేసుకో," అని బయటకు వెళ్లిపోయాడు.

ఆ క్షణంలో రాజశేఖరం, కల్యాణిలో శ్రావణిని చూశాడు.

## 13

సాయంత్రపు వేళ.

కాంచన కుటీరం వెనకవున్న కొలను వొడ్డున రాజశేఖరయీ, రాఘవయ్యా ఎస్టేటు వ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు. రాజేష్‌కు చిత్రలేఖనం నేర్పడానికి బొంబాయి నుంచి వచ్చిన మాస్టారు వారిదగ్గర కొచ్చి నమస్కారం చేసాడు.

"రండి. కూర్చోండి" అంటూ ఆహ్వానించాడు రాజశేఖరం మాస్టార్ని. ఎదురుగా వున్న సిమెంట్ సోఫా మీద మాస్టారు కూర్చున్నాడు.

"రాజేష్ బాబుకు చిత్రలేఖనంలోనూ, పెయింటింగ్‌లోనూ రాను రాను అభిరుచి పెరిగింది. చిత్రలేఖనంలో నా అంతటి వాడయ్యాడని ధైర్యంగా చెప్పగలను. ఇక పెయింటింగ్ నేర్చుకోవడానికి రాజేష్ బాబును నా వెంట బొంబాయి పంపిస్తే, రెండు మూడేళ్ళలో సంపూర్ణ ప్రజ్ఞాపాటవాలను సాధిస్తాడు. ఈ విషయం తమకు విన్నవిద్దామని వచ్చాను," అన్నాడు మాస్టారు.

"సరే, అతని కంత అభిరుచి వుంటే అలాగే కానివ్వండి," అన్నాడు రాజశేఖరం.

ఆ మాటమీద రాఘవయ్య "అభిరుచి వుంటే అని నెమ్మదిగా అంటారేమిటి? మొన్న నన్ను ఇదే సోఫాలో కూర్చోబెట్టి అరగటంలో నా బొమ్మను కాగితం మీద దించాడు. ఎక్కువ మాట్లాడడు గానీ, ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటాడు. అతని గదినిండా అతను గీసిన బొమ్మలే," అన్నాడు.

"అదొక చిన్న ఆర్ట్‌గాలరీ" అన్నాడు మాస్టారు.

రాజేష్ గురించి రాఘవయ్యా, మాస్టారూ అలా పొగుడుతూంటే రాజశేఖరం లోలోపలే మురిసిపోయాడు.

"అయితే త్వరలోనే రాజేష్ బొంబాయి ప్రయాణానికి ఏర్పాటు

చేయి రాఘవయ్యా! బొంబాయిలో ఏ ఆర్ట్ స్కూల్లో బాబు చదువుకుంటున్నా మీరు బాబుతోపాటే వుండాలి మాస్టారూ. ఇలా దివాణాల్లో పెరిగిన పిల్లలకు బయట ప్రపంచం గురించి అంత బాగా తెలియదు. అక్కడ మీరే సంరక్షకులుగా వ్యవహరించాలి," అని రాఘవయ్యనూ, మాస్టార్నూ ఆదేశించాడు రాజశేఖరం.

"ఆ మాట మీరు వేరే చెప్పాలా! అది నా బాధ్యత. రాజేష్‌లాంటి యువ చిత్రకారుడు నా శిష్యుడంటే నా కెంతో గర్వంగా వుంటుంది." అని చెప్పి అక్కడ్నుంచి మాస్టారు సెలవు తీసుకున్నాడు.

"తమకు చెప్పడం మర్చాను. విజయపురి రాజావారు ఈ రోజున తమర్ని కలవడానికి వస్తానని కబురంపారు." అన్నాడు రాఘవయ్య.

"దేనికట ?"

"ఏముంది! వారు ప్రస్తుతం జిల్లా బోర్డు ప్రెసిడెంటుగదా ! ఆ విషయం తమతో మాట్లాడదామని."

"మనతో మాట్లాడేదేముంది? మనకా వ్యవహారాలంటే మొదట్నుంచీ విముఖతేగదా!"

"అలా అనికాదు. దేశం పరిస్థితులు మారుతున్నాయి. రాజులూ, జమీందార్లూ తెల్లదొరలకు అండగా జస్టిస్ పార్టీని బలపరుస్తున్నారు. రైతాంగం, విద్యావంతులూ, మధ్యతరగతి ప్రజలూ కాంగ్రెస్‌ను బలపరుస్తున్నారు. త్వరలోనే స్వతంత్రం వస్తుందని ప్రజలు అనుకుంటున్నారు. స్వాతంత్ర్యం వస్తే జమీందారీలూ, చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలూ రద్దవుతాయని పెద్దలు భయపడుతున్నారు. ఈ విషయాలన్నీ తమతో మాట్లాడి పెద్దవాళ్లూ పెద్దవాళ్లూ ఐకమత్యంగా వుండాలని తమతో చెప్పి, తిరిగి తాను జిల్లాబోర్డు ప్రెసిడెంటు కావడానికి తమ సహకారాన్ని అర్థించడానికే రాజావారు వస్తున్నారనుకుంటా," అన్నాడు రాఘవయ్య.

"ఇదంతా అనవసరపు తాపత్రయం రాఘవయ్యా! మనబోటివాళ్ల వునికీ, అంతస్థూ చెక్కుచెదరకుండా వుండడం కోసం తెల్లదొరలకు కొమ్ముకాస్తున్నాం గానీ - స్వాతంత్ర్యం కావాలని ఏ మనిషి కోరుకోడంటావు? మన వెర్రిగానీ కాలచక్రానికి ఎవరో కొందరు వ్యక్తులు అడ్డుతగిలినంత మాత్రాన దాన్ని ఆపడం కష్టం. కాల మాన పరిస్థితుల్నిబట్టి మనమూ మారడమే మంచిది," అన్నాడు రాజశేఖరం.

ఇంతలో విజయపురి రాజావారి కార్లు మూడు కాంచన కుటీరం ప్రాంగణంలోకి వచ్చి ఆగాయి.

రాఘవయ్యా, రాజశేఖరం ఎదురెళ్ళి రాజావార్ని, వారివెంట వచ్చిన ఆ ప్రాంతం పెద్దల్ని లోపలకు ఆహ్వానిం

చారు. వారు అలా వస్తున్నారని ముందుగానే ఎరిగిన రాఘవయ్య అప్పటికే విందు ఏర్పాటు చేశాడు.

విందు పూర్తయింతర్వాత రాజావారూ, రాజశేఖరం, రాజశేఖరం గదిలో ఏకాంతంగా కూర్చున్నారు.

"మన ఊళ్ళో కాలేజీ కట్టిస్తే బావుంటుందని వుంది" అన్నారు రాజావారు.

"మంచి ఆలోచనే," అన్నాడు రాజశేఖరం.

"ఆలోచన అమలు జరగడానికి మీ సహకారం కావాలి."

"ఇటువంటి మంచిపనికి మా సహకారం ఎప్పుడూ వుంటుంది. ఏం చేయాలో చెప్పండి" అన్నాడు రాజశేఖరం.

మొన్న మన కలెక్టరు విల్సన్ దొర మా హవేలీకి విందుకు వచ్చాడు. అప్పుడే యీ విషయాన్ని కదిపాను. ఆ మాటమీద కలెక్టరు ఆ ప్రాంతపు జనం యాభై వేలూ, కాలేజీకి కావాల్సిన స్థలం యిస్తే ఏడాదిలోపున కాలేజీ కట్టిస్తామని మాట యిచ్చాడు," అన్నారు రాజావారు.

"జనం ఎక్కడ్నుంచి తెచ్చి యిస్తారు? ఆ యాభై వేలూ, స్థలమూ మేమే యిస్తాం. కాలేజీ పని ప్రారంభించమనండి," అన్నాడు రాజశేఖరం.

"మీ రిలా అంటారని నాకు ముందే తెలుసు. అందుకే కలెక్టరుతో అప్పుడే అన్నాను— ఆ ఏర్పాట్లన్నీ మా రాజశేఖరంగారే చూసుకుంటారు. కాలేజీ రాజా రాజశేఖరం ఆర్ట్స్ అండ్ సైన్సు కాలేజీ' అని పేరు పెట్టాలని. దానికి కలెక్టరు అంగీకరించాడు." అన్నారు రాజావారు.

"సరే. పేరుదేముందిలెండి! కాలేజీ అంటూ ఏర్పడితే పదిమందీ చదువుకుంటారు" అన్నాడు రాజశేఖరం.

"అలా అనకండి. మనబోటివాళ్ళ తాపత్రయమంతా పేరుకోసమే గదా! అన్నట్టు అసలు విషయం చెప్పడం మర్చాను. అయిదారు నెలల్లో జిల్లా బోర్డు ఎన్నికలొస్తున్నాయి. ఈసారి కూడా నేనే ప్రెసిడెంటుగా వుండాలని మన జిల్లా పెద్దలు, కలెక్టరు పట్టుబడుతున్నారు. మీరు జిల్లా బోర్డులో ఓ మెంబరుగా వుండటానికి అంగీకరిస్తే నాకూ అండగా వుంటారు. ఏదో విధంగా మన జస్టిస్ పార్టీని వోడించి జిల్లా బోర్డు ప్రెసిడెంటు పదవినీ, అధికారాన్నీ చేజిక్కించుకోవాలని కాంగ్రెస్ వారు తాపత్రయపడుతున్నారు. అది జరగని పని అనుకోండి. ఒకవేళ నిజంగా కాంగ్రెసుకే అంత బలం వస్తే, మనమూ కాంగ్రెసులోనే చేరదాం. జిల్లా బోర్డు అధికారం మనలాంటి పెద్ద వంశీకుల చేతుల్లో వుండాలిగానీ, మామూలు జనం చేతుల్లోకి ఎందుకు పోనిస్తాం చెప్పండి," అన్నారు రాజావారు తన

రాజకీయ గతురతను రాజశేఖరానికి తెలియజేస్తూ.

రాజశేఖరం నవ్వుకొని – "ఈ రంగంలో మీరు ఆరితేరినవారు. నాన్న గారి కాలంనుంచి కూడా ఈ రాజకీయ రంగంలో మాకు ప్రవేశమూలేదు, అనుభవమూ లేదు. మీరు ఏది మంచి దనుకుంటే అదే చేయండి. కాలేజీ సంగతి మాత్రం మర్చిపోకండి," అన్నాడు.

"నాకు తెలుసు రాజశేఖరంగారూ! – మీ సహకారం మా కెప్పుడూ వుంటుం దని. వస్తాం మరి," అంటూ రాజావారూ, వెంట వచ్చిన పరివారంతో మరో దివాణానికి బయల్దేరారు.

అనుకున్న ప్రకారం కాలేజీ నిర్మాణం ఒక సంవత్సరంలో పూర్తయింది. ఆ చుట్టుపక్కల మూడు తాలుకాలకు అదే కాలేజీ. ఆ ప్రాంతం ప్రజలకూ, చదువుకొనే విద్యార్థులకూ మంచి సదుపాయం ఏర్పడింది. కాలేజీతో పాటు ఒక సినిమాహాలు కూడా వెలిసింది. ఆ గ్రామం పెరిగి పెద్దదై తాలూకా కేంద్రమైంది. కాలేజీకి రాజా రాజశేఖరం ఆర్ట్స్ అండ్ సైన్సు కాలేజి అని పేరు పెట్టారు. కాలేజీ పెట్టింతర్వాత రాజశేఖరం పేద విద్యార్థులకు ఉచిత భోజన వసతీ, స్కాలర్ షిప్పులు ఏర్పాటుచేశాడు. వారి సత్రవుల్లో కొన్ని గదులు పేద విద్యార్థులు ఉండటానికి కేటాయించాడు. హాస్టల్స్ రావటంతో సత్రవుల ప్రాముఖ్యం క్రమేపీ క్షీణించనారంభించింది.

రాజేష్ చిత్రకళలోనూ, పెయింటింగ్ లోనూ ఉన్నతవిద్య నభ్యసించడానికి బొంబాయి వెళ్ళి ఏడాది కావస్తూంది. కాలేజీ ప్రారంభించిన మరుసటి సంవత్సరం చైతన్య స్కూలుఫైనల్ పాసయ్యాడు. ఆ సందర్భంలో చైతన్యను కాలేజీ విద్యాభ్యాసానికి మద్రాసు పంపుదామా, లేక విదేశాలకు పంపుదామా అన్న ఆలోచనను రాఘవయ్య రాజశేఖరం ముందు వ్యక్తంచేశాడు. రాజశేఖరం నవ్వుకొని – "మనం కట్టించిన కాలేజీ మన పిల్లలకే పనికి రాదా!" అన్నాడు.

"నా ఉద్దేశం అదికాదు" అంటూ ఏదో చెప్పబోయాడు రాఘవయ్య.

"ఎక్కడికీ పంపనవసరంలేదు. చైతన్యను మన కాలేజీలోనే చేర్పించండి," అన్నాడు తుది నిర్ణయంగా రాజశేఖరం.

చైతన్య కాలేజీలో చేరాడు.

కాలేజీలో చేరింతర్వాత ఇదివరలో హైస్కూలుకు వెళ్ళినట్లుగా గుర్రపు సార్టులో కాలేజీకి వెళ్ళనన్నాడు. తనకు ప్రత్యేకంగా కారు కావాలన్నాడు. ఇలాంటి కోరికలు ఏవి కోరాలన్నా రాఘవయ్యనే కోరేవారు రాజేష్,

చైతన్యా, కల్యాణీ కూడా రాఘవయ్య రాజశేఖరానికి నచ్చజెప్పి చైతన్యకోసం కారు కొనిపించాడు

రాజశేఖరం—"మన పిల్లలు కారులో కాలేజీకి వెళ్ళి గొప్పవారుగా కనిపించడం కంటె చదువులో గొప్పతనాన్ని రుజువు చేసుకోవడం అవసరమని చైతన్యకు చెప్పు రాఘవయ్యా!" అన్నాడు

"ఆ విషయం చైతన్యకు మనం చెప్పక్కర్లేదు. స్కూలు ఫైనల్లోనే స్కూలు ఫస్టు వచ్చాడు. ఆటల్లోనూ, చదువులోనూ స్కూలు కార్యక్రమా లన్నింటిలోనూ మన చైతన్యే ముందు న్నాడు. కాలేజీలో కూడా అలాగే ముందే వుంటాడు," అన్నాడు రాఘవయ్య.

"అలా వుండాలనే మా కోరిక," అన్నాడు రాజశేఖరం ముక్తసరిగా.

చైతన్య కాలేజీలో చేరిన సంవత్సరమే కల్యాణి రజస్వరాలైంది. ఆ కార్య క్రమాన్ని దివాణంలోని జనంతోటే ఎంతో వైభవంగా జరిపించాడు రాఘవయ్య.

తొలిసారిగా పమిట వేసుకొని రాజశేఖరం పాదాలకూ, రాఘవయ్య పాదాలకూ నమస్కరించింది కల్యాణి. ఇద్దరూ ఆశీర్వదించారు.

కల్యాణి దివాణంలోనే సంగీతం నేర్చుకుంటోంది. వీణను చేతబూని ఆలాపన చేస్తూంటే రాజశేఖరమూ, రాఘవయ్యా కల్యాణిని చూసి మురిసి పోయేవారు పనివారు ఆమె గానాన్ని వింటూ బొమ్మల్లా నిలబడిపోయేవారు

కల్యాణి రాజశేఖరాన్ని బాపూజీ అనీ, రాజేష్ చైతన్యలను పెదబాబూ, చినబాబూ అని పిల్చేది వరసలు పెట్టి ఎవర్నీ పిల్చేదికాదు అది కల్యాణి లోపం కాదు వరసలుపెట్టి పిలవడం కల్యాణికి చిన్నతనంనుంచీ రాజీ ఆయా కానీ, రాఘవయ్యగానీ నేర్పలేదు. ఇలా పిలవడమే నేర్పారు. కల్యాణి కూడా ఆ యింట్లో తాను ఎవరో, ఎవరెవరు తనకి ఏమేమి అవుతారో ఏనాడూ ఆలోచించలేదు.

రాజశేఖరం ప్రతి వేసవికీ కాశ్మీర్ వెళ్ళేవాడు. నాలుగైదు సంవత్సరాల పాటు శ్రావణిని కల్సాడు. ఆ తర్వాత ఎంత వెతికినా శ్రావణి జాడ తెలియ లేదు. ఆ ప్రాంతపు జనాన్ని శ్రావణి గురించి వాకబు చేసాడు. ఎవ్వరూ కచ్చితంగా ఆమె ఎక్కడ వుంటున్నదీ, ఎక్కడకు వెళ్ళిందీ చెప్పలేకపోయారు. రకరకాల ఆలోచనలు రాజశేఖరం మనస్సులో రేగాయి. బహుశా తనలాగే కాశ్మీర్‌కు వేసవిలో వచ్చి, శ్రావణి అందచందాలను చూసి ఎవరైనా ఏవో ప్రలోభాలు చూపించి వెంట తీసుకు పోయారేమో అనుకున్నాడు. కాని శ్రావణి అలా చేయదు. తనకోసమే కలకాలం బ్రతుకుతుంది అని సరిపెట్టు




కున్నాడు ఒకవేళ ఒంటరితనాన్ని భరించలేక ఏదైనా అఘాయిత్యానికి పాల్పడిందేమో అనుకొని, అటువంటి ఆలోచన తనకు వచ్చినందుకు తనను తానే తిట్టుకున్నాడు తనవెంట తీసుకొని వెళ్ళి తన మనిషి అని చెప్పుకొనే ధైర్యం తనకు లేనప్పుడు శ్రావణి ఎవరివెంటైనా వెళ్ళి తన బ్రతుకు తాను బ్రతికితే అడ్డుచెప్పే అధికారం, హక్కు తనకేముంది? అనికూడా అనుకున్నాడు ఆమె బిడ్డ కల్యాణి పెద్దదైందని చెప్పి ఆమెకు కల్యాణిని చూపించడం తన బాధ్యత అనుకొని చాల కాలం శ్రావణి కోసం ఆలోచించాడు శ్రావణికోసం వెతికాడు ఎంత వెతికినా ఆమె జాడ తెలియకపోవడంతో ఇక కాశ్మీర్ వెళ్ళడమే మానుకున్నాడు

కల్యాణికి ఎప్పుడో వీలు చూసుకొని ఆమె జన్మవృత్తాంతం చెప్పాలనుకొనే వాడు రాజశేఖరం కల్యాణికి తాను తండ్రిననీ, శ్రావణి తల్లి అనీ వివరించి ఒక్కసారి ఆమెను అక్కున చేరుకో వాలనుకొనేవాడు కాని ఆ విషయాన్ని కల్యాణికి చెప్పలేకపోయాడు రాఘవయ్యకూ చెప్పలేకపోయాడు. పుట్టి గానే తల్లికి దూరమై తన తల్లి ఎవరో తెలియకుండానే పెరిగిన కల్యాణికి తల్లి సంగతి గుర్తుచేసి బాధపెట్టడానికి రాజశేఖరానికి మనసొప్పలేదు రాజ శేఖరం తన నోటితో తాను చెప్పక పోయినా, రాఘవయ్య కల్యాణి పోలిక లనుబట్టి, రాజశేఖరం కల్యాణిపట్ల చూపే ఆప్యాయతను బట్టీ, కొంతవరకు కల్యాణి ఎవరో గ్రహించుకున్నాడు

అయినా ఏనాడూ రాఘవయ్య రాజశేఖ రాన్ని కల్యాణి జన్మవృత్తాంతాన్ని గురించి అడగలేదు. దేశంలో ఎందరో అనాథలు. ప్రతి అనాథకూ అమ్మా నాన్నా వుంటారు. ఉండీ అమ్మా నాన్నా ఎవరో తెలియని అనాథలు కొందరు, అమ్మా నాన్నా లేని అనాథలు కొందరు. కాని కల్యాణి అనాథ కాదు. కల్యాణికి నా అన్నవాళ్ళు చాలామంది ఉన్నారు. ఆ విధంగా చాలమంది అనాథలుకంటె కల్యాణి అదృష్టవంతురాలు — అనుకొనే వాడు రాఘవయ్య.

తండ్రి ఎవరో తెలియకుండా కన్నతల్లితో వుండే బిడ్డ బ్రతకడం కష్టంకాని, తల్లీ దండ్రీ తెలియకుండా కాంచన కుటీరంలో రాజశేఖరంలాంటి పరువుగల వ్యక్తి నీడనవుండి బ్రతకటం కష్టంకాదు అనుకొనేవాడు రాఘవయ్య. కల్యాణిని చూసినప్పుడల్లా.

చైతన్య ఇంటర్మీడియట్ పాసై బి.ఏ. లోకి వచ్చాడు.

రాజేష్ బొంబే స్కూల్ ఆఫ్ ఆర్ట్సులో చిత్రలేఖనం, పెయింటింగ్ పూర్తిగా నేర్చుకొని కాంచన కుటీరానికి తిరిగి వచ్చాడు. అతనికి కళ్ళద్దాలు వచ్చాయి. ఎప్పుడూ ఏదో పరధ్యాన్నంగా తన లోకంలో తాను ఉండేవాడు. ఎవరితోనూ ఎక్కువ మాట్లాడేవాడుకాదు. కుంచెల తోటీ రంగులతోటీ ఉండేవాడు అతనికి తోడుగా చేరువగా ఉండే వ్యక్తి కల్యాణి ఒక్కతే అతను గీసిన బొమ్మలను, చిత్రించిన వర్ణచిత్రాలనూ కల్యాణి గానాన్నీ, ఎంతగానో మెచ్చుకొనేది. కల్యాణి వీణా నాదాన్నీ రాజేష్ మెచ్చుకొనే వాడు. రాజేష్‌కు కావాల్సిన సదుపాయాలనూ, అవసరాలనూ కల్యాణే స్వయంగా చూసేది. ఒకరినొకరు విడిచి ఒక్క-క్షణం ఉండేవారుకాదు. పసిపాపలాంటి రాజేష్‌ను కల్యాణి కన్నతల్లిలా చూసుకోవడం చూసి రాఘవయ్యా, రాజీ ఆయా సంబరపడేవారు. కాంచన కుటీరంలో శ్రావణి వున్న రోజుల్లో రాజేశ్వరమ్మ వియోగంతో సతమతమయ్యే రాజశేఖరానికి శ్రావణిచేసిన సేవలు రాజేష్‌కు కల్యాణిచేస్తున్న సేవలు చూసినప్పుడు గుర్తుకువచ్చేవి రాఘవయ్యకు. కాకపోతే శ్రావణీ, రాజశేఖరం స్నేహితులు. కల్యాణీ, రాజేష్‌లు అన్నా చెల్లెళ్ళు అని సరిపెట్టుకొనేవాడు రాఘవయ్య.

ఏ కారణంచేతనో రాజేష్‌కు ఓ చిత్రమైన అలవాటు ఏర్పడింది. నిజానికి అది అలవాటు కాదు. అదో రకమైన వ్యాధి. రాత్రిపూట నిద్దట్లో లేచి కాంచన కుటీరంలోనూ, చుట్టూ వున్న తోటల్లోనూ నడిచేవాడు. అలా నిద్దట్లో అతడు తిరుగుతాడని కొన్నాళ్ళ తర్వాత కల్యాణికి తెలిసింది – కాని ఆమె ఎవ్వరికీ చెప్పలేదు అతన్ని కంటికి రెప్పలా చూసుకొనేది కాని




ఒకనాటి రాత్రి అలా ఒంటరిగా నడిచి వెళుతూన్న రాజేష్ సోఫాకి కొట్టుకొని ముందుకు పడ్డాడు. అతనికి స్పృహ వచ్చింది. అతని వెనకనే వచ్చిన కల్యాణి అతన్ని తీసుకువెళ్ళి మోకాలికి తగిలిన దెబ్బకు కట్టుకట్టి అతని గదిలో పడుకోబెట్టింది. అతని గదిలోంచి బయటకు వచ్చి, గది బయట గడియ పెట్టి ఆమె గదిలోకి వెళుతూంది. అలా వెళుతూన్న కల్యాణిని రాఘవయ్య చూశాడు.

"ఇంత రాత్రిదాకా మెలకువగా వున్నావేమిటమ్మా" అన్నాడు రాఘవయ్య.

"పెదబాబు బొమ్మలు గీస్తూంటే తోడుగా వున్నాను," అంది కల్యాణి, అంతేగానీ జరిగింది చెప్పలేదు. చెప్పక పోవడానికి కారణం — అలా నిద్దట్లో లేచి నడవడం ఒక రకమైన వ్యాధి అని కాంచన కుటీరం తప్ప బయటి ప్రపంచం తెలియని కల్యాణికి అసలు తెలియనే తెలియదు. రాజేష్ గొప్ప చిత్రకారుడనీ, గొప్ప చిత్రకారులు అలా పరధ్యాన్నంగా వుండటం ఆ పరధ్యాన్నంలో రాత్రిపూట ప్రకృతి సౌందర్యం ఎలా వుంటుందో చూడ్డానికి అలా లేచి వెళ్ళడం చిత్ర కారుల లక్షణం అనే విశ్వాసంతో వుంది. కాని రాఘవయ్య మాత్రం కల్యాణీ, రాజేష్‌లు ఒకరికొకరు ఏమవుతారో తెలియడం మంచిదేమో అనుకున్నాడు. తనకే నిర్దిష్టంగా తెలియనప్పుడు వారిద్దరికి 'మీ రిద్దరూ అన్నా చెల్లెళ్ళు' అని తాను ఎలా చెప్పేది, అనుకున్నాడు.

(సశేషం

# ఫ్యూజ్

నిశిరాత్రి.

ఎనిమిదిగంటలు కావొచ్చు.

ఆ సందు ముందు ఆగి ఎదుటికి చూశాను. ఆ సందంతా చీకటిగా వుంది. వెనక్కి తిరిగి చూశాను.

దూరంగా చీకటిని చీల్చుకుంటూ వెన్నెల బంతిలా రైలు కన్ను ఒకటి రైలుపట్టాలమీదుగా నా మీదకు కొంత దూరం పరుగెత్తుకొని వచ్చి తర్వాత ఏమనుకుందో ఏమో మలుపు తిరిగి స్టేషన్‌లోకి వెళ్ళిపోయింది.

సందులో చీకటి చెక్కుచెదరకుండా నిలబడి వుంది గంభీరంగా, ఉదాసీనంగా.

'వెధవన్నర వెధవ!... వెధవ సందు. ఈ సందులో తగలెట్టుకోకపోతే కొంప మరోచోట తగలెట్టుకుని ఏడవకూడదూ-' అని గట్టిగానే తిట్టాను ఎదురుగా లేని స్నేహితుడ్ని ఎదురుగావున్న సందుతో కలిపి.

సందు మొదట్లో ఓ మురిక్కాలువ వుంటుంది. ఈ చీకటిలో అదెక్కడ వుందో అర్థంకావడంలేదు. ఈ మధ్య కాలంలో దాని విస్తీర్ణం మరింత పెరిగే వుంటుంది. ఎందుకంటే ఈ దేశంలో మురికి తగ్గుతుందన్న ఆశ లేదుకాబట్టి!

జాగ్రత్తగా చంద్రమండలం మీద కాలుపెట్టిన మొదటి మానవుడిలా రెండడుగులు వేశాను. చదువుకొనే రోజుల్లో ఆడిన ఆటలన్నీ ఓసారి ధైర్యంకోసం మననం చేసుకుని యోహన్నన్‌లా ఎగిరి దూకాను. అయినా చెప్పు చివరిభాగం కాలువలోనే పడింది.

ఈసారి నా స్నేహితుడ్ని బూతులు తిట్టాను.

నా స్నేహితుడు- పాండు- రెండంగుళాల ఎత్తుమడమల బూట్లు వేసుకుని, అంగుళం ఎత్తు పెంచిన రాబర్టుక్లైవ్‌లాంటి జుత్తుతో వెరసి ఐదున్నర అడుగుల మనిషి. ఇంకా వాడ్ని ఏ ఆడపిల్లా వరించలేదు గాబట్టి వాడు ఆడింది ఆటగా, పాడింది పాటగా వుంది వాడి జీవితం. వాడి అందానికి ఈ పట్నంలోనే ఉద్యోగం, స్వంతయిల్లా వున్నప్పటికీ ఈ సందులో ఓ గది అద్దెకు తీసుకున్నాడు తన వ్యక్తిగత అవసరాల కోసం. ఆఫీసు పనిమీద పట్నం వచ్చినప్పుడల్లా ఈసందులోని వాడి గదే నాకు శరణ్యం. చెప్పు నేలకురాస్తూ కొంతదూరం నడిచాను.

ఈ సందు చూసినాక జనాభా పెరిగిపోతున్నదన్న నిజాన్ని నమ్మటం శక్యంగాని పని. ఆ సందులో వున్నవి నాలుగే యిళ్ళు- అవీ దూరం దూరంగా,

ఆనంద్ కుమార్



ఆ సందులో-

గుడ్లను బయటకు పీక్కొని చూద్దా మన్నా కానరాని ఆ చీకటిలో-

సర్కస్ ఫీట్లు చేస్తూ, గెంతుతూ ఓ రెండుమూడు నిమిషాలు నడిచివుంటాను.

అప్పుడు వచ్చింది వాడి గృహరాజం.

ముందున్న మూడు మెట్లనీ ంతులోనే ఎక్కి వరండా చివరి నడిచాను. ఆ ఇంట్లో నాలుగు లున్నాయి. మధ్యలో పెద్ద వరండా. ుటువేపూ, యిటువేపూ రెండుగదులు. ఎడమవేపున వున్న చివరిగది వాడిది.

గది ముందు ఆగాను.

అక్కడ దూరంగా వున్న ఓ మేడ లోంచి దారినపోయే దానయ్యమీద.... కాదు-కాదు.... గదిముందాగిన దానయ్య మీద తన కటాక్ష వీక్షణాలు ప్రసరించే సిందో దీపకన్య.

గదికి తాళం వేసివుంది

జేబులో చేయిపెట్టి వెతికాను

ఓ పదిపైసలబిళ్ళ దొరికింది.

జాగ్రత్తగా తాళపు రంధ్రంలోకి పదిపైసల నాణెం మూల జొప్పించి తిప్పాను. విచ్చుకుంది తాళం.

తలుపులుతీసి గదిలోకి వెళ్ళాను.

మిగతా మూడు గదుల్లోని పక్షులు యింకా గూళ్ళకు చేరుకోనట్లుంది.

హుషారుగా ఈలవేసి నా చిరాకు మరచిపోవడానికి ప్రయత్నించాను. ఈలవేస్తూ గదిలోని లైటువేశాను.

'మా పాండురంగారావుకి పాండు రోగం ఎందుకురాదా?' అనేది నన్ను వేధించిన అనుమానం. గదిలో కనీసం ఓ ముప్పయైనా బీరు సీసాలు...ఖాళీవి... చిందరవందరగా పడేసి వున్నాయి. చెప్పొద్దూ.... నాకు కోపం వచ్చింది.

ఖాళీ బీరుసీసాలన్నింటినీ భ ద్రంగా దాచుకొనే వెధవని వీడ్నే చూశాను. కనీసం ఈ బీరు బాటిళ్ళను మధ్యకు తెగ్గోసి గ్లాసుల్లా ఉపయోగించడం కూడా తెలీని అధమాధముడు. బీరుబాటిళ్ళను మోసుకుని వచ్చిన కాగితం సంచులూ చిందరవందరగానే పడున్నాయి తమ బ్రాందీషాపు పేరును ఆగంతకునికి విశదపరుస్తూ.

నాలుగ్గోడలకూ భారతదేశంలోని గ్రామ సౌందర్యాలన్న పేరుతో అమ్మాయిలు బింకంగా గోచీలు పెట్టుకుని, పెట్టుకోకుండానూ కాలండర్ల మీద నిలబడి నన్ను చూసి ఫక్కున నవ్వారు.

'నెవర్ మైండ్ గర్ల్స్... హౌ ఆర్ యూ?' అని పలుకరించి కిటికీతలుపులు తెరిచాను.

మలయ సమీరుడు 'హలో' అన్నాడు.

గదిలోవున్న వేడి వేడి గాలి, దానితో పాటున్న ఓ విధమైన చెత్తవాసనా క్రమ క్రమంగా పలుచబడుతున్నాయి.

కిటికీమీద ఓ పియర్స్ సబ్బు పడవేసి వుంది. పాంటూ, షర్టూ తీసి గోడకు తగిలించాను. క్రింద ఓ రెండు దుప్పట్లు పరిచివున్నాయి. నేలమీది దుమ్మును అక్కడే పడివున్న టవలుతో కాస్త దులిపాను. సబ్బు తీసుకుని బయటకు వెళ్ళి '...ఎన్నాళ్ళు నా బ్రతుకు దిగులుతో రేబవలు....' అని 'కూనిరాగం తీసుకుంటూ పంపుదగ్గర మొహం కడుక్కున్నాను.

లోపలికి వచ్చింతర్వాత జేబురుమాలుతో మొహం తుడుచుకుని దుప్పటిమీద విశ్రమించాను.

ఎదురుగా కాలండర్లోని అమ్మాయి అచ్చం 'హెల్లీ'లా వుంది. ఆ పేరు తల్చుకున్నప్పుడల్లా నాకు నేనే గిల్టీగా ఫీలవుతాను. ఆ అమ్మాయిని నా కౌమార్య దశలో ప్రేమించానని నా అనుమానం కాని ఇప్పుడా అమ్మాయి నా స్నేహితుడ్ని ఒకడ్ని చేసుకుంది. అందుకనే నాకేదో కాస్త యిదిగా వుంటుంది. లేచి కాలెండరును గోడవేపుకి తిప్పి లైటు ఆర్పివేశాను. తలుపులు తెరచివుంచే దుప్పటి మీద నిద్రకుపక్రమించాను.

నాకు నిద్ర పట్టడంలేదు.

దోమలు తెగ కుడుతున్నాయి.

గదిలో ఫాను లేనందుకు ..
పాండురంగారావుని మళ్ళీ బూతు సారి సత్కరించాను.

నిద్రాదేవి నన్ను ప్రేమించనంది.

ఛీ- వెధవజీవితం- సుఖంగా నిద్రపోవడానిక్కూడా నోచుకోలేదు.

ఉస్సురుమన్నాను.

అంతలోనే ఉలిక్కిపడ్డాను.

గదిలో మల్లెపూలవాసన. ఎడారిలో ఒయాసిస్సులా ఎక్కడిదీ సుగంధం.

ఎవరో కిలకిల నవ్వారు.

నా నాడులన్నీ బిగుసుకుపోయాయి. కలగాని కనడంలేదుగాదా నేను!

భ్రాంతి కాదుగదా!

గాజులు గలగలమన్నాయి.

కాదు! కల కాదు!

ఒక్క ఉదుటున లేచి లైటువేశాను.

నల్లనిదైనా చక్కనిదే. నవ్వుతున్నప్పుడు బుగ్గల్లో సొట్టలు.

అంతవరకే చూడగలిగాను.

నన్ను చూసి ఆశ్చర్యపోయింది. మొహమంతా కళ్ళే అయినాయి. గబుక్కున గదిలోనుండి బయటకు పరుగెత్తబోయింది. చేయి పట్టుకుని లోపలకు లాగి తలుపులకడ్డం నిలబడ్డాను.

ఆమె కళ్ళల్లో భయం.

ఎవ్వరవీవు భీతహరిణేక్షణ....?

ఆ అమ్మాయిలో వణుకు. గులాబీ రంగు వాయిల్ చీరె. గులాబీరంగు జాకెట్టు. ఏ స్కూలు యూనిఫాం అయుండొచ్చు చెప్మా?

పెదిమలు విల్లులావున్నాయి. క్రింది పెదిమ అదురుతున్నది.

అంబాసిడర్ కారులోని అమ్మడ్ని బందిపోటు దొంగలు అడ్డగించినప్పటిలా వుందా అమ్మాయి.

'ఎవరు నువ్వు? నీ పేరేమిటి?' అని అడిగాను.

'నువ్వెప్పుడొచ్చావురా?' అన్నాడు పాండు నా వెనుకనుండి.

గిరుక్కున వెనుదిరిగి చూశాను.

'అలా నిలబడకు! కాస్త ఆ పంట్లాం తొడుక్కుని ఇలా బయటకురా!' అన్నాడు వాడు.

అప్పటిదాకా నేను అండర్‌వేర్‌లో వున్నానన్న విషయం మరిచిపోయినందుకు సిగ్గుపడి పాంటు వేసుకున్నాను

'నువ్విక్కడే వుండు భాగీ! మరేం ఫర్లేదు. వీడు మనవాడే!.... నా స్నేహితుడు. ఈ ఊరుకాదు.... రారా సూరీ! అంటూ నన్ను బయటకు లాక్కెళ్ళాడు

'నా షర్టు....' అని నసిగాను.

'అ లా వుండనీయవోయ్ అన్నాడు.

'అందులో డబ్బు....'

'ఎటూ పోలేదురా_' అని కసిరాడు

వాడిల్లు దాటి రెండడుగులు వేశాక 'కూర్చో!' అన్నాడు.

ఇసుక! ఎవరోయిల్లు కట్టించుకుంటానికి పోసింది.

అందులో కూర్చున్నాం.

'సరియైన సమయానికే వచ్చావురా నువ్వు,' అన్నాడు పాండు సిగరెట్టు వెలిగించుకుని పాకెట్టు నావేపు చాపుతూ

'ఎఫైర్....'

'అవును. కాని స్క్రాప్ చేద్దామని వుంది.'

'ఎవరీ అమ్మాయి?'

'ఎవరైతేనేం?.... ఇక్కడో స్కూల్లో పదోతరగతి చదువుకుంటున్నది.

'టీన్ ఏజ్....'

'ఈజిట్? ' వ్యంగ్యంగా నవ్వాడు పాండురంగారావు ఆ నవ్వు సిగరెట్టు వెలుతురులో కనీ కనపడనట్లున్నప్పటికీ పులి మీసం దువ్వుకుని లేడిపిల్లను చూచి నవ్విన కోరనవ్వులా వుంది.

'ఇంకొద్ది సేపట్లో మున్నాగాడు వస్తాడు. నాటకాలు వేసేవాడివి. కాస్త నీకో చిన్న షోర్షను. ఫెయిల్ కాకూడదు సుమా—' అన్నాడు విలాసంగా పాండు.

'ఏవిఁటది?'

'భాగ్యలక్ష్మి ప్రకరణంలో నువ్వు...' అంటూ మొదలెట్టాడు వాడు. ఇంతలో మున్నా వచ్చాడు.

సరిగ్గా అప్పుడే ప్రారంభమైందీ నాటకం.

* * *

(రంగస్థలం పాండురంగారావు గదే. ఆ గదిలో ఖాళీ బీరుసీసాల మధ్య దుమ్ములో ముళ్ళజెముడు పొదలమధ్య మల్లెపూవులా ఆ క్రింద పరిచిన దుప్పట్లమీద కూర్చుని వుంది భాగ్య.

సమయం రాత్రి పదిగంటలవుతుంది.

గదిలోకి వచ్చారు పాండురంగారావు, సూర్యం యిద్దరూను.

ఉలిక్కిపడి లేచి నిల్చుంది భాగ్య. ఆమె కళ్ళల్లో ఆందోళన, భయం.)

చూడు భాగీ! ఇందాకే పరిచయం చేశాననుకుంటాను. చేయలేదా?.... నా స్నేహితుడు సూర్యం. ఆఫీసు పనిమీద ఈ వూరొచ్చినప్పుడల్లా ఈ గదిలోనే వుంటాడు అనుకోకుండా వూడిపడ్డాడు (అని పరిచయ వాక్యాలు పలికాడు పాండురంగారావు. రెండు చేతులెత్తి నమస్కారం పెట్టింది భాగ్య. ఆ సమయంలో పక్కనవున్న స్నేహితుడు పాండురంగారావు కన్నా, భాగ్యలక్ష్మి కన్నా, ఎన్నోరెట్లు పెద్దవాడిగా ఫీలై చిరునవ్వు నవ్వి హుందాగా ప్రతి నమస్కారం చేశాడు సూర్యం.)

'భాగీ! మావాడు చాలా మంచివాడు సుమా! ఇందాక నువ్వు వీడ్ని చూసి భయపడి వుంటావనుకున్నాను. కాని వీడంత మెత్తటివాడు లేడు. వీడ్ని 'మెతకసూరి' అని పిలిచేవాళ్ళం. నోట్లో వేలుపెట్టి చూడు, ఎంత సురక్షితంగా వుంటుందో!....' (అని గలగలా నవ్వేశాడు పాండురంగారావు. తన గుణగణాలు వాడు కీర్తించగా విని సూర్యం యింకా ఎంతగానో ఎదిగిపోయాడు. పెద్దమనిషి కళవచ్చేసిందాతని మొహంలో.)

'మరింతకీ ఈ అమ్మాయి నీ బాపతా? సూరి బాపతా?' (అని ఈ ప్రశ్న సూర్యం, పాండురంగారావుల యిద్దరి వెనుకనుండీ వినిపించింది. ఇద్దరూ ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశారు. మున్నా! బలిష్టంగా వున్నాడు. కళ్ళు లోతుగా వున్నాయి. దట్టమైన కనుబొమలు, బ్రూస్‌లీ బనియనూ, నీలంరంగు గాబర్డిన్ పాంటూ, చేతిలో



పనామా సిగారూ వున్నాయి. పాండు కంటే వయస్సులో పెద్ద.)

'అన్నయ్యా!' (అని ఆశ్చర్యంగా అన్నాడు పాండు.)

'వామన్!' (అన్నాడు చిన్నగా సూర్యం.)

'మా అన్నయ్య.... వామనరావు' (అని గొణుక్కుంటూ భాగ్యవేపు చూశాడు పాండు.)

(సూర్యం, పాండు ఇద్దరూ తప్పుకుని వామనరావు అని పిలువబడుతున్న మున్నాకు దారినిచ్చేరు. లోపలకు నడిచి గదిలోని బీరుసీసాలవైపు, కాలెండర్ల వైపూ తీక్షణంగా చూశాడు. ఓ ఖాళీ బీరుసీసాని గదిమూలకి బూటు కాలితో తన్నాడు. అది గోడకు తగిలి పగిలిపోయింది. తర్వాత రెండు చేతులూ నడుంమీద పెట్టుకుని పాండురంగారావు కళ్ళల్లోకి చూశాడు. పాండురంగారావు పిల్లిలా ముడుచుకుపోయాడు.

'ఇంతకాలం నేను విన్న మాటలన్నీ ఇలా నిజమౌతాయని కలలోకూడా అనుకోలేదురా పాండూ!' (అన్నాడు చివరకు వామనరావు.)

(భాగ్య భయంతోనూ సిగ్గుతోనూ కుంచించుకుపోయింది. వంచుకున్న తల పైకెత్తటంలేదు. కాలి బొటనవేలితో నేల మీద ఏవో గీతలు గీస్తున్నది. సూర్యం తలుపుకానుకుని బయటకు చూశాడు. మేడమీద దూరంగావున్న దీపకన్య నవ్వుల్ని చూస్తూ నిలబడిపోయాడు.)

'నువ్వెప్పుడొచ్చావు సూరీ?' (వామనరావు ప్రశ్న.)

'రెండు నిమిషాలుకూడా కాలేదు.' (సూర్యం జవాబు.)

'వీడిట్లా తయారవుతాడని కలలో కూడా అనుకోలేదు. నేను ఉద్యోగరీత్యా నాగపూర్‌లో వుంటున్నానా? నేను వచ్చి రెండు రోజులైంది. ఇంతవరకు వీడు ఆ ముసలిదాన్ని — మా తల్లిని వీడిట్లా

బాధపెట్టడం నాకెట్లా వుంటుందో నువ్వే చెప్పు సూరీ? వెదికి వెదికి ఈ రోజుకి ఈ గది పట్టుకున్నాను. ఇక్కడ ఓ వైపు బీరు సీసాలూ, మరోవేపు ఆడపిల్లా! వీడి బ్రతుక్కి అర్థం యిదేనన్న మాట.... (అంటూ వామనరావు వాళ్ళిద్దరివేపూ నిరసనగా చూశాడు.)

(అప్పుడు తలెత్తి చూసింది భాగ్య. మొహం దెబ్బతిన్న తాచుపాములావుంది. మనిషిలో ఏదో నిశ్చయం, ధైర్యం....!)

'నేను.... నేను.... బజారుమనిషిని కాను. నేనూ, పాండూ ప్రేమించుకున్నాం. ఆయన నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు.' (ఆవేశంగా అంది. మాటలు గబగబా మాట్లాడేసింది. ఆగిపోతే మళ్ళీ మాట్లాడే అవకాశం దొరకదేమోనన్న ఆదుర్దాతో మాట్లాడేసింది.) (తనమాటలు యింకా పూర్తికాకుండానే మధ్యలో త్రుంచివేయబడినందుకు ఆశ్చర్యపోయాడు వామనరావు. వడదెబ్బ తగిలినట్లు మొహంపెట్టాడు.)

'ప్రేమా?.... పెళ్ళా??.... ఎవరికీ?– మా తమ్ముడికా? నాకింక పెళ్ళి కాకుండా నే?– మరి నీ కులం యేమిటి? నీ అంతస్తేమిటి? అన్నీ ఆలోచించావా? లేకపోతే ఇదేమన్నా క్రీ. శ. రెండువేల సంవత్సరమని అనుకుంటున్నావా? అయినా ఎవర్నిబడితే వాళ్ళని చేసుకోవాల్సిన గతీ, అవసరమూ మావాడికేం పట్టలేదు. (అని కోపంగా అనేశాడు వామనరావు.)

'అన్నయ్యా!' (నెమ్మదిగా అన్నాడు పాండురంగారావు.)

'నోర్ముయ్ – నువ్వు నాకేమీ చెప్పనవసరంలేదు. ఇంతకాలం మనల్ని పెంచిన అమ్మ మొహం చూసేనా నువ్వు నోర్మూసుకోవాలి. ఈ ముసలితనంలో ఆమెనిలా బాధపెట్టడానికే ఆమె నిన్ను కన్నదేమో?....ఛీ....ఛీ...' (అని ఛీత్కారం చేశాడు వామనరావు. అతగాడి కళ్ళకే మనుషుల్ని దహించే శక్తివుంటే ఆ చూపులకు భాగ్య, పాండు యిద్దరూ దగ్ధమై వుండేవారు.)

'నువ్వయినా చెప్పు సూరీ! వీడి ప్రవర్తన....!.... ఎంతటి స్థితికి వచ్చింది మా కుటుంబం!' (అని వెనక్కి తిరిగి గోడకు వేలాడదీయబడిన కేలండర్ల వేపు చూస్తున్నాడు వామనరావు.)

(సూర్యం గొంతు సవరించుకున్నాడు. చెప్పాలా, వద్దా అన్న సందేహం అతడ్ని మాట్లాడనివ్వటంలేదు. ఓసారి దగ్గాడు. దూరంగావున్న దీపకన్య వేపు చూశాడు. చివరికెలాగో మాట్లాడాడు.) చూడమ్మా! పెద్దమనిషి కళ మరీ పెరిగింది.) వాడ్ని (పాండురంగారావుని చూపించాడు.) పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నావేమో వాడికిదివరకే మేనరికం వుంది.నాలుగేళ్ళ క్రితమే సంబంధం నిశ్చయం చేసుకుని తాంబూలాలు పుచ్చుకున్నారు. ఈ ఎండాకాలంలో ఆ అమ్మాయి ఇంటర్మీడియట్ పరీక్షలు

రాస్తుంది తర్వాత పెళ్ళి! అయినా అమ్మాయ్! నువ్వు మీ యింట్లోవాళ్ళను ఒప్పించగలవా? ఇదంతా భ్రమ! సినిమాలు చూసి 'ప్రేమ, ప్రేమ' అనుకుని చేతులు కాల్చుకోవడం- నవలలు చదివి ధైర్యచేస్తున్నామని అపోహపడటం... ఇవన్నీ.... (సూర్యం యింకా వాక్యం పూర్తి చేయనేలేదు.)

'అయినా ఈ అమ్మాయికెంత చరిత్ర లేకపోతే యింత దేరింగ్గా యిక్కడి కొచ్చింది?' (అని సందేహం గట్టిగా వెలబుచ్చాడు వామనరావు.

(ఆ అమ్మాయి ముగ్గురివేపూ ఓ సారి చూసింది. ఆ చూపుల్లో మగజాతిమీదే అసహ్యం కనపడిందో, తన తెలివి తక్కువతనానికి తనను నిందించుకుని తను పడుతున్న బాధే కనపడిందో మనం చెప్పలేం. కాని ఆ అమ్మాయి మరేం మాట్లాడలేదు. రెండడుగులు వేసింది. పాండు ముందు నిలబడింది. పాండు తల వంచుకున్నాడు.)

'పాండూ!' (అని పిలిచింది.)

(పాండు తలెత్తి చూశాడు. ఆమె విసిరిన చేయి మెరుపులా మెరిసింది. పాండు చెంప పట్టుకుని నిలబడిపోయాడు. సూర్యం ముందునుండే ఆ అమ్మాయి వేగంగా బయటకు పరుగెత్తింది. ముగ్గురికి ముగ్గురి కాళ్ళూ నేల కంటుకుని పోయేవున్నాయి - దీపకన్య చోద్యం చూస్తూనే ఉంది.)

* * *

నాటకం అయిపోయింది.

నేను అందరికంటే ముందు తేరుకుని 'గుడ్ గాడ్!' అన్నాను.

'డెవిల్' అన్నాడు పళ్ళు బిగపట్టి బుసకొడుతూ పాండురంగారావు.

'కొడితే కొట్టిందిలేవోయ్- ఇన్నాళ్లూ వాడుకున్నందుకు వడ్డీ చెల్లించాలి.' అన్నాడు వామనరావుగా చలామణీ అయిన మున్నా.

'అదికాదురా మున్నా!....' అంటూ ఏదో చెప్పబోయాడు పాండురంగారావు.

మేడమీది దీపకన్య నవ్వటం మానేసింది.

గదిలోకూడా లైటు వోల్టేజీ ఒక్కసారే పెరిగి వెంటనే ఆరిపోయింది.

'వెధవ కరెంటు ....!' అని తిట్టాడు మున్నా. 'అరేయ్ పాండూ! టార్చి లైటు వేయి. ఫ్యూజ్ పోయి వుండాలి' అన్నాడు.

పాండు తన జేబులోనుండి పెన్ టార్చి తీసి లైటు వేశాడు.

నేను మెయిన్ బోర్డు దగ్గరకు నడిచి కట్ అవుట్ బయటకులాగి చూశాను. టార్చి వెలుతుర్లో ఫ్యూజ్ తీగ మధ్యకు తెగిపోయి కనపడింది.






పోయినవారం విద్యార్థులతో రాయించిన కాంపోజిషన్ "వ్యక్తి స్వాతంత్ర్యము"లోని తప్పులు దిద్దుతూ కాలేజి స్టాఫ్‌రూంలో కూర్చున్నాను.

కాంపోజిషన్లలో చావని పదార్థ మంటూ వుండదు. రోగిష్టి భాష! చిలక పలుకుల భావాలు!! కొన్నాళ్ళకు వాళ్ళ భాషా పరిజ్ఞానం సంగతేమో కానీ

తప్పుల్ని దిద్ది దిద్ది, ఒప్పుల్ని తప్పులనుకొని, తప్పుల్ని ఒప్పులనుకొని నా భాష చస్తుంది. ఈ విష యాలుక్లాసులో నేను చెప్పలేదే - చెప్పానేమో అని సందేహ జీవినై కొరకాకుండా పోతాను. పుదయం మొదటిగంట నన్నయ అరణ్యపర్వంలోని పద్య భాగం చెప్పేను. మూడవగంట తెలుగువెలుగు నాటకం చెప్పేను. నన్నయను చూసినా, తెలుగు వెలుగు విన్నా వీళ్ళ తెలుగు మాత్రము యింతే

దిద్దుతున్నాను ఆఖరుకు వీడిదీ అదే చిలక పలుకు: "వ్యక్తి స్వాతంత్ర్యమనగా ఒక ప్రభుత్వము ఒక సమాజమునందలి వ్యక్తులకు అన్ని విధములు గల వ్యక్తి స్వేచ్ఛకు వ్యక్తి స్వాతంత్ర్యము అని పేరు." రెండు కర్తలు. నా కర్మ!! యీ క్రియ తప్పదు. దిద్దుతున్నాను. పార్ట్ టైం టెంపరరీ కాలేజి లెక్చరరు అనగా వ్యక్తి స్వేచ్ఛలో పొల్లులేదు గీశేను కసిగా అయిపోయింది.

యిక ఈ చివరిగంట కాంపోజిషన్ 'ప్రణాళికలు-దేశాభ్యుదయము' మనసులో ప్రణాళికలు - దేశాభ్యుదయము కళ్ళకు కట్టుతోంది:

"సాబ్ టెలిగ్రాం!"

టెలిగ్రాం అందుకున్నాను గుండె చిక్కబటుకొని.

"రామచంద్ర సీరియస్. స్టార్ట్ యిమిడియట్లీ. టు కాళహస్తి." స్నేహితుడు శివారెడ్డి యిచ్చిన టెలిగ్రాం అది: మనసు వికలమయింది.

హార్ట్ ఎన్‌లార్జ్‌మెంట్ వ్యాధితో వేలూరి ఆస్పత్రిలో మూన్నెళ్ళనుంచీ బాధపడుతున్న ప్రియ మిత్రుడు రామచంద్ర మృత్యుముఖంలో వుంటాడు. లేదా చివరి గడియలు కూడా పూర్తి

అయి వుంటాయి. తప్పదు, టెలిగ్రాం అర్థం అదే: నాలాంటి వాడికి వచ్చే టెలిగ్రాముల్లో అశుభం కాక శుభం వుండదని నా నమ్మకం.

ఆ రకం ఆలోచనలు భరించలేక పోయాను.

నెలరోజుల క్రిందటే యశోధర నుంచీ వుత్తరం వచ్చింది - 'రామచంద్రను వేలూరులో చేర్పించాం. నిన్ను కలవరిస్తున్నాడు రమ్మ'ని. రామచంద్రను చూచి పలకరించి వచ్చాను.

అప్పుడు వాడంత కష్టంలో వుండి కూడా నేను కన్పిస్తూనే నన్నడిగిన మొదటి ప్రశ్న "యెక్కడయినా స్థిరపడ్డావా? డబ్బు యిబ్బందుల్లేకుండా కుదుటపడ్డావా?" అని.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేక సిగ్గుతో చచ్చిపోయేను.

రామచంద్రే పాలిపోయిన చిరునవ్వుతో అన్నాడు:

"మన ఇబ్బందులన్నీ చావుతో

తీరేవే. నా సంగతే చూడు. సంవత్సరం నుంచీ యీ వ్యాధి బతకనివ్వదు చావనివ్వదు, మెడికల్ లీవు అయి పోయింది. జీతం లేదు. యశోధరా సెలవుల్లో వుంది, సగం జీతమే. మీలాంటి స్నేహితు ల్లేకపోతే యీపాటికి ”

ఆ తరువాత మాట పూర్తిచేయలేక పోయాడు. నా పక్కనేవున్న శివారెడ్డి -

“దానికేముందిలేరా నీ ఆరోగ్యం ముఖ్యం కానీ” అన్నాడు.

‘మీలాంటి స్నేహితులు’ అన్నందుకు తల యెక్కడ పెట్టుకోవాలో నాకు అర్థం కాలేదు. శివారెడ్డి తప్ప రామచంద్రకు నేను చేసిన సాయ మేముంది? చేయగలిగిన వుపకార మేముంది?

చదువుకునే రోజుల్లో నేను ఇవ్వలేని, ఇవ్వని యెన్నో చిల్లర బాకీలు రామచంద్ర దగ్గర చేశేను. అంతెందుకు యేడాదికింద హైదరాబాద్ నుంచి ఉత్తరం రాస్తే రెండువందలు పంపేడు. అది గుర్తుకొచ్చింది. వాడిని చూడటానికి యెన్ని అవస్థలుపడి వేలూరు వచ్చేనో అది గుర్తుకొచ్చింది. డబ్బు లేదు. అయినా సమకూర్చుకున్నా. సెలవు లేదు ప్రతిరోజు నాకు పనిదినమే కాబట్టి. అయినా పది రోజులు పోగొట్టుకున్నా. కష్టాల్లోవున్న స్నేహితునికి సహాయం చెయ్యలేని నా నిస్సహాయత్వం, నాకు భరించరాకుండా వుంది.

“నేను మళ్లీ వారం పదిరోజుల్లో వస్తాలేరా? నువ్వేం యిది అవ్వద్దు. యేదైనా అవసరం వస్తే యశోధరను జాబు రాయమని చెప్పు. డాక్టర్లతో అన్ని విషయాలు మాట్లాడేను. మదరాసునుంచి నెల్లూరికి వెళ్తాలే? నేను వస్తారా అన్నట్లు యీవాళ రాత్రికి యశోధర వస్తుంది,” అన్నాడు శివారెడ్డి.

శివారెడ్డి పట్ల రామచంద్ర కళ్ళల్లో మెదలుతున్న కృతజ్ఞతాభావం చూసి చలించిపోయేను.

పోతూ పోతూ నాతో శివారెడ్డి అన్నాడు:

“వీలుంటే నువ్వు వుండరా? కాలేజీలో పనిదేముంది? అందులో హైదరాబాద్‌లో డబ్బుకోసం మొగమాట పడవద్దులే”

వాడి ధోరణి నాకు నచ్చలేదు. వాడిని నేను యేనాడూ మెచ్చలేదు. నా తత్వం వాడికి యేనాడూ నచ్చలేదు. అయినా రామచంద్రవల్ల మా స్నేహం చెడి పోలేదు. కానీ ఆ వాతావరణంలో ఏమీ అనలేక “హైదరాబాద్‌లో ఆవిడకు తోడు యెవరూ లేరురా. యశోధర వస్తూనే నేను రేపు వెళ్తా” అన్నాను. నిజానికి కాలేజిలో నాది పర్మినెంట్ పోస్ట్ అని శివారెడ్డి అనుకున్నట్లుంది. వాడి దగ్గర నా గొడవలు యెప్పుడూ చెప్ప లేదు. అప్పుడూ చెప్పలేదు.

వాడు వెళ్ళిపోయాడు.




దిక్కుతోచక వోదార్పుగా అన్నాను. "యీ వ్యాధి తప్పకుండా బాగవుతుందిరా." అని.

"డాక్టర్లు చివరిదాకా అట్లానే అంటారులేరా, నిజం అడిగి చూడు!" అన్నాడు.

నేను ఛీఫ్‌ను కలుసుకొని నిజమడిగి చూశేను. మరో మూడు నాలుగు మాసాలు ఫరవాలేదు. ఆపరేషన్ విజయవంతమైతే యే యిబ్బందీ లేదని నమ్మకంగా చెప్పేడు. ఆయన ప్రఖ్యాతిని గురించి వినివుండటంచేత నమ్మేను. రామచంద్రతో ఆపరేషన్ తప్పకుండా సక్సెస్ అవుతుందని చెప్పేను.

వాడు విని నెమ్మదిగా అన్నాడు: "యీ రకం బ్రతుక్కంటే చావటం మేలు. కానీ అందర్నీ కాదని నన్ను నమ్మి పెళ్ళిచేసుకున్న యశోధరే యేమవుతుందో" అన్నాడు.

వాడి పిచ్చి ఆలోచనల్లో నిజముందని అన్పించినా "మేమున్నాం కదరా" అన్నాను.

ఈ రోజు టెలిగ్రాం! ఆపరేషన్ ప్రయోజనం లేకపోయి వుంటుంది. రామచంద్రను కాళహస్తికి తీసుకువెళ్ళి వుంటారు!

నాకు మనసు పనిచేయటంలేదు. గంట మోగింది. సాయంకాలం చివరి గంట. క్లాసు తీసుకోక తప్పదు. క్లాసుకు వెళ్ళాను. "ప్రణాళికలు - దేశాభ్యుదయం" అవాళ విద్యార్థులు రాయవలసిన కాంపోజిషన్! పది పదిహేను నిమిషాలు యేం చెప్పానో నాకే తెలియలేదు. మాటి మాటికీ టెలిగ్రాం మనసులో మెదలుతోంది. మాటలు తడబడుతున్నాయి. ఒక వాక్యానికీ మరొక వాక్యానికీ సంబంధంలేకుండా పోతోంది. సాధ్యంకాక మనసు బాగు

లేదని చెప్పి, వాళ్ళను రాయమని కూచున్నాను. గంట యెలాగో గడిచింది. వృత్తిధర్మం నెరవేరింది.

ఆరు రూపాయల సంపాదన ఆ గంటకు వచ్చింది. ఆవేళ మొత్తం సంపాదించింది పద్దెనిమిది, మొత్తం మూడు క్లాసులు అయ్యేయి. రోజూ మూడు క్లాసులుంటే అన్పించింది. టెలిగ్రాం మనసులో మెదులుతూనే వుంది.

దాదాపు యాభై అరవై కాంపోజిషన్ పుస్తకాల్లోని ప్రజాశికలు, దేశభ్యుదయాలన్నీ మోసుకొని స్టాఫ్ రూం చేరాను. స్టాఫ్‌రూం ఖాళీగా వుంది. అందరూ వెళ్ళిపోయారు.

యిళ్లు చేరుకోటానికి బస్‌స్టాప్ దగ్గరకు వచ్చేను. విద్యానగర్ వెళ్ళే బస్సు యింకా రాలేదు. జేబులో రెండు రూపాయలుంది. యింట్లో యే యిరవై అయిదో ముప్ఫయో వుంటాయి. టెలిగ్రాం నన్ను వదలలేదు.

కాళహస్తికి వెళ్ళాలి; వెళ్ళక తప్పదు; వెళ్ళితీరుతాను అనుకున్నా.

బస్‌స్టాప్‌లో అటుపక్క యిద్దరు స్నేహితులు పగలబడి నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

చదువుకునే రోజుల్లో మా స్నేహం గుర్తుకొచ్చింది.

రామచంద్ర, నేనూ, శివారెడ్డి యూనివర్శిటీ హాస్టలులో ఒకే గదిలో వుండేవాళ్ళం. రామచంద్ర, శివారెడ్డి ఫైనల్లో వుండేవాళ్ళు, నేను ప్రీవియస్‌లో వుండేవాణ్ణి. ఆ రోజుల్లో ఎన్ని కలలో! యెంత వుత్సాహమో!! ముఖ్యంగా నాకూ, రామచంద్రకూ, మా కలలను, వింటూ శివారెడ్డి ఎగతాళి చేస్తూ అనే వాడు: "కాస్త భూమ్మీదకు దిగి బతకండ్రా. లోకంలో ఈ కలల్తో మీరు దమ్మిడీ విలువ చెయ్యర్రా" అని. వాడన్నట్లే జరిగింది.

రామచంద్ర యశోధరను ప్రేమించి పెళ్లిచేసుకున్నాడు. ఆమె రామచంద్ర క్లాస్‌మేట్. నాకు దూరపు బంధువు. ఈ పెళ్లితో యశోధర వాళ్ళ నాన్న కూతురు ముఖం చూడలేదు. నిజానికి ఆయన పరిస్థితికి కూతురి పెళ్లిచేయటం ఘనమే. సులభంగా చదువుకున్న అల్లుడు దొరికితే కులం పట్టింపులన్ని ఆయన వంకపెట్టటం చూసి నాకు మండింది మా బంధువు అవటంవల్ల ఆయన బ్రాహ్మణ్యం, పవిత్రతా నాకు తెలియనివి కావు. అయినా పెళ్లి ఆగలేదు. పెళ్లి ఖర్చులు భరించింది ముఖ్యంగా శివారెడ్డి! గట్టిగా నిలబడి పెళ్లి జరిపించినవాళ్ళం నలుగురైదుగురం. గొడవలేమీ జరగ లేదు. గవర్నమెంట్ కాలేజిలో యిద్దరికీ జూనియర్ లెక్చరరు పోస్ట్‌లు దొరికేయి. రెండేళ్ళు తిరిగిందో లేదో. రామచంద్రకు హార్ట్ ఎన్‌లార్జ్‌మెంట్ జబ్బు! యిప్పుడైనా యశోధరవాళ్ళ నాన్న వచ్చి వుంటాడో లేదో!

శివారెడ్డి జిల్లా ఆఫీసరయ్యేడు. ఒక లక్ష కట్నం తెచ్చుకున్నాడు. నెల్లూరులో హాయిగా వుంటున్నాడు. స్నేహంకోసం డబ్బు ఖర్చుపెట్టగలిగిన వాడి స్థితి పెరిగిందేకానీ తరగలేదు. శివారెడ్డి స్నేహదృష్టి మారలేదు. వాడిలో నాకు నచ్చనిది ఒకటే - స్నేహితులకోసం తాను పెట్టే ఖర్చును తానే చాటుకుంటాడు. నేనేమో వొళ్ళు పొగరుతో నాలుగయిదు ఉద్యోగాలు పోగొట్టుకున్నాను. హైదరాబాద్ వీధుల్లో తిరిగి తిరిగి యీ ఉద్యోగం చిక్కించుకున్నాను. ఆ లోపు పెళ్లి అయింది. నాకంటే అధ్వాన్నమైన పరిస్థితుల్లోవున్న మేనమామ కూతురు వరలక్ష్మితో పెళ్లి అయ్యింది. కుదురుగా భయభక్తులతో వుండక తప్పలేదు. యేడాదినుంచీ యీ ప్రైవేట్ కాలేజిలో గంటకు ఆరు రూపాయల లెఖ్ఖన మూడువందలు నాలుగువందల మధ్య సంపాదన వస్తోంది. స్ట్రైకులు, సెలవులు వుండకూడదని తీరిక సమయాల్లో ధ్యానం చేస్తుంటాను. పర్మనెంట్ వుద్యోగం కోసం యెదురుచూస్తూ జీవిస్తున్నాను. కాలేజి మేనేజ్‌మెంట్ ఆశలు చూపుతూనే వుంది.

—యిటువంటి నాకు నెల మధ్యలో కాళహస్తికి వెళ్ళటానికి కనీసం వందన్నా కావాలి. హైదరాబాదుకూ కాళాహస్తికి మధ్యవుండే దూరం నా కళ్ళల్లో మెదులుతోంది.

అది నడవలేని దూరం.

రైల్లోనో, బస్సులో మాత్రమే వెళ్ళే దూరం!

ప్రయాణానికి డబ్బులు అవసరమయిన దూరం!

అతి దగ్గరైన గుండెల మధ్య కాలంలో, స్థలంలో దూరం!

యెంతెంత దూరం చాల చాల దూరం అనే చిన్నపిల్లల ఆట జ్ఞాపకానికి వస్తోంది. నా గొర్రెతోక జీవితం చిన్నపిల్లల ఆటను నిజం చేస్తోంది.

చేతిలో ఒక్క వందా యాభై, కనీసం ఒక్క వంద వున్నా ఈ కాలాన్ని, స్థలాన్ని జయించగలను. తాత్కాలికంగానైనా సరే వాటిని దాటగలను. కాళహస్తికి రేపు ఉదయం చేరుకోగలను. కానీ డబ్బు! ఈ మహానగరంలో యిచ్చేనాధుడు నాకు కన్పించటంలేదు. రెండు మూడుగంటల వ్యవధిలో వంద దొరికే ఉపాయం తోచటంలేదు.

నామీద, నా ఉద్యోగం మీద నాకు మంట పుట్టింది. వట్టి మంటవల్ల సమస్యలు తీరవని నాకు తెలుసు. అయినా మండింది.

బస్సు వచ్చింది. గుంపులో జొరబడి కాళ్ళు తొక్కి-ళ్ళకు లోనై కసిగా నేను తొక్కి బస్సులో యింత చోటు సంపాదించుకున్నాను. కండక్టరు ముందుకు వెళ్ళమని హెచ్చరించేడు. ముందుకు నెట్టుకొని పోతూ మంచి

దుస్తుల్లో వున్న యెవరో యువకుని ఈర్ష్యతో కాలు తొక్కేను. అదృష్ట వశాత్తూ ఆ యువకుడు నన్నేమీ అనలేదు.

పరుగెడుతోన్న బస్సులోంచి నగరం కన్పిస్తోంది. నగరమంతా నాకు డబ్బు గానే కన్పిస్తుంది. కానీ అది నా చేతిలో లేదు.

యిళ్ళు చేరుకొన్నాను.

"యేం అట్లా వున్నారు?" అని అడిగింది వరలక్ష్మి

టెలిగ్రాం అందించేను.

"యెవరి కేమైంది చెప్పండి?" అంది ఆతురతగా ఆందోళనగా.

రామచంద్ర విషయం చెప్పేను.

సానుభూతితో అంది వరలక్ష్మి -

"పాపం, మీరు వెళ్ళి చూసివస్తేనే బావుంటుంది.

"డబ్బులు లేవు" అన్నాను నీర సంగా.

"నిజమే. వెళ్ళి యెవరు మాత్రం చేసేదేముంది?"

వరలక్ష్మి సత్వర సమాధానానికి గతుక్కుమన్నాను. యెంత సులభంగా మాట మార్చింది అనుకున్నా. కాని ఆమె పొడిమాటల వెనుక లోకజ్ఞత, నిస్పృహ యత నుంచీ పుట్టిన వేదాంతం వుందని నాకు తెలుసు. అయినా వరలక్ష్మి మీద కోపం వచ్చి అణుచుకున్నాను.

మా నాన్నకో, మీ నాన్నకో యెట్లానో వుంటే వెళ్ళిమాత్రం చేసేదే ముంది అంటావా అని అడుగుదామను కున్నాను. అడిగి ప్రయోజనంలేదు. అలాంటి సమయాల్లో వరలక్ష్మి నా అప్రయోజకత్వాన్ని దెప్పి పొడవవచ్చు. యేడ్చి మొత్తుకోవచ్చు; నా నిస్పృహ యతను శపించవచ్చు అనుకున్నాను. స్నేహితుడు రక్తబంధువు కాదు. లేమిని పెంచుకోవటం విజ్ఞత కాదు. అందుకే నేమో వరలక్ష్మి వేదాంతం!

దిక్కుతోచని స్థితిలో ఆలోచిస్తుంటే ఆశ తలుక్కుమంది. పీటర్ మనసులో మెదిలేడు. అతన్ని డబ్బు అడిగితే అనుకున్నాను. అడగక తప్పదు. నేను ద్వేషించే పీటర్‌నే డబ్బు అడగక తప్పదు. ఆరు నూరైనా అడగక తప్పదు.

ఆంధ్ర లయోలాలో బి.ఏ.లో నా క్లాస్ మేట్. యిప్పుడు కాలేజీలో పర్మనెంట్ లెక్చరరు. వాడి భార్యా లెక్చరరే. రెండుచేతులా సంపాదిస్తున్నారు. డబ్బు వుండకపోదు. మొదటినుంచి వాడు జాగ్రత్త మనిషి. పెద్ద వుద్యోగి కొడుకు.

వున్నట్టుండి బయలుదేరాను. నా వాలకం చూచి వరలక్ష్మి 'యెక్కడికండి' అని అడిగింది.'యిప్పుడే వస్తా' నంటూ పీటర్ యింటికి బయలుదేరాను. పీటర్ వాళ్ళ యిళ్ళు మాయింటికి కాస్త దగ్గరే




దారంబడి ఆలోచనలు, ఆందోళన, సంకోచం పీటర్ యేమంటాడోనని.

పీటర్ యింట్లోనే వున్నాడు. పీటర్ భార్య సుగుణ యింట్లో లేనట్లుంది.

పరిస్థితి వివరించేను. రెండువందలు ఆదుకోమని ప్రాధేయపడ్డాను. ఒకవైపు నేను ప్రాధేయపడుతున్న భాషే నాకు యెబ్బెట్టుగా వుంది. హీనంగా వుంది. ఆత్మహింసగా వుంది. అకారణంగా నేను ద్వేషించే పీటర్ ముఖం నాకు మరింత ముచ్చుగా కన్పిస్తోంది. కాని ప్రాధేయపడ్డాను.

పీటర్ నావైపు విచిత్రంగా చూశేడు:

"స్నేహితుని కోసమా?" అన్నాడు.

అవునన్నాను.

యేమనుకున్నాడో యేమో మర్యాదగా చెప్పేడు:

"సారి శ్రీరాం! క్రిస్మస్ ఖర్చులు వచ్చిపడ్డాయి. ఐ. పిటీ. అయినా చూస్తావుండు."

పీటర్ అవతలి గదిలోకి వెళ్ళేడు. అడిగి లేదనిపించుకుంటానేమో. లేదని చెపితే యేంచేయాలని మధన పడుతున్నా.

పీటర్ చేతిలో పదులనోట్లు చూసి

ప్రాణం లేచివచ్చింది. వందాయాభై లెక్కపెట్టి నా చేతిలోవుంచి—

"రేపు ఫస్టుకు యివ్వాలి. సుగుణా పీటర్ డబ్బు యిది. సుగుణ యింట్లో కూడాలేదు. ఆమె వేనిటీబాగ్ లోంచి తీసి యిస్తున్నా, నేను చెప్పుకుంటాలే నీకు అవసరం వుండి యిచ్చేనని" అన్నాడు.

డబ్బు నా చేతిలో వుంచేప్పుడు పీటర్ చూసిన చూపు జన్మజన్మలకు మరిచిపోలేను. డబ్బులేని వాడికి వెధవ బంధాలు. పనికిమాలిన సెంటిమెంట్లూ యేమిటి అన్నట్లుంది, పీటర్ చూపు. వాడి కళ్ళల్లోకి చూడకుండా "లెక్కపెట్టుకో" అని అంటున్నా జేబులో కుక్కుకొన్నాను. కృతజ్ఞత చెప్పాను. పీటర్ దగ్గరే తెల్లకాగితంతీసుకొని లీవ్ లెటర్‌రాసి మా హెడ్‌కు యిమ్మన్నాను.

సరేనంటూ ఎంతో చనువుగా అన్నాడు.

"తొందరగా రండి! క్లాసులు పోతాయి" అన్నాడు.

పీటర్ సలహాకు సంతోషించాను. అంతమాత్రమే సలహా యిచ్చాడు. నీది దినకూలి కదా యిన్ని గంటలకు యింత డబ్బు పోతుంది అని చెప్పలేదు.

అంగీకార సూచకంగా తలవూపి బయటపడ్డాను.

సుగుణా పీటర్ డబ్బు! పీటర్ డబ్బు!! యెవరిడబ్బు అయితే నాకేం? అది దూరాన్ని జయిస్తుంది. స్థలాన్ని దాటుతుంది. నన్ను కాళహస్తి చేరుస్తుంది. నేను రామచంద్రను చూస్తాను. నాకు కావలిసింది అంతే.

యింట్లో వరలక్ష్మి చేతికి వో నలభై యిచ్చేను. ఆవిడ నా పరపతి చూసి ఆశ్చర్యపోయినట్లుంది. నా తొందరకు యిబ్బందిపడినట్లుంది. యేమీ అనకుండా తీసుకొని "తొందరగా రండి" అంది.

ఆదరాబాదరగా ప్రయాణమై వెళ్ళేను.

నిద్రలేమితో, మనసును కుళ్ళబొడుస్తున్న ఆలోచనలతో, రామచంద్ర యింకా కొన్నాళ్ళు తప్పక జీవిస్తాడు అనే ఆశతో, రామచంద్ర యేమైనా అయివుంటే యశోధరను యెలా ఓదార్చాలో తెలీనితనంతో మరునటి రోజు వుదయానికి కాళహస్తి చేరుకున్నాను.

రామచంద్ర యింటిముందు యే సందడీలేదు. గుండె అదురుతోంది. యింట్లోకి వెళ్ళేను. వోమూల మోకాళ్ళ చుట్టు చేతులేసి ముఖం దాచుకొని వుంది యశోధర. ఆ పక్కన్నే వాళ్ళమ్మ దీనంగా కూచొని వుంది. రామచంద్ర కూతురు అమాయకంగా అవ్వఒడిలో నిద్రపోతోంది. నలుగురయిదుగురు కాలేజి విద్యార్థులు మౌనంగా కూచొని వున్నారు. ఒక మంచంమీద యశోధర వాళ్ళనాన్న కూచొని వున్నాడు.

పరిస్థితి అర్థమైంది. నాకు నోట మాట రావేదు.

"హైదరాబాద్ నుంచే వస్తున్నావా?" యశోధర నాన్న ప్రశ్నతో నాకేదో విపరీత ధోరణి కన్పించి సమాధానించలేదు.

యశోధర తలెత్తి చూసింది. ఆమె నొసట పసుపు కుంకుమ లేదు, కాసేపు బెక్కింది.

నా సానుభూతి వాక్యాలేవో వాటిని మౌనంగా వింది. మళ్ళీ కుళ్ళుకుంటూ యేడుస్తూ కూచుంది. ఆ వాతావరణం నాకు హృదయశల్యంగా వుంది.

యశోధర వాళ్ళ నాన్న మా రామచంద్ర చివరి ఘడియలను గురించి వివరిస్తున్నాడు. శివారెడ్డి విషయాన్ని ప్రశంసిస్తున్నాడు.

"మనిషంటే శివారెడ్డేనయ్యా! అంత పెద్ద ఆఫీసరు స్నేహితుని కోసం పడిన అవస్థలు తలచుకుంటే నాకే యెలానో వుంది. మమ్మల్ని పిలిపించింది అతనే. యేదో బుద్ధితెలీక యిన్ని రోజులు వీళ్ళను పోగొట్టుకున్నాను. యిప్పుడు యశోధరకు యెవరున్నారు చెప్పు. కన్న తల్లితండ్రులం మేంతప్ప? వాళ్ళ అత్త మామలకు యేం పట్టింది? మొన్న చూశేరు. నిన్న వెళ్ళిపోయేరు."

ఆయన మాటల్లో నాకేమాత్రం సహజత్వం కన్పించలేదు. యిప్పుడు తాము తప్ప యశోధరకు యెవ్వరూ లేరట!

అక్కడ ఒక్కక్షణం వుండలేక పోయాను.

"వెళ్ళొస్తానమ్మా" అన్నాను.

యశోధర మౌనంగా తలవూపింది.

"శివారెడ్డి పొద్దున్నే నెల్లూరికి వెళ్ళిపోయేడు. వారి జబ్బు నయంకాదని మా కందరికి తెలుసు. అయినా శివారెడ్డి బలవంతంమీదనే ఆస్పత్రిలో చేర్పించాం. ఆయన మూడు నాలుగు వేలు సాయం చేశేడు. అలాంటి స్నేహితుల ఋణం యే జన్మలోనూ తీరేదికాదు. అమ్మా నాన్న కూడా సమయానికి వచ్చి ఆదుకున్నారు."

యశోధర అప్పుతూనే యశోధర నాన్న అందుకున్నాడు!

"పాపం! శివారెడ్డిని చాలా యిబ్బందులు పెడుతున్నాం. ఆ పదివేల విషయం ప్రిన్సిపాలుతో మాట్లాడి వెళ్ళేడు. పెన్షన్ విషయం చూస్తానన్నాడు....

యశోధర బెక్కుతూనే వుంది.

మనసు చెదిరిపోయింది.

యెందుకంటున్నానో తెలీకుండా "ప్రేమలు ప్రకటించటానికి కూడా స్తోమత, తెలివే వుండాలమ్మా" అని మెల్లిగా గొణిగేను. యశోధర వాళ్ళ నాన్న చూపులు భరించలేక బయటికి నడిచేను.

తల చెడిపోయింది.

నన్నయ్య, 'తెలుగు వెలుగు' పాతాళ్లోకి! 'వ్యక్తి స్వాతంత్ర్యం' 'ప్రణాళికలు – దేశాభ్యుదయం' కాంపోజిషన్ల తప్పుల్లోకి వెళ్ళాలి... త్వరగా వెళ్లాలి.... గంటకు అరు రూపాయల ప్రపంచంలోకి....

———



# మానవత్వం ఇంకా బ్రతికే ఉన్నది

పి. ఉమాదేవి

కోర్టు హాలంతా జనంతో కిక్కిరిసి పోయింది. ఆ రోజు, ఒక హత్య కేసు విచారణ జరగబోతుంది. జనం, ముఖాలలో ఆతృత, ఏం జరుగుతుందో నన్న ఆసక్తి కనిపిస్తున్నాయి.

విచారణ మొదలైంది. పబ్లిక్

ప్రాసిక్యూటర్, తన సీటునుంచి లేచాడు గౌను సర్దుకుంటూ.

దోషి హాజరు పెట్టబడ్డాడు. మాసిన గెడ్డం, నలిగిన బట్టలు – పాతికేళ్ళుండ వచ్చు. ఈ లోకంతో నిమిత్తం లేనట్లు నిర్లక్ష్యంగా ఉన్నాయి అతని చూపులు. అతని వద్దకు వచ్చాడు ప్రాసిక్యూటర్.

"నీ పేరు?" అని ప్రశ్నించాడు.

"రాజు." జవాబిచ్చాడతను.

"నీ వృత్తి?"

"టాక్సీడ్రైవర్ని."

"చూడు రాజూ! గత నెల 15 వ తారీఖు రాత్రి, నలుగురు పెద్దమనుషులు నీ టాక్సీ ఎక్కారు. వాళ్ళను, అమానుషంగా చంపావు. ఈ నేరం నీవు చేసినట్లుగా ఒప్పుకుంటావా?"

"ఒప్పుకుంటున్నాను."

"అయితే వాళ్ళను ఎందుకు చంపావు?"

"చెప్తాను. చెప్పటానికే ఇంకా బ్రతికి ఉన్నాను. ఆ నలుగురూ ఎంతటి దుర్మార్గులో, ఈ లోకానికి తెలియచెప్పటానికే నేను బ్రతికి ఉన్నది. చట్టం దృష్టిలో నేను హంతకుణ్ణి. కాని, నేను చెప్పింది విని, కొంతమందైనా నన్నర్థం చేసుకుంటే నాకదే సంతృప్తి. నా మనసుకు శాంతి. ఆ రోజు" అతను చెప్పటం ప్రారంభించాడు. జనం ఆసక్తిగా అతనివైపు చూడసాగారు.

"ఆ రోజు.... రాత్రి, పన్నెండు గంటలు దాటి ఉండవచ్చు. ఆకాశం మబ్బులు పట్టి ఉన్నది. వర్షం వచ్చేటట్లున్నది. ఖాళీగా, టాక్సీలో వెళ్ళుతున్నాను. అంతలో,

"టాక్సీ! టాక్సీ" అని ఎవరో పిల్చారు. అటువైపు చూసాను. అక్కడ నలుగురు వ్యక్తులు నిలబడి ఉన్నారు. ఒకతను చెయ్యి ఊపుతూ నన్ను పిలుస్తున్నాడు. టాక్సీ తీసుకెళ్ళి వాళ్ళ ముందుంచాను.

ఆ నలుగురూ టాక్సీ ఎక్కారు. వెళ్ళవలసిన స్థలం చెప్పారు. టాక్సీని స్టార్టు చేసాను. వాళ్ళల్లో వాళ్ళు మాట్లాడకోసాగారు. బాగా తాగేరేమో, వాసన అదరకొడుతుంది. ముద్దగా వస్తున్నాయి. ఒకటే నవ్వులు, కేకలు. ఆ వాసన, ఆ గోలను భరిస్తూ, టాక్సీ నడుపుతున్నాను. చిన్న చిన్న చినుకులతో వర్షం మొదలైంది.

"మొత్తానికి ఆనందరావు పెద్ద రసికుడే. ఈ వయస్సులోనే ఇంత రసికత్వం ఉంటే, అసలు వయస్సులో ఇంకెలా ఉండేవాడో" అని అన్నాడు వెనుక కూర్చున్న వాళ్ళల్లో ఒకడు. మిగిలిన ఇద్దరూ గొల్లుమని నవ్వారు. నా ప్రక్కన కూర్చున్నతను, బహుశా, ఆనందరావై ఉండాలి, ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నాడు.

"ఇప్పుడేముంది. వయస్సులో ఉండగా ఒక ఆట ఆడాను. ఎలాంటి

అమ్మాయినైనా యిట్టే వల్లో వేసుకొనే వాణ్ణి," అన్నాడు పెద్ద పోజుపెడ్తూ.

"అయితే నీ లీలల్లో మచ్చుకు ఒకటి, మాకినిపించాలి. కొంతసేపైనా కాల క్షేపం అవుతుంది" అని పట్టుబట్టారు మిగిలిన ముగ్గురూ.

"అయితే వినండి" అని మొదలు పెట్టాడు. నాకు చిరాకుగా ఉన్నది. బయట వర్షం ఎక్కువ కాసాగింది.

"అవి నేను కాలేజీ చదివే రోజులు. విజయవాడలో నేను అద్దెకుండే మేడ క్రింది పోర్షన్‌లో సుదర్శనం అనే మందుల కంపెనీ సేల్సుమాన్ ఉండే వాడు. ఆయనకు ఒక్కర్తే కూతురు. పేరు కళ్యాణి."

ఆకాశంలో మెరుపు మెరిసింది. నా గుండెలు జల్లుమన్నాయి.

"కళ్యాణి నిజంగా పంచకళ్యాణిలా గుండేది. చక్రాల్లాంటి కళ్ళు, సంపెగ మొగ్గలాంటి ముక్కు, ఎడమ బుగ్గమీద బ్యూటీ స్పాట్ లాంటి పెద్ద పుట్టు మచ్చ - అప్సరసలాగుండేది. ఆమె అందం, నన్ను పిచ్చెక్కించేసేది. ఎలాగైనా వల్లో వేసుకోవాలని విశ్వ ప్రయత్నం చేసాను. అంత ఈజీ అయిన ఘటంకాదు. నాకు చిక్కకుండా, చాలా రోజులు నన్ను ఏడిపించింది. తగిన సమయం కోసం చూస్తున్నాను. నేను ఆశించిన అవకాశం, ఒక రోజు రానే వచ్చింది. ఆ రోజు ఆమె తండ్రి క్యాంపులో ఉన్నాడు. కళ్యాణి ఒంటరిగా దొరికింది. కన్నెపిల్లకు వేయవలసిన మహత్తరమైన మంత్రం ప్రయోగించాను. పెండ్లి చేసుకుంటానన్నాను. మొదట బెట్టుచేసింది. నేను కొంత బల వంతం చేసాను. అరచి, అల్లరిచేస్తా నన్నది. 'అరుస్తే, నీకే నష్టం. నీ జీవితం అల్లరి అవుతుందని' బెదిరించాను. దానితో, నాకు లొంగక తప్ప లేదు. కళ్యాణిలాంటి మొండిఘటాలను కూడా ఈజీగా లొంగతీసుకున్నాను."

"స్టాపిట్ !" దాదాపు అరిచినట్లుగా వినిపించింది. "ఆ రోజు కళ్యాణి నీకు లొంగలేదు" అన్నాడు వెనక కూర్చున్న వాళ్ళలో ఒకడు.

"లొంగలేదని నీ కేం తెలుసు" అన్నాడు ఆనందరావన్నతను, ముఖం కందగడ్డలా అయింది.

"నా కంతా తెలుసు. ఆ కళ్యాణి తండ్రి, నా తండ్రి స్నేహితులు. ఒక రోజు, కళ్యాణి తండ్రి మా ఊరు వచ్చాడు. 'ఆనందరావనే రాస్కెల్, తన కూతురు వెంటపడే వాడని, ఒక రోజు తను యింటిలో లేని సమయంలో, బలాత్కరించబోయాడనీ, తన కూతురు కేకలు పెట్టగా చుట్టుప్రక్కలవాళ్ళు వచ్చి దేహశుద్ధి చేసారని, అది కక్షగా పెట్టుకుని, లేనిపోనివి కల్పించి, వచ్చిన సంబంధాలన్నీ చెడగొడుతున్నాడని' నా తండ్రికి చెప్పగా విన్నాను," అని ఆగా

డతను. ఆనందరావు తేలుకుట్టిన దొంగలా గమ్మున ఉండిపోయాడు.

నాలో రక్తం వేడెక్కసాగింది. బయట వర్షంకూడా ఇంకా ఎక్కువ కాసాగింది.

అతను మళ్ళీ చెప్పటం మొదలు పెట్టాడు.

"నా తండ్రి బలవంతంమీద ఆ అమ్మాయిని చూడక తప్పిందికాదు. అందంగానే ఉన్నది. కాని, బొత్తిగా ఫ్యామిలీ టైపుగా ఉన్నది. అటువంటి గుదిబండను కట్టుకుంటే, నా సరదాలు బంద్ అయ్యే ప్రమాదం ఉన్నది. అందుకనే, నాకు నచ్చలేదు. నా అభిరుచులకు అనుకూలంగా, ఏ మోడరన్ గర్లో అయితే బాగుండేది. కాని, మా నాన్న మాటను కాదనలేక పోయాను. తండ్రిమాట నిలబెట్టటానికి ఆమెను పెండ్లి చేసుకోవటానికి అంగీకరించాను. సరిగా ముహూర్తం సమయానికి, పెండ్లి కూతురు కనబడటంలేదన్నారు.అందరూ హడావిడిగా వెతికారు. కళ్యాణి ఎక్కడా కన్పడలేదు. పెండ్లిపీటల వరకూ వచ్చి, పెండ్లి ఆగిపోయింది. కొందరు ఆ అమ్మాయి ఎవరితోనో లేచిపోయి ఉంటుందన్నారు. "అవమానం భరించలేక, కళ్యాణి తండ్రి గుండెపోటుతో మరణించాడు."

"అబద్ధం. శుద్ధ అబద్ధం. కళ్యాణి తండ్రి చనిపోవటానికి కారణం అది కాదు" అని అరిచాడొకడు.

"ఆ రోజు కళ్యాణి లేచిపోలేదు. నీవే మోసంచేసి, అందటి కళ్ళల్లో కారం జల్లి, కట్నం తాలూకు డబ్బుతో, పెండ్లి పీటలనుండి పరారయ్యావు. పీటలమీద పెండ్లి, తప్పిపోవటంతో గుండెపోటుతో ఆమె తండ్రి మరణించాడు."

స్టీరింగుచుట్టూ నా చేతులు బిగుసుకున్నాయి. వర్షం తగ్గుముఖం పట్టింది.

తండ్రి చనిపోయిన తరువాత, నా అనేవాళ్ళు లేక, అష్టకష్టాలుపడిందామె. చివరకు నేను పనిచేసే కంపెనీలోనే చిన్న ఉద్యోగం దొరికింది. చాలా ముభావంగా ఉండేది. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడేది కాదు. మాట్లాడినా, చాలా ముక్తసరిగా మాట్లాడేది. తన పనేదో తనేమో. అందుకనే ఆమంటే, నాకు యిష్టం ఏర్పడింది. పెండ్లి చేసుకుంటే అటువంటి అమ్మాయినే చేసుకోవాలనుకున్నాను.

ఒకరోజు నా మనసులో మాట ఆమెకు తెలియపర్చాను. ఆమె అభిప్రాయం అడిగాను. ఆ సమయంలోనే, ఆమె గురించి నాకు అన్ని విషయాలు తెలిసాయి. తన మీదున్న అపవాదు, తన పెండ్లి, పీటల వరకు వచ్చి ఆగిపోయిన వృత్తాంతం, తనతండ్రిమరణం- అన్ని విషయాలూ ఏమీ దాచకుండా వివరంగా చెప్పింది. అప్పుడే ఆమెను అల్లరిచేసిన ఆనందరావు గురించి, ఆమెను, ఆమె తండ్రిని మోసంచేసి,

పారిపోయిన ముకుందరావు గురించి తెలిసింది నాకు. కళ్యాణి తప్పేమీ లేద న్పించింది. మనస్ఫూర్తిగా ఆ మె ను పెండ్లాడాను. అమ్మా, నాన్న, బంధు వులు ఎవరూ రాలేదు. స్నేహితుల సమక్షంలో, ముక్తసరిగా జరిగింది మా పెండ్లి.

ఆర్నెల్లు మా సంసార జీవితం, ఎంతో ఆనందంగా జరిగిపోయింది. ఇద్దరి సంపాదనతో స ర దా గా గడిచి పోయింది. కానీ, ఆ తరువాతే, మాకు కష్టాలు ప్రారంభం అయ్యాయి.

ఒకరోజు కంపెనీ మే నే జ రు కళ్యాణితో అసభ్యంగా ప్రవర్తించాడు. ఆవేశంలో చెయ్యిచేసుకున్నాను. ఆ కక్షతో ఆ రాస్కెల్ నన్ను ఉద్యోగం నుంచి తొలగించాడు. ప్రిస్టేజి కోసం, కళ్యాణిని ఉద్యోగం మాన్పించాను. ఇద్దరికీ ఉద్యోగాలు లేకుండాపోయాయి. గడవటం కష్టం అయిపోయింది. ఇంట్లో ఉన్న ఒక్కొక్క సామాను బయటకు వెళ్ళసాగింది.

అప్పటికి కళ్యాణి ఒట్టిమనిషి కూడా కాదు. ఉద్యోగం గురించి చేసిన ప్రయత్నాలు ఒక్కటీ ఫలించలేదు. బాగా విసిగిపోయాను.

కళ్యాణికి నొప్పులు మొదలైనాయి. హాస్పిటల్‌లో జాయిన్ చేశాను. కాని, దురదృష్ట వశాత్తు డెలివరీ కష్టమై, ఆమె మరణించింది." చెప్పటంఅపుచేశాడతను.

నా రక్తం సలసలా కాగిపోతున్నది. అప్పటివరకు మౌనంగా వున్న నాల్గ వతను బిగ్గరగా నవ్వాడు.

"సెభాష్! కరుణాకరం! చాలా తెలివిగా కథను ముగించావు" అన్నాడు.

"కథేమిటి? అసలు జరిగింది అదే. బలహీనంగా ఉన్నదేమో, బిడ్డను కన లేక చనిపోయిందామె" అతని కంఠం తీవ్రంగా పల్కింది.

"అంతా అ బ ద్ధ ం. ఆమె చని పోలేదు. ఆమెను, ఆమె బిడ్డను, నిర్దా క్షిణ్యంగా వాళ్ళ ఖర్మానికి వాళ్ళను వదిలేసి, నీ సుఖంకోసం పారిపోయావు. ఆ తల్లి, బిడ్డ అనాథలైపోయారు" అన్నాడు ఆ నాల్గవతను.

"డోంట్ టాక్ రబ్బిష్! నేనంత కసాయివాణ్ణి కాదు, పెళ్లాం, బిడ్డలను వదిలి పారిపోవటానికి" అన్నాడు కరుణాకరం అన్నతను.

"నీ వెం త దయాపరుడవో నాకు తెలుసు. ఆ తరువాత కళ్యాణిని, ఆమె బిడ్డనుఆదరించింది నేనని నీకు తెలియదు" అన్నాడు ఆ నాల్గవతను వ్యంగ్యంగా.

"అసలేం జరిగింది మూర్తిగారూ? అంతా వివరంగా చెప్పండి" అని సంతో షంగా అడిగారు మిగిలిన ఇ ద్ద రూ. వాళ్ళకు కరుణాకరంమీద పీకలదాకా కోపంగా ఉన్నది.

"ఏముంది. ఈ మహానుభావుడికి ఉద్యోగం దొరకలేదు. కష్టాలు పడలేక

పోయాడు. అంతలో మేనమామ దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. 'మంచి ఉద్యోగం, హోదాలతోబాటు, బరువైన కట్నంతో తన కూతురును ఇస్తాను, వెంటనే బయలుదేరి రావలసినదిగా. మంచి అవకాశం వచ్చింది. అనవసరంగా కష్టాలు పడటం ఎందుకనుకున్నాడు. వన్ ఫైన్ మార్నింగున,భార్యా బిడ్డలను వదిలేసి చెక్కేసాడు. దానితో కళ్యాణి, ఆమెబిడ్డ అనాధలై రోడ్డుమీద పడ్డారు," అని ఆపుచేసాడతను.

"అప్పుడు వాళ్ళను నీవు ఉద్ధరించావా?" అని అడిగాడు కరుణాకరం క్రోధం నిండిన గొంతుతో.

"అవును. ఒకరోజు, నా భార్య, కల్యాణి. తలవని తలంపుగా కలవటం జరిగింది. కళ్యాణి, నా భార్య చిన్ననాటి స్నేహితులు. స్నేహితురాలి కష్టాలు విని, జాలిపడి, నా భార్య, ఆ తల్లిని, బిడ్డను మా యింటికి తీసుకొని వచ్చింది. ఈ పెద్దమనిషి ఇంకా తిరిగి వస్తాడని ఎదురుచూసింది. ఆమె ఆశ నిరాశే అయ్యింది. ఆమె దురదృష్టంకొద్దీ, ఆమె బిడ్డ కాస్తా గుటుక్కుమన్నాడు. ఆ షాక్‌తో పిచ్చిదైపోయింది. ఒక రోజు ఎవరికీ చెప్పకుండా ఎటో పోయింది. పాపం, ఎక్కడున్నదో, ఏమయిందో," అని ముగించాడతను.

నా నరాలు తెగిపోతున్నట్లుంది. 'దొంగ రాస్కెల్స్. సంఘానికి చీడ పురుగులు. అటువంటి చీడపురుగులను కొన్ని అయినా ఏరిపారేయాలి. వాళ్ళను మట్టుపెట్టితేగాని, వాళ్ళ చేతుల్లో అమానుషంగా బలైపోయిన ఆ స్త్రీ మూర్తి ఆత్మకు శాంతి లభించదు.' వర్షం పూర్తిగా వెలిసింది.

రూటు మార్చాను. వాళ్ళదేమీ గమనించే స్థితిలోలేరు. వాళ్ళలో వాళ్ళు యింకా వాదించుకుంటున్నారు. ఒకరు చేసిన తప్పులు, ఇంకొకరు ఎత్తిపొడుచుకుంటున్నారు. మందు ప్రభావంలో, ఒళ్ళుమరిచి తిట్టుకోవటం మొదలెట్టారు.

తిట్టుకొని, తిట్టుకొని అలసిపోయారేమో, కొంతసేపటికి మాటలు విన్పించటంలేదు. చాలాదూరం తీసుకొని వెళ్ళాను. ఊరికి దూరంగా, వాళ్లు అరచి గీపెట్టినా, ఏ సహాయం అందని చోటకు తీసుకొని వెళ్ళాను. అప్పటికే ఇద్దరు మంచి నిద్రలో ఉన్నారు. మిగిలిన ఇద్దరూ, నిద్రావస్థతో జోగుతున్నారు. అదే మంచి అవకాశం అనుకున్నాను.

సడన్‌గా ఒకచోట కారాపాను. వాళ్ళను గమనించాను. మత్తుగా పడున్నారు. నిశ్శబ్దంగా కారు దిగాను. ఆకాశం నిర్మలంగా ఉన్నది. కాని, నా గుండెల్లో ప్రతీకార జ్వాలలు రగులుతున్నాయి.

వెంటనే, కారు నాలుగు డోర్స్ తెరవకుండా చేశాను. వాళ్ళవైపు చూసాను.

ఇప్పుడు వాళ్ళు బోనులో బంధించబడిన పులులు. నా చేతిలో చిక్కారు. దయా దాక్షణ్యాలు లేకుండా చంపాలి. ఏ అమానుష కృత్యాలతో, ఒక స్త్రీ జీవితాన్ని, కుక్కలు చింపిన విస్తరిగా చేసారో, ఆ విధంగానే, వీళ్ళ శరీరాలను కూడా, అమానుషంగా కాల్చి చంపాలి. అప్పుడుగాని, నాకు మనశ్శాంతి ఉండదు.

డిక్కీలో ఉన్న రెండు టిన్నుల పెట్రోలు తీసుకున్నాను. కారు మొత్తం గుమ్మరించాను. దానితో మెలుకవ వచ్చి లేచారు. మత్తు పూర్తిగా దిగిపోయింది. తలుపులు తెరవటానికి ప్రయత్నించారు. లాభంలేకపోయింది. గ్లాస్ విండోస్ నుండి బయటపడాలని ప్రయత్నించారు. ప్రయోజనంలేకపోయింది. బండల్లాంటి శరీరాలు రాలేకపోయాయి. ముందు, వెనక గ్లాసెస్ పగలకొట్టాలని చూసారు. కుదరలేదు. నేను చేసిన బోనులో చిక్కుకుని, ప్రాణభీతితో, పిచ్చెక్కిన కుక్కల్లాగా ఉన్నారు. తృప్తిగా నవ్వుకున్నాను, అన్ని రోజులకు.

అగ్గిపుల్ల వెలిగించాను. వాళ్ళ ముఖాలలో భయం కొట్టొచ్చినట్లు కన్పించింది. చంపవద్దని ప్రార్థించారు. ఎంత కావలిసివస్తే అంత డబ్బు ఇస్తామన్నారు. నా మనసు కరగలేదు. వాళ్ళ అకృత్యాలకు బలైపోయిన, ఆ స్త్రీ రూపం నా కళ్ళకు కన్పించినట్లైంది.

వెంటనే, నా చేతిలో వెలుగుతున్న ఆ అగ్గిపుల్లను వాళ్ళవైపు విసిరేసాను. అంతే. ఒక్కసారిగా భగ్గుమని మంటలు లేచాయి. ఆ నలుగురూ చావుకేకలు పెడుతున్నారు. నా గుండెల్లో అంతులేని తృప్తి. నా మనస్సుకు శాంతి. నా హృదయం ఆనందంతో ఉప్పొంగింది. సంతోషంతో, తనివితీరా నవ్వుకున్నాను. బిగ్గరగా నవ్వుకున్నాను. నలుగురూ మాడి మసైపోయారు. దానితో, నా కసి తీరింది."

ఆవేశంగా చెప్పుకుపోతున్నాడతను. ఆ దృశ్యం తలుచుకొని అక్కడి జనానికి వొళ్ళు జలదరించినట్లయింది.

"అయితే, ఎవరో ఒక స్త్రీకి ద్రోహం చేసారని, వాళ్ళ నలుగురిని చంపావు. కాని, ఆ నాల్గవతను కళ్యాణిని ఆదరించాడు కదా! అతనిని కూడా ఎందుకు చంపవలసి వచ్చింది," అని ప్రశ్నించాడు ప్రాసిక్యూటర్.

జనం ఆసక్తిగా, చూస్తున్నారు, అతనిని.

"వాడూ దుర్మార్గుడే. ఆమె జీవితాన్ని పూర్తిగా నాశనంచేసింది వాడే. వాడి పేరు భైరవమూర్తి. కళ్యాణి పిచ్చిదై ఎటో వెళ్ళిపోయిందని చెప్పాడు. అదంతా అబద్ధం. ఆపదానికి ప్రాణం కన్న మిన్న అయిన శీలాన్ని హరించాడు వాడు. అంతేకాదు, డబ్బుకి కక్కుర్తిపడి, ఆమెను సానికొంపలకు

అమ్మేసాడు. పెట్టుబడికి, నాల్గింతలు వచ్చేవరకు అక్కడ పీల్చి పిప్పిచేయబడిందామె. ఎన్నో కష్టాలు, బాధలు ఆమె అనుభవించింది. ఎందుకు? దానికి కారణం, 'తను పోతే తన బిడ్డ అనాధ అయిపోతాడనే కడుపుతీపి. బిడ్డమీద మీద ప్రేమకొద్దీ, చావలేక, బ్రతికింది. ఆ బిడ్డను కూడా, ఈ సంఘం సరిగా బ్రతకనీయలేదు. అతని జన్మ అక్రమమైందని, అనుక్షణం హేళనలతో, అవమానాలతో హింసించింది. ఆ తల్లి, ఆ బిడ్డకోసం, ఆ బిడ్డ ఆ తల్లికోసం, అనుక్షణం చస్తూ బ్రతికారు. చివరకు, రోగాలతో తీసుకొని, తీసుకొని చని పోయింది ఆ తల్లి బిడ్డను అనాధచేసి.

ఇన్ని ఘోరాలకు కారణం ఎవరు? ఆ నలుగురే. అందుకనే, నిలువునా కాల్చి చంపాను." అతని కళ్ళనుంచి, ధారాపాతంగా కన్నీరు కారుతుంది.

"తప్పుచేసిన వాళ్ళను శిక్షించటానికి చట్టంఉంది. చట్టాన్ని నీ చేతుల్లోకి తీసుకోకూడదు," అన్నాడు ప్రాసిక్యూటర్.

"చట్టం, న్యాయం. ఒక ఆడదానిని సజీవంగా సమాధి చేసారు, ఆ నలుగురు పెద్దమనుషులు. వాళ్ళను ఏ చట్టం శిక్షించింది, శిక్షించలేదు. వాళ్ళచేతుల్లో అధికారం ఉన్నది. వాళ్ళ దగ్గర డబ్బుంది, చట్టాన్నికూడా తలక్రిందులు చేసే సామర్థ్యం ఉన్నది. వాళ్ళు సంఘంలో బలవంతులు. ఆ సమయం తప్పితే నేనేమీ చేయలేను వాళ్ళను. అందుకనే, వచ్చిన అవకాశాన్ని వినియోగించుకున్నాను. చట్టాన్ని నా చేతుల్లోకి తీసుకొని శిక్షించాను."

"నీ అభిప్రాయం సరికాదు. నీ కా హక్కులేదు."

"లేదని నాకూ తెలుసు. కాని, ఇటువంటి కిరాతకుల చేతుల్లో ఒక్క కళ్యాణేకాదు, మనచుట్టూ, ఈ సంఘంలో అనేకమంది కళ్యాణుల జీవితాలు నాశనం అవుతాయి. పేదరికం, ఆహారసమస్య, ఉద్యోగ సమస్యలకంటే, ఇటువంటి దుర్మార్గుల సమస్యే ఎక్కువగా ఉన్నది. ఒక ఆడది ప్రశాంతంగా బ్రతికే ఆస్కారం లేకుండా చేస్తున్నారు వీళ్ళు. అందుకనే వాళ్ళను అంతం చేయవలసి వచ్చింది"

"ఒకరి వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకొనవలసిన అవసరం నీకెందుకు? అసలు, కళ్యాణికి, నీకు ఉన్న సంబంధం ఏమిటి?"

"ఆమె .... ఆమె నాకు జన్మయిచ్చిన మాతృమూర్తి. నన్ను కన్న తల్లి. లాయర్! నా తల్లి లాయర్!" రెండుచేతులు ముఖానికి కప్పుకుని భోరున ఏడుస్తున్నాడతను. కొందరు, సానుభూతితో చూస్తున్నారతనిని.

"యువరానర్! ముద్దాయి తన నేరాన్ని ఒప్పుకుంటున్నాడు. తన తల్లికి

ద్రోహం చేసారన్న కక్షతో, ఈ హత్యలు చేయటం జరిగింది. అందు చేత, కోర్టువారు హంతకుడికి తగిన శిక్ష విధించవలసినదిగా ప్రార్థిస్తున్నాను." తన కథనాన్ని వినిపించాడు ప్రాసి క్యూటర్.

"రాజూ! నీవు చెప్పుకునేది ఏమైనా ఉందా?" అడిగారు జడ్జి రాజశేఖరం.

"లేదు."

"నీ తరపున వాదించటానికి లాయర్ ఎవరైనా ఉన్నారా?"

"లేరు."

"ఉన్నారు," అని వినిపించింది.

అందరూ అటువైపు చూడసాగారు. అతనొక లాయర్. సుమారు ముప్ఫై యేళ్ళుంటాయి. ఆశ్చర్యంగా, అందరూ అతనినే చూస్తున్నారు.

"నేను, ముద్దాయి తరపున వాదించ దలుచుకున్నాను. అనుమతించవలసిన దిగా కోరుకుంటున్నాను." అన్నాడతను.

డిఫెన్సుసైడు విచారణ జరిగింది. ఆ లాయరు, తన శక్తికొలది వాదించాడు.

విచారణ ముగిసింది.

* * *

ఆ రోజు, జడ్జిమెంటు ఇచ్చేరోజు. జనం ఆతృతగా ఎదురుచూస్తున్నారు, తీర్పు ఎలా ఉంటుందోనని. రాజుకు కొన్ని సంవత్సరాలు కఠిన శిక్ష విధించ బడింది. ఉరిశిక్ష, కనీసం యావజ్జీవ కారాగార శిక్ష అయినా పడుతుందని ఆశించిన కొందరికి, ఆశాభంగమే అయ్యింది.

* * *

శిక్షాకాలం పూర్తి అయింది. ఆ రోజు, రాజును విడుదల చేసారు. సెల్ నుండి బయటకు వచ్చాడు. అనేక సంవత్సరాల తరువాత బయట ప్రపంచంలో అడుగు పెడుతున్నాడు. 'జైలుశిక్ష అనుభవించిన తనను ఈ లోకం ఆదరించదు. అయినా, దీనితో తనకు పనేమిటి? ఆదరించక పోతే వచ్చిన నష్టం ఏమిటి? జీవితంలో చాలాభాగం గడిచిపోయింది. ఈ లోకం అంటే తనకు అసహ్యం' అనుకున్నాడు రాజు.

ఎదురుగా ఆ నాడు, తన గురించి వాదించిన లాయర్ చిరునవ్వుతో నిల బడివున్నాడు. తనను ఆహ్వానిస్తున్నాడు. ప్రశాంతత నిండిన ఆ ముఖారవిందం, జ్యోతుల్లా మెరిసిపోతున్న ఆ కళ్ళను చూసాడు రాజు. మంత్రముగ్ధుడిలాగా అతనిని అనుసరించాడు. అతను, తన యింటికి తీసుకొని వెళ్లాడు. కడుపునిండా భోజనం పెట్టాడు. ఆ ఆప్యాయత, ఆద రణకు చలించిపోయాడు రాజు.

ఆయనెవరో తనకు తెలియదు. ఎందుకు తనంటే ఆసక్తి చూపుతున్నాడో తెలియదు. ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. నిద్ర పట్టటంలేదు. అస్థిమి

తంగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. రాజు.

ఎదురుగా ఎవరిదో ఫోటో ఉన్నది. అతను.... అతను గుర్తుకువచ్చింది. వాడు భైరవమూర్తి. వాడి ఫోటో ఎందుకున్న దిక్కడ. అంటే ఈ లాయర్‌కు, వాడికి ఏం సంబంధం? వీడికి సంబంధించిన యింటిలోనా నేను ఉన్నది. ఆవేశంలో పిడికిలి బిగుసుకుంది. ఏం మోసం చేయ టానికి వీడు నన్నిక్కడకు తీసుకొని వచ్చాడు. వెంటనే ఈ సంగతి తేల్చు కోవాలి. ఆవేశంగా, ఆ లాయర్ గది లోకి అడుగుపెట్టాడు రాజు.

గద్దించి అడిగాడు. నోటికి వచ్చినట్లు తిట్టాడు. అన్నిటికి ప్రశాంతంగా నవ్వు తున్నాడతను. రాజు ఆవేశం దిగజారు తుంది.

"రాజూ! ఆవేశంలో నీకు ఏమి చెప్పినా నీవు అర్థం చేసుకోలేవు. ఆ రోజు, కోర్టులో, పతిత అయిన నీ తల్లి గురించి, నీ తల్లికి జరిగిన ద్రోహం గురించి, పదిమందికి ధైర్యంగా చెప్పుకో గలిగావు. కాని, సంఘంలో గౌరవ మర్యాదలున్నా, నా తండ్రి గురించి, నేను చెప్పుకోలేకపోతున్నాను. భైరవ మూర్తి నా తండ్రి. నా తండ్రి, నీతల్లికి చేసినద్రోహం,నీద్వారా ఆరోజువిన్నాను. నా మనసు ద్రవించింది. నీ తరఫున వకాల్తా పుచ్చుకున్నాను. వాదించాను. నీ శిక్ష తగ్గటానికి ప్రయత్నించాను.

"నా తండ్రి నీ తల్లికి తీరని ద్రోహం చేసాడు. కాదనను. యాదృచ్ఛికంగా వాళ్ళు నీ టాక్సీలో ప్రయాణం చేయటం జరిగింది. వాళ్ళ పాపాలు వాళ్ళ నోటి తోనే బయటపడ్డాయి. ఆవేశంలో నా తండ్రిని అమానుషంగా చంపావు. ఆ పరిస్థితులలో నీవే కాదు, ఎవరున్నా ఆ విధంగానే చేసేవారేమో.

"కాని, రాజూ! ఎంతో పతితురాలైనా నీ తల్లిమీద నీకు ప్రేమున్నట్లే, ఎంత నీచుడైనా నా తండ్రిమీద నాకూ ప్రేము న్నది. నా తండ్రిని చంపినందుకు,నిన్ను అంతం చేయగలను. అది నాకు కష్ట మైనది కాదు. కాని, మనిషన్న తరవాత అనేక బలహీనతలుంటాయి. మనిషి చేసిన తప్పులన్నింటిని శిక్షిస్తూ పోతే, అసలు మనుషులెవరు మిగలరేమో. శిక్షించటం కంటె, క్షమించటంలోనే ఆనందం వున్నది. మానవత్వం ఉన్నది. అందుకనే, నిన్ను ఆదరిస్తున్నాను. ఒక సోదరుడుగా ప్రేమిస్తున్నాను." అతని కంఠం దృఢంగా పల్కింది.

రాజు మనస్సు ఏదో తెలియని అయో మయ స్థితిలో ఉన్నది. ఈ లోకంలో 'మానవత్వం ఇంకా బ్రతికే ఉన్నది' అనిపించింది. అతని చూపులు ఎదురుగా దయనిండిని కళ్ళతో, నిశ్చలంగా, ప్రశాం తంగా ఉన్న బుద్ధుడి విగ్రహం మీదనే ఉన్నాయి.

---

# మొగలిరేకు

## యామిని

(గత సంచిక తరువాయి)

మనసులో ఆమెపట్ల ఎంతో సాను భూతి కలిగింది. కాని తాను నేర్పుగా వ్యవహరించాలి. ఆమెను ప్రోత్సహించి తన సిబ్బందిలో అసంతృప్తినికూడా కలిగించలేదు.

"మీకభ్యంతరం లేకపోతే నేను కొన్ని ప్రశ్నలు వెయ్యవచ్చా?" అన్నాడు.

"నేను జవాబులకోసం వచ్చేను. మీరు ప్రశ్నలు వేస్తానంటున్నారు," అందామె కొంచెం ఆవేశంగా.

మర్యాద ఇచ్చిపుచ్చుకోవాలి. అలాగే జవాబులు కూడా! మీరు జవాబులు చెప్పిన తర్వాత మీకు కావలసిన వివరాలన్నీ నేనిస్తాను."

"ఓకే దెన్!"

"మీకీ వివరాలు ఎందుకు కావాలి?"

"మా పేపర్లో రిపోర్ట్ చెయ్యాలి."

"చూడండి. మీరుచెప్పిన ఆ సెంటర్ లోనే అవినీతికి పాల్పడిన ఎంతరో స్త్రీ లున్నారు. వారందరి కథలూ మీరు మీ పేపర్లో వేసేరా?"

"అవి కొన్ని కేసులు! దానిని పేపర్లలో వెయ్యడం వలన వాళ్ళ భవిష్యత్తుకు హాని కలగడమే కాకుండా స్త్రీత్వానికే అది అవమానం చేసినట్లవుతుంది."

సరిగ్గా అలాగే మా సిబ్బందిలో చాలామంది ఎంతో మంచివారు. వాళ్ళ డ్యూటీ వాళ్ళు తప్పకుండా చేస్తారు. వారిలో కూడా అక్కడా అక్కడా ఈ ఆఫీసరు లాగా వాళ్ళ అధికారాన్ని మితిమీరే వాళ్ళున్నారు. వారి కథలు మీరు పేపరులో వేస్తే పోలీసు డిపార్టుమెంటు అంతా ఇటువంటి వారేననే తప్పు అభిప్రాయం మీ పేపరు చదివిన వాళ్ళకు కలిగే అవకాశముంది. ఒక పత్రికా ప్రతినిధిగా ఇటువంటి వాటిలో మీరు కూడా కొంత విచక్షణ చూపించడం అవసరం అని నేననుకుంటున్నాను."

అని అతని గురించిన వివరాలు చెప్పేడు.

ఆ అమ్మాయికి ప్రసాద్ మాటలు ఎంతో నచ్చేయి. పత్రికలో ఈ విషయం రిపోర్టు చెయ్యనని నవ్వుతూ చెప్పి వెళ్ళిపోయింది.

ఆమె నవ్వుతూన్నప్పుడు మల్లె పూలు రాలినట్లుగా ఉంది. ఆమె వెళ్ళిన తర్వాత కూడా ఆమెరూపం అతని మన సులో నుండి చెరిగిపోలేదు.

ఆ సాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి ఇంట్లో వాతావరణంఅంతా అసహజంగా తోచింది ప్రసాద్‌కి. సుశీల ముఖం కళా విహీనంగా ఉంది. ఎటో చూస్తూ తన అడుగుల చప్పుడువిని చటుక్కున తల తిప్పిన రుక్మిణి పిన్ని కళ్ళు తుడుచు కోవడం చూసేడు. తల్లికూడా అప్రస న్నంగా ఉంది.

రాత్రి పడుకోబోతూంటే అడుగులో అడుగు వేసుకుంటూ తల్లి దగ్గర కొచ్చింది.

"ఏమిటమ్మా?" అన్నాడు ప్రసాదు మంచంమీద కూర్చుని.

రాధ పైట కొంగులోంచి తీసిన ఉత్తరం ఒకటి ప్రసాద్‌కిచ్చి చదవ మంది.

"ఏమిటమ్మా ఇది?"

"ఏమోనాయనా! మధ్యాహ్నం ఈ ఉత్తరం వచ్చినప్పటి నుంచి రుక్మిణి అదోలా అయిపోయింది. సుశీల ముఖం చిన్నబోయింది. నాకు ఏదో తెలీకుండ దాస్తున్నారనిపిస్తూంది...."

ప్రసాద్ ఉత్తరం చదివేడు. అతని ముఖం వివర్ణమైపోయింది. దీనంగా తల్లిముఖం చూసేడు.

"ఏముందిరా అందులో?" ఆత్రతగా అడిగింది రాధ.

ప్రసాద్ గుటకలు మింగేడు.

"చెప్పునాయనా!" మీరిద్దరూ నానుండి ఏదో దాస్తున్నారు. చెప్పకపోతే నామీద ఒట్టే!...."

"అమ్మా!"

"చెప్పునాయనా!"

ప్రసాద్‌కి తప్పలేదు. "ఇది సుశీల మామగారు వ్రాసిన ఉత్తరం. పిన్ని కుటుంబానికీ ఒక వేశ్యకూ సంబంధం ఉన్నట్లు తెలిసిందనీ పెళ్ళిముందే ఈ విషయం చెప్పక మోసం చేసేరనీ, సుశీ లను ఎన్నటికీ వాళ్ళింటికి తీసుకెళ్ళడం జరగదనీ వ్రాసేరు.

రాధ నెత్తిమీద పిడుగు పడ్డట్ల యింది. కొంత సేపటికి కోలుకుంది. కొడుకు కళ్ళల్లోకి చూసింది. ప్రసాద్ జాలిగా తల్లి కళ్ళల్లోకి చూస్తున్నాడు. రాధ మెల్లగా లేచి వెళ్ళిపోయింది.

తీసిన చోటే ఉత్తరం పెట్టేసి వెనక్కి తిరిగింది, రుక్మిణి!

"నేనానాడే చెప్పేనమ్మా నా నీడ పడితే కాపురాలు నిలువవని! కాని నా తోనే ఉంటానని మొండిపట్టు పట్టేవు!

చూసేవా ఇప్పుడే మయింది?" అంది రాధ.

"జరగవలసింది జరుగుతుందక్కా! నీ నీడే పడకపోతే మొదటినుంచీ ఏమేమి జరిగేవో ఎవరు చూడొచ్చేరు! అసలు ప్రాణాలతో ఉండేవాళ్ళమో లేదో! అయినవాళ్ళు అడవిలో వదిలినట్లు వది లేస్తే నీ రూపంలో దేవుడొచ్చి సాయం చేసేడనుకున్నాను! అలాగే ఏదో దారి ఉండకపోదు! చూద్దాం. ఎటొచ్చీ నిన్నటి దాకా అంత ఆశలు పెట్టుకొన్న పసిదాని మనసు ఎంత చిన్నబుచ్చుకుందో అనే ఆలోచన బాధపెట్టింది కాని మరేంకాదు! నువ్వేం మనసులో పెట్టుకోకు," అంది రుక్మిణి.

మర్నాడు విషయం తెలిసిన శ్రీనివాసు కోర్టు కెక్కుదాం అన్నాడు. అనేక రకాలుగా ఆ వే శా లు చూపిస్తున్న అందర్నీ రాధ వారించింది.

"గుర్రాన్ని చెరువుదాకా తీసుకెళ్ళ గలం గాని నీరు త్రాగించగలమా నాయనా? బలవంతాన వాళ్ళ అహాన్ని కొట్టి మన అమ్మాయి నక్కడికి పంపినా గాయాలు రేగి పగలు ఇంకా ఎక్కువ అవుతాయి! ఈ విషయం నాకు వది లెయ్యండి! అది ఎప్పటికైనా సుశీలే పరిష్కరించు కునేటట్లు చెయ్యాలి," అంది. రుక్మిణికి కొంత ధైర్యం కలిగింది.

# 3

ఆనాటినుండి రాధ సుశీల విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది. ఆమెను రోజూ అలంకరించేది. కట్టుకునే బట్టల దగ్గరనుండి ఎన్నికచేసేది. ఆమె హావ భావాల్లో మోటుగా బాగులేని వాటిని సంస్కరించింది. కంటికి కాటుక పెట్టు కోవడం దగ్గరనుండి తలలో పూలు పెట్టుకోవడం వరకూ ఒకదానికొకటి కుదిరేలా అన్నీ ఆమె శరీరానికి తగినట్లుగా మళ్ళీ ఏమాత్రం అసహజత్వం కనబడకుండగా తీర్చి దిద్దేది. పదిరోజుల్లో సుశీల ఇంత అందంగా ఉందా అని రుక్మిణే ఆశ్చర్య పోయింది.

ఆ తర్వాత ఒకరోజు ఆనంద్‌ను ఆ ఫీ సు లో కలుసుకోమని ప్రోత్స హించింది. ఆఫీసులో అతను ఎలా ఉంటాడో ఏంచేస్తూ ఉంటాడో వివరా లన్నీ సుశీలను అడిగింది. తెలుసు కున్న తర్వాత జరుగబోయే సమా వేశాన్ని నటించి చూపించింది. నటించే టప్పుడు అప్రయత్నంగా సుశీలస్థానంలో కృష్ణమూర్తిని ఊహించుకొని భావా వేశంతో కళ్ళ నీళ్ళు నిండిన రాధను చూసి సుశీల ఆశ్చర్యపోయింది.

"ఇదంతా నటన కాదమ్మా! నీ మనిషిని నువ్వు వలచినప్పుడు అతి సహజంగా వస్తాయమ్మా!" అంది రాధ.

ఆ మర్నాడు సుశీల పుట్టినరోజు.

మబ్బురంగు పట్టుచీరా జాకెట్టూ ధరించింది. తలంటుకొని పొడారిన జుట్టును వదులుగా ముదురు నీలిరంగు రిబ్బనుతో ముడివేసుకుంది. సన్నని గొలుసొకటి మంగళసూత్రంతో పాటు మేడలో వేసుకుంది. మబ్బురంగుకు పోటీగా మెడలోని కుత్తికంటూ, కళ్ళకు సన్నగా కాటుకా కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి.

ఆనంద్ కేబిన్‌లోకి సుశీల వెళ్ళేసరికి అతను ఎవరితోనో టెలిఫోన్‌లో మాట్లాడుతున్నాడు.

సుశీలను చూడగానే మాట తడబడి ఏదో అయిందనిపించి ఫోను పెట్టేసేడు.

ఆమెనుండి దృష్టి మరల్చుకోలేక అలాగే చూసేడు. సుశీల అమాయకంగా రెప్పలు రెపరెపలాడించింది.

"సాహసించి ఇక్కడికి వచ్చినందుకు మన్నిస్తారు కదూ!" తెల్లని పెద్దకన్నుల్లో రెప్పల అంచున తళతళలాడిన కాంతి ఆనంద్ హృదయంలో అశాంతిని రేపింది. తనను అన్యాయం చేసినట్లు కోపంతో భావిస్తూ ఉంటుంది అనుకున్న సుశీలను ఇలా చూసేసరికి మనసు పట్టుతప్పి పోయింది.

"రెండు నిముషాలు కూర్చోవచ్చా?" అంది సుశీల.

"కూర్చో!" అన్నాడు మనసులో సానుభూతిని పైకి ప్రకటించకుండా ఆనంద్.

"మీ నాన్నగారు వ్రాసిన ఉత్తరం చదివేను. చిన్నప్పుడు స్కూల్లో చదువుకున్న తోడేలూ మేకపిల్ల కథ గుర్తొచ్చింది. అయినా నా పూర్వీకుల చరిత్రకు నే నేంచేయగలుగుతాను. మీతో గడిపే క్షణంకోసం కలలుగంటూ ఉన్న నాకు....సరేలేండి! బహుశా నా అదృష్టం ఇంతేనేమో!....ఈ రోజు నా పుట్టినరోజు. చేసుకోవాలనిపించలేదు. సాహసించి ఒకసారి మీ దగ్గరకు ఎలాగైనా రావాలనీ, మిమ్మల్ని ఒకసారి కన్నులారా చూడాలని అనిపించి....వచ్చేసేను. బహుశా ఇవి తినడానికి అభ్యంతరం ఉండదనుకుంటాను...." అని స్వీటుబాక్సు ఒకటి ముందుకు జరిపింది.

ఇంతలో ప్యూను కాఫీ తీసుకొచ్చేడు. మళ్ళీ పిలిచేలోపలే అతను బయటకు వెళ్ళిపోయేడు.

"మీకు అభ్యంతరం లేకపోతే మీ చేత్తో కొంచెం కాఫీ ఇవ్వండి," అంది.

ఇద్దరూ మౌనంగా చెరిసగం కాఫీ త్రాగేరు.

"మనం కలుసుకోవడానికి వీలులేకపోయినా ఆ విషయం బయట అందరికీ తెలీకుండా ఉంచే మీకూ నాకూ కూడా కొంత అశాంతి తప్పుతుంది. మళ్ళీ మనసు పట్టలేనప్పుడు ఒకసారి చూసి పోతాను. ఏమీ అనుకోరు కదూ!"

కనురెప్పల్లో కన్నీళ్ళు తళతళలాడు తూంటే బయటకు వచ్చేసింది.

మరో పదిరోజుల తర్వాత ఒకరోజు సాయంత్రం కారులో బయటకు వెడుతూన్న ఆనంద్‌ను అతని ఆఫీసులో పనిచేసే కమల లిఫ్ట్ అడిగింది. బయట జోరుగా వర్షం కురుస్తూంది. ఆనంద్ కారు తలుపు తెరిచేడు. ఆమె లోపల కూర్చుంటూండే అప్పుడే ఎదురుగా ఆఫీసులోంచి బయటికొచ్చి వర్షంలో తడిసిపోయి సుశీల బస్‌కోసం చూస్తూ నిలబడింది. ఆనంద్ ఆమె ఒకరినొకరు చూసుకున్నారు. మర్నాడు ఆఫీసుకు వచ్చిన సుశీలతో మాటలమధ్య "ఆమె వర్షం వస్తూంటే లిఫ్టు ఇయ్యమంటే ఇచ్చేనంతే!" అని ఆనంద్ చెప్పకుండా ఉండలేకపోయేడు.

"ఎందుకు చెప్తున్నారు?" అంది సుశీల.

"నువ్వు మరోలా అనుకుంటావేమోనని?" అన్నాడు ఆనంద్.

"నాకు మరో ఆలోచన ఏమీ రాలేదు," అంది సుశీల.

క్రమంగా ఆనంద్‌లోని కఠినత్వం కరిగిపోయి సుశీల వచ్చినప్పుడల్లా మనసువిప్పి మాట్లాడటం మొదలు పెట్టేడు.

కొన్నాళ్ళ తర్వాత సుశీల ఆఫీసులో ఒక ఫంక్షను జరిగితే సుశీల నాట్యం చెయ్యడానికి ఒప్పుకుంది.

రాధ సుశీలకు ప్రత్యేకంగా నాట్యం నేర్పింది.

ఆనంద్‌ను సుశీల మరీ మరీ రమ్మని చెప్పింది. ప్రేక్షకులలో ఆనంద్‌ను చూసి సుశీల పరవశించి నాట్యంచేసింది.

ఆ తర్వాత కలిసినప్పుడు ఆనంద్ ఒక శనివారం సాయంత్రం పిక్నిక్‌కు వెడదామన్నాడు సుశీలతో. సుశీల సంతోషంగా ఒప్పుకుంది.

ఆ రెండు రోజులూ ఇద్దరూ ప్రపంచాన్ని మరచిపోయి సుఖ సాగరంలో మునిగిపోయేరు.

"దీనివల్ల నీకు అపవాదు వస్తే ఏం చేస్తావు?" అన్నాడు ఆనంద్.

"భర్తతో ఉన్నందుకు అపవాదు వేసే ప్రపంచాన్ని నేను లెక్క చెయ్యను. నాకు నా ఆత్మే సాక్షి," అంది సుశీల.

ఆ వాక్యం ఆనంద్ మనసులో ఏదో ప్రబోధించింది.

## 4

"ఏమండీ! రాధగారున్నారా?"

"ఎవరది?.... నేనే రాధను." అంది రాధ ఇంట్లోంచి బయటకువచ్చి. ఆమెకు ఒక నలభై సంవత్సరాలుంటాయి. రాధకు ఎప్పుడూ చూసిన గుర్తు రాలేదు.

"మీకు సుందరి తెలుసు కదూ?" అందామె.

"ఆ: తెలుసు."

# బ్రిటానియా పాల బిస్కట్



**పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!**

**రుచికరమైన, పుష్టికరమైన బ్రిటానియా గ్లాక్సో మిల్క్ బికీస్**




లింటాస్ - BBC.GLXMB.2-179

"ఆమె చావుబ్రతుకుల్లో ఉంది. మిమ్మల్నివొకసారి చూడాలంటూంది."

"అలాగా! ఎక్కడా?"

"నాతో రండి, నేను తీసుకొని వెడతాను," అందామె. రాధ రుక్మిణితో చెప్పి వెంటనే బయలుదేరింది.

ఊరి బయట అదొక పాడుపడిన ఇల్లు. అందులో ఒక నులకమంచంమీద లేవలేక పడుకొని ఉంది సుందరి. కుష్టు రోగంతో శరీరమంతా శిధిలంకాగా గుర్తుపట్టడానికి కూడా వీలులేకుండా ఉంది.

"గుర్తుపట్టేవా రాధా?" అంది రాధను చూడగానే.

"నువ్వా సుందరీ! ఇలా అయిపోయేవేమిటి?" అంది రాధ.

ఆమెను చూడగానే బాధలో మనసు కరిగిపోయింది. తమ వృత్తి బ్రతుకు చివరకు తమకిచ్చే కానుకను కన్నులారా చూసింది.

ప్రసాద్ పోలీసుస్టేషనులో టెలిఫోను మ్రోగింది. ప్రసాద్ రిసీవరు తీసుకున్నాడు. ఊరిబయట జరుగుతూన్న ఒక అవినీతి చర్యకు అదికంప్లెయింట్.

వెంటనే ప్రసాద్ తన బలగంతో జీప్‌లో బయలుదేరాడు. ఊరిబయట అది ఒక పాడుపడిన ఇల్లు. సిబ్బంది ఇల్లు చుట్టుముట్టేరు. ప్రసాద్ లోపలకు వెళ్ళి అక్కడ వేరువేరు గదుల్లో కామక్రీడల్లో ఉన్నవాళ్ళను కస్టడీలోకి తీసుకున్నాడు. మరో గదిలో ఉన్న తల్లిని చూసి ఆశ్చర్యపోయేడు.

తాను తెలియక ఒక విషమ వ్యూహంలో చిక్కుకున్నట్లు గమనించేడు.

గత్యంతరం లేక చట్ట ప్రకారం తల్లిని కూడా కష్టడీలోకి తీసుకొని స్టేషనుకు తీసుకొచ్చేడు. తానే బెయిలు ఇచ్చి విడిపించి ఇంటికి తీసుకొని వెళ్ళేడు.

ఆచూకీ తీయగా దీని వెనుక నరసింహం అనే అతడున్నాడని తెలిసింది. అతనికి పోలీసు ఆఫీసర్లతో చాలా మందితో స్నేహం. అతనంటే తన సిబ్బందికూడా ఎంతో గౌరవంగా చూస్తారు. ఒకవైపు తాను తన కర్తవ్యాన్ని ఏమాత్రం తప్పకుండా అమలు జరపడం తోటివారిని విపరీత పరిస్థితుల్లో ఉంచడం వలన వారు ఇది కావాలని చేసిందని తెలుసు. కాని తల్లినెందుకు ఇందులో ఇరికించారో అర్థంకాలేదు. ఇంట్లో ఈ మాటలు వచ్చినప్పుడు నరసింహాన్ని గురించి పూర్తిగా రుక్మిణి చెప్పింది. సుశీల పెళ్ళిలో వచ్చి అన్నీ చూసి వెళ్ళేడనీ బహుశా సుశీల మామగారు రాసిన ఉత్తరానికి కూడా అతనే కారణం కావచ్చుననీ అంది. ప్రసాద్‌కు అంతా అర్థంఅయింది.

ముందు అతనికి పోలీసు ఆఫీసర్లతో స్నేహానికి కారణం ఏమిటని ఆచూకీ

తియ్యండం మొదలుపెట్టేడు ప్రసాద్. దానికి ఇదివరకు పోలీసు స్టేషను ముందు అల్లరిచేసిన జర్నలిస్టు అరుణ ఎంతో సహాయంచేసింది. ఆమెదగ్గర గతంలో వ్యభిచారగృహాలు నడిపే కొంతమంది పెద్దమనుషుల గురించీ వారికి అధికార వర్గాలతో ఉన్న లింకుల గురించీ కొన్ని వివరాలు ఉన్నాయి. అవి అన్నీ పూర్తిగా ఋజువులు లేకపోవడంతో తనకే ఎదురుతిరగవచ్చుననే భయంతో వాటిని ప్రకటించలేదు. అవి చూసిన ప్రసాద్‌కు అన్నీ స్పష్టంగా అర్థ మయ్యేయి.

అయితే అవకాశం ఉన్నప్పుడే అన్నీ బయలుపరచాలని పైకి మాత్రం ఏమీ తెలియనట్లే ఉన్నాడు.

ప్రసాద్ ఊరిబయట చేసిన రెయిడ్‌లో పట్టుబడిన వారిమీద కేసు విచారణకు వచ్చింది.

కాని అందులో తల్లిని ఎలా శిక్ష పడ కుండా చూడాలో అర్థకావటంలేదు. తల్లి నిర్దోషి అని తెలుసు. కాని, అది కళ్ళు చెవులేకాని ఆలోచనా స్వాతంత్ర్యం లేని కోర్టుకెలా చెప్పడం అర్థంకాలేదు. రాధమాత్రం ఏమీ చలించలేదు.

కోర్టులో రాధను ప్రశ్నల వర్షం కురిపించేరు.

ఆమె సుందరిని చూడడం కోసం వేళ్ళేనని చెప్పగానే ఆమెతో ఎలా పరిచయం అనే ప్రశ్నతో మొదలుపెట్టి మొత్తం ఆమె గతాన్నంతా బయట పెట్టేరు.

చివరకు కోర్టులోకి సుందరి రావ డంతో అందరి కళ్లూ ఆమె మీదకు మళ్ళేయి. నడవలేక కుష్ఠురోగంతో దేకుకుంటూ వచ్చిన ఆమెకు భయపడి అందరూ పక్కకు తప్పుకున్నారు.

రామమోహనరావు బావమరిది నర సింహం ఒకరోజు తన దగ్గరకు వచ్చే డనీ రాధను గురించి ఎన్నో మాటలు చెప్పేడనీ చివరకు ఆమెను ఒకసారి చూడాలని ఉందా అని అడిగేడనీ చెప్పింది. వేశ్యావృత్తిలో సర్వనాశన మయిన అందరిమధ్యా ఒక మంచి దారి లోకి మళ్ళిన రాధను చూడడానికి సుందరి ఉవ్విళ్ళూరింది. ఆమెను ఊరిబయట ఒక పాడుపడిన ఇంటికి పంపించేడనీ రాధ అక్కడికి వస్తుందని చెప్పేడనీ చెప్పింది. కాని ఆ యింట్లో వేరే గదుల్లో ఏం జరుగుతున్నాయో తనకు గానీ రాధకు గానీ ఏమీ తెలియదనీ చెప్పింది. దాంతో రాధ విడుదల చేయబడింది.

అరుణను ఆ రోజు ప్రసాద్ ఇంటి కి పిలిచేడు. ఆవేశంతో ఆమె సాంఘిక సమస్యలను గురించి రాజకీయాల వరకూ వాదించడం మొదలుపెట్టింది.

అంత చిన్న వయసులో ఆమె మాట లను వింటూంటే రాధకెంతో ముచ్చట కలిగింది.

మాటల మధ్యలో అరుణ అంది.

"....ఈ వేశ్యాగృహాలు మొగలి పొదల్లాంటివి. వాటిలో ఏదో సుఖానికి తారట్లాడి వెళ్ళే వాళ్ళందరూ పాము కాటుకు గురికావలసిందే! వీటిని సమూలంగా నిర్మూలించే వరకూ ఈ సమాజానికి ముక్తి లేదు...." అని అప్పుడే టీ తెచ్చిన రాధను చూసి "మీరేమంటారు?" అంది.

"ఏమోనమ్మా! నేనేం చదువులు నేర్చినదాన్ని కాదు. కాని ఒకటిమాత్రం నా కనిపిస్తుంది. మనిషిలో ఉండే సహజమైన కోరికలు తీరే దారిలేనిదే వీటికి పరిష్కారం లేదు. తన ఆడతనాన్ని అసహ్యించుకొని, తన అందాన్ని మరుగుపరుచుకొని తన సృష్టికొక ప్రయోజనం ఉందని తెలియక కాపురంచేసే ఇల్లాలి చేతిలో ఏ మగడు సుఖపడతాడు. సుఖం పొందలేని ఏ మగవాడు బయటికిపోకుండా ఉంటాడు.

"ఒకనాడు వేశ్యాగృహాలు మొగలి పొదల్లాగే దూరంగా ఉండేవి. చట్టాలు చేసి వాటిని తెగసరికేరు. కాని మనిషి మారలేదుగా! ఇల్లాలు మారలేదుగా! కుష్ఠురోగం ఉన్నవాడు దాన్ని బయటికి కనబడకుండా బట్టలలో దాచుకుంచే నశించకుండా ఉంటాడా! మొగలి పొదల్లోని పాములు ఇళ్ళల్లోకే జొరబడతాయి...." అంది.

ప్రసాద్, అరుణా రాధ మాటలకు ఆశ్చర్యపోయేరు. ఆమె మాటల్లోని సత్యం కళ్ళకు కట్టినట్లు కనబడింది.

## 5

ప్రసాద్ స్టేషనుకు వచ్చేసరికి ఇనస్పెక్టర్ గోపీనాధ్, నరసింహంకూర్చొని పెద్దగా నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు. గోపీనాధ్ లేచి సెల్యూట్ చేసేడు. నరసింహం అయిష్టంగానే లేచి విష్ చేసేడు. ప్రసాద్ ఇద్దరికీ విష్‌చేసి తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

తాను నమ్మకంగా పెట్టిన కొత్త కానిస్టేబిల్‌ను పిలిపించి విశేషాలేమిటని అడిగేడు.

ఆ రాత్రి నరసింహం పెద్ద పార్టీ ఇస్తున్నాడనీ దానికి గోపీనాధ్‌ను పిలవడానికి వచ్చేడనీ చెప్పేడు. ఇతనేకాక పార్టీలో మరి కొంతమంది పోలీసు ఆఫీసర్లూ గవర్నమెంటు ఆఫీసర్లూ ఉన్నారని తెలిసింది.

వెంటనే ప్రసాద్ తనను చాలా అభిమానించే పోలీసు కమిషనర్‌ను కలుసుకున్నాడు. ఉన్నసమస్య వివరంగా చెప్పేడు.

అతను ఈ పార్టీ ఇవ్వడానికి కారణం ఒక పెద్ద అవినీతి కరమైన చర్యను కప్పిపుచ్చుకోడానికి కావచ్చనీ, అదీకాక పార్టీలో కూడా చాలా అసభ్యమైన కార్యక్రమాలు ఉండవచ్చనీ చెప్పి అతని సంఘ ప్రతికూల చర్యలు నిలపడానికి ఈ అవకాశాన్ని తప్పకుండా ఉపయోగించుకోవాలనీ చెప్పేడు.

# పరిమళానికి సరికొత్త భావన



# తులసి దర్‌బార్ బత్తి

నిరంతరం పరిమళాన్ని
వెదజల్లే అగరుబత్తి




నవరాత్రి, సుగంధ సారథి,
తులసి జవాజి అగర్‌బత్తీలు
తయారుచేయువారు.



సారథి పర్‌ఫ్యూమరీ వర్క్సు
గానిగర్ పేట బెంగుళూరు 560002

Rachana SPW-9

తగిన ఏర్పాట్లు చెయ్యడానికి కమిషనర్ అంగీకరించేడు. మఫ్టీలో నలుగురు ఆఫీసర్స్‌ను పార్టీలో పనిచేసేవాళ్ళుగా పంపించడానికి ఏర్పాట్లు చేసేడు.

తిరిగి ప్రసాద్ స్టేషనుకు వచ్చేసరికి అరుణ దగ్గర్నుంచి టెలిఫోను వచ్చింది.

ఆ రాత్రి నరసింహం జరపబోతున్న ఒక ఘాతుకమైన చర్యకు ఆధారాలు దొరికేయనీ అతన్నిప్పుడు ఆపకపోతే ఎందరో అమాయక యువతుల జీవితాలు నాశనం అయిపోతాయనీ వాదించింది.

ఇద్దరూ సాయంత్రం ఒక సంకేత స్థలం దగ్గర కలుసుకుంటే పూర్తి వివరాలు చెప్పగలనంది.

ఆ సాయంత్రం అరుణ చెప్పిన చోటుకి ప్రసాద్ వెళ్ళేడు. ఆమె చెప్పిన టైము దాటిపోయి పది నిముషాలయింది కాని ఆమె రాలేదు.

ప్రసాద్ ఆందోళన చెందేడు. ఇంతలో స్టేషనునుంచి ఒక కానిస్టేబుల్ ప్రసాద్ దగ్గరకు వచ్చేడు.

అరుణ పనిచేసే ఆఫీసునుండి టెలిఫోను వచ్చిందనీ అరుణ నెవరో ఎత్తుకుని పోయారనీ చెప్పేడు.

ప్రసాద్ వెంటనే ఆమె పనిచేసే పత్రిక ఆఫీసుకు వెళ్ళేడు.

ఆమె ఈ మధ్య అందమైన యువతులను బలాత్కారంగా దొంగిలించి విదేశాలకు తీసుకొనిపోయి వేశ్యావృత్తికి అమ్మబోతూన్న ఒక ముఠాను గురించి వివరాలు సేకరించిందనీ ఇప్పుడు ఆమె మాయమవడం ఆమెను అధికారులకు దూరంగా ఉంచడం కోసమేననీ తెలుసుకున్నాడు.

ఆమె టేబుల్లోని కాగితాలన్నీ వెదుకగా ఒక చిన్న బొమ్మ దొరికింది. అందులో ఊరికి పాతికమైళ్ళ దూరంగా ఒక చోటు గుర్తించబడి ఉంది. మిగిలిన చాలా కాగితాల్లో ఆ చోటుకు సంబంధం ఉన్నట్లుగా ఉంది.

తగిన బలగం తీసుకొని అటువెళ్లేడు ప్రసాద్.

## 6

రాత్రి నరసింహం ఇంట్లో భారీ ఎత్తున పార్టీ జరుగుతూంది. మత్తుగా విదేశీ సంగీతం హాలంతా సుగంధ పరిమళాలతోబాటు అలుముకుంటూంది. వాటితో కలసి సిగరెట్ పొగలూ మసాలా వాసనలూ కలసిపోయేయి.

ప్రత్యేకంగా అందర్నీ తానే స్వయంగా కలుసుకొని మర్యాదచేసేడు నరసింహం. చివరకు హాతురు మాలినికి సైగచేసి తాను ఓసారి వాచీ చూసుకొని అందరితో కొద్దిసేపట్లో వస్తానని బయటకు వెళ్ళేడు.

నిషాలో ఉన్న అందరూ ఒక్కసారి కలిగిన సంచలనం చూసి హాలు మధ్యకు దృష్టి మరల్చేరు.

## [illegible] వచ్చిన తర్వాత, పాలు మాత్రం యిస్తే చాలదు



### డాక్టర్లు సిఫార్సు చేస్తారు



# ఫారెక్స్®

### మీ పాపాయియొక్క ఆదర్శవంతమైన ఘన ఆహారం

డాక్టర్లు ఫారెక్స్ సిఫార్సు చేస్తారు! ఎందువల్ల?

ఎందుకంటే, మీ పాపాయి ఘన ఆహారం తీసుకోవడం ప్రారంభించే సమయంలో అతడి అవసరాలను తీర్చే సంపూర్ణ సంతులిత ఆహారం ఇది. దీనిలో మెదడు, శరీరం పెరుగుదల కోసం తగినన్ని సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లు, శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, గట్టి ఎముకలు, పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ డి ఉన్నాయి. అన్నిటికంటే ముఖ్యంగా, ఆరోగ్యమైన రక్తం కోసం తగినంత ఐరన్ ఉంది.

ఆ నెలలప్పుడు పాపాయి జీర్ణకోశం ఇంకా మామూలు ఘన ఆహారాలను తీసుకోలేనంత సున్నితంగా ఉంటుంది. ఫారెక్స్ పాపాయి జీర్ణశక్తికి తగినట్టు ప్రత్యేకంగా తయారుచేయబడింది. సరిగ్గా నమిలి చక్కగా జీర్ణంచేసుకోవడం పాపాయి నేర్చుకోవాలి. ఫారెక్స్ అందుకు తోడ్పడుతుంది.

ఫారెక్స్—కొత్త 200 గ్రా. అట్టపెట్టెలో కూడా లభిస్తుంది. ఎంతో ఆదా... మరెంతో శ్రేష్ఠత!




**[illegible]మైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం**

[illegible]-GLF/[illegible]

పదిమంది నవయౌవనంలో ఉన్న యువతులు నాట్యం ప్రారంభించేరు. వారిమధ్య రాణిలా ఉంది మాలిని.

సంగీతంలో స్పీడు ఎక్కువవవుతూంటే త్రాగేవారి మెదడులో మత్తు పెరుగుతూంటే అందరూ ఒక్కొక్క వస్త్రాన్నే నేలకు జారవిడుస్తున్నారు.

అరగంట గడిచేసరికల్లా మాలినితో పాటు యువతులందరూ శరీరంమీద ఏ అచ్ఛాదనా లేక నగ్నంగా నిలబడ్డారు. ఉద్రేకపూరితమైన ఆ వాతావరణంలో మరోసారి సంచలనం కలిగింది.

బయట పోలీసువ్యాన్ వచ్చింది. లోపల సర్వర్స్ వేషంలో ఉన్న ఆఫీసర్స్ బయటకు పోయేవారిని అటకాయించేరు.

అక్కడ సుమారు ఇరవై మంది యువతులను రహస్యంగా విదేశాల కోసం బొంబాయి పంపడానికి ఏర్పాటు చేస్తున్న నరసింహం ప్లానంతా తల్ల క్రిందులు చేసేడు. అన్నింటికీ సిద్ధపడిన నరసింహం మారణాయుధాలతో ప్రసాద్‌ను ఎదుర్కొన్నాడు.

ప్రసాద్ ప్రాణానికి లెక్కచెయ్యకుండా తెగించి చిట్టచివరకు నరసింహాన్ని చేజిక్కించుకున్నాడు. అలాగే అదే యింట్లో బంధింపబడిన అరుణను కూడా విడిపించుకున్నాడు.

ఆ కేసులో నిందితులకు శిక్షవేసి తీర్పు చెప్తూ జడ్జి ఇలా అన్నాడు:

"ఒకప్పుడు వేశ్యావృత్తిలో పుట్టి పెరిగినవారందరూ అందులోని నైచ్యాన్ని గుర్తించి సంఘంలో బాధ్యత గల పనులను తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తూంటే, గతంలో సమాజంలో ఉన్నత కుటుంబాల్లో పుట్టి పెరిగినవాళ్ళే తమ కన్నకూతుళ్ళనుకూడా ఈ వృత్తిలోకి దింపడం చాలా విచారాన్ని కలుగ చేస్తూంది. ఒక జాతి ఒక తరంలో నుండి మరో తరంలోకి పురోగమిస్తూంటే మరొక జాతి ఒక తరంలోనుంచి మరో తరంలోకి తిరోగమించడం చదువుకున్న వారి సంస్కృతి ఎంత నీచాతినీచంగా దిగజారిపోతూందో తెలుస్తూంది. అంతరాత్మ ఉన్న ప్రతిమనిషీ ఇది శాయశక్తులా నిరోధించవలసిన విషయం."

అందరికంటే ఎక్కువ శిక్ష నరసింహానికి పడింది.

మాలినికి కూడా శిక్ష పడింది.

## 7

ఎదురుగా నిలబడిన ఆనంద్‌ను చూసి రాజారావు తలెత్తేడు. ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా చూసేడు.

"నాన్నా! నేను సుశీలను తీసుకురావాలనుకుంటున్నాను."

"ఎక్కడికి?"

"మనింటికి."

"వీల్లేదు."

"ఎందుకో తెలుసుకోవచ్చా?"

"నీకు ఇదివరకోసారి చెప్పేను.





# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా ఉంచేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘంగా పనిచేస్తుంది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం : ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

నా ఉద్దేశంలో, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్నా ఎక్కువగా కోల్గేట్‌నే కొంటున్నారు!




ఒక్క దంతవైద్యులు మాత్రమే ఇంతకన్నా మెరుగైన దంతరక్షణ సమకూర్చగలరు.

వాళ్ళకు ఒక వేశ్యతో సంబంధం ఉందని తెలిసింది."

"కాని ఆమెను మనంతట మనం కావాలని పెళ్ళి చేసున్నాం."

"వాళ్ళు ముందే ఈ విషయం చెప్పి ఉండవలసింది."

"ఏమని?"

రాజారావుకు వెంటనే జవాబు తోచ లేదు.

"మా కుటుంబానికి ఒక వేశ్యతో సంబంధం ఉందనా?"

"ఏమయినా సరే ఆమె నిక్కడికి తీసురావడానికి వీలులేదు."

"అయితే నేనే ఆమె దగ్గరకు వెడుతున్నాను."

"బాగా ఆలోచించుకున్నావా?"

"బాగా ఆలోచించుకునే చెప్తున్నాను. కాని మీరు మనసు మార్చుకొని ఎప్పుడు పిలిచినా తి రి గి వ స్తా ను సుశీలతో కలసి."

రాజారావు నిశ్చేష్టుడయి నిలబడి ఉండగానే ఆనంద్ తన బట్టలు ఒక సూట్‌కేస్‌లో సర్దుకొని బయటికి నడచి వెళ్ళిపోయాడు.

ఆనంద్‌ను చూసి ఇంటిల్లిపాదీ ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యేరు. రుక్మిణీ కళ్ళల్లోనుండి ఆనందబాష్పాలు జలజలా రాలిపోయేయి.

వంటింట్లో పనిచేస్తూన్న రాధ దగ్గర కెళ్ళి అమాంతం కౌగలించుకుంది. ఆనంద్ రావడం విని ఎంతగానో సంతోషించింది రాధ. కళ్ళు మూసుకొని ఒక్కసారి మనసులో కృష్ణమూర్తిని ధ్యానించుకుంది.

"మొత్తానికి మా చెల్లాయి వావగార్ని ఇంటికే రప్పించుకుంది" అన్నాడు ప్రసాద్ సుశీలను చూసి.

"నువ్వుకూడా మా అన్నయ్యను ఇంటికే రప్పించుకో!" అంది సుశీల ప్రసాద్ పక్కనే ఉన్న అరుణతో.

అందరూ ఒకే కుటుంబంగా కలసి ఉండడం చూసిన రాధఆనందానికి పట్టపగ్గాల్లేవు.

ఆ రాత్రి సుశీల మల్లెపూల జడ కడుతూ "మొగలి పొదలు పెరట్లో నాటుకోవడం మంచిది కాదు కాని ఏకాంతంగా భర్త ఒడిలో చేరబోతూ కట్టుకున్న మల్లెపూల జడలో ఒక్క మొగలి రేకు మాత్రం తప్పకుండా ముడుచుకోవాలమ్మా! అప్పుడే శోభవస్తుంది" అంటూ భవగర్భితంగా సుశీల కళ్ళల్లోకి చూసింది రాధ.

అందులో భావాన్ని గ్రహించి సిగ్గుతో బుగ్గలు ఎరుపెక్కగా తల వంచుకుంది సుశీల.

(సమాప్తం)

Printed and Published by A Chandra Sekhar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001 Editor. A. SUDHAKARA RAO

